



ముఖచిత్రం: గోకుల జయంతి

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య


యువ సాలు చందా

దీపావళి ప్రత్యేక సంచికతో రు. 21—00

రిజిష్టరు పోష్టులో రు. 22—00

యువ వడపళని మద్రాసు-26




ఆర్యా.

జులై 'యువ' చదివాను. అందులో శరత్‌బాబుగారి 'బ్రాహ్మణపిల్ల' చాలా బాగుంది. కథల్లో 'మేడ్ ఫర్ ఈచ్ అదర్', 'ఆత్మవంచన' అత్యద్భుతంగా యున్నవి. ముఖ్యంగా ముఖచిత్రములు మమ్మల్ని ఎంతో ఆకర్షించుతున్నా యనడంలో ఎట్టి సందేహం లేదు. శరత్‌బాబు గారి రచనలు ప్రచురిస్తున్నందుకు మీకు నా హార్దికాభివందనాలు.

—అద్దంకి వెంకటేశ్వరరావు,
**అనంతపల్లి.**

జులై సంచికలో శరత్‌బాబు 'బ్రాహ్మణపిల్ల'; శ్రీరంగం ఎ. శ్రీనివాసరావు 'ఆత్మ వంచన'; పంతుల బోగారావు 'పొత్తు కుదిరింది' చాలా బావున్నాయి. మీనా (సీరియల్) అద్భుతం.

—యస్. కనకారావు, పర్లాకిమిడి.

జులై సంచికలో యర్రంశెట్టి శాయి గారి 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' మరియు శ్రీరంగం ఎ. శ్రీనివాసరావు గారి 'ఆత్మ వంచన' కథలు బాగున్నాయి. లేఖలు శీర్షికలో ప్రశంసలే గాకుండా విమర్శలకు కూడా తావిస్తే రచయితలకు ఎంతగానో

తోడ్పడుతాయి.

—బి రామయ్య, లద్నూలు.

ఒక కధ చదవగానే ఫరవాలేదు, బావుంది, లేదా చాలా బావుంది అని అన్పిస్తే దాని స్థాయి తెలుస్తుంది. అలా కాక మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తే అది నిస్సందేహముగా చాలా మంచి కథ అని అర్ధం. మంచి కథకి లక్షణాలేమిటో వెదకటం అనవసరం. యువ జులై సంచికలోని శరత్‌బాబుగారి 'బ్రాహ్మణ పిల్ల' మంచికథ. కథ మొదటినుంచి చివరి వరకూ చాలా పట్టుగా సాగింది. సన్నివేశాలు గుండెలను పట్టివేశాయి. ఊపిరాడనీయలేదు. 'సంధ్య' వివాహ సంఘటన చదువుతూంటే అప్రయత్నంగా మా కళ్ళు చెమర్చాయి. మిగతా అన్ని కధలూ, ముఖ్యంగా 'ఆ వూరికథ' 'చింత చచ్చినా' 'పనిపిల్ల' కధలు పునః పరిశీలనావశ్యకతను కలిగించేలా వున్నాయి.

—వెలిశాల ముత్తేందర్, 'కళాప్రియ'

జులై నెల యువ సంచికలోని సంపాదకీయం చాలా బావుంది. పాలగుమ్మి పద్మరాజుగారి 'చింత చచ్చినా', శ్రీ ఏ. శ్రీనివాసరావుగారి 'ఆత్మవంచన' కథలు అత్యద్భుతంగా వున్నాయి. మీనా సీరియల్ ఇంటరెస్టింగా వుంటోంది.

—కె. వి. ఎన్. ఆర్. నాయుడు,
ఆర్. పాళెం (నెల్లూరు)



జెమిని సమర్పించు

మధు మూవీస్

# కళ్యాణ మంటపం

దర్శక, నిర్మాత: వి. మధుసూదనరావు

సంగీతం: ఆదినారాయణరావు, చిత్రీకరణ: వెంకటరత్నం, మాటలు: శివరామకృష్ణ

నవయుగ

యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 23 ఆగస్టు—1971 సంచిక 8

ఆంధ్రప్రదేశ్‌లో విద్యావిధానం విషయంలో ప్రభుత్వం ఒక ముఖ్యమైన నిర్ణయం అమలు జరుపబోతున్నది. అదేమిటంటే, ఇకమీదట ప్రతి సంవత్సరమూ, ప్రతి క్లాసుకూ పరీక్షలు వుండవు. మొదటి తరగతిలో చేరిన విద్యార్థి, ఏ పరీక్షా అవసరంలేకుండా ఏడవ తరగతివరకు ఎకాయెకిని, ఏడాదికి ఒక తరగతి చొప్పున పైకి వెళ్ళిపోతాడు. ఏడవతరగతి చదువు పూర్తికాగానే, పరీక్ష వ్రాయాలి. అయితే, యీ పరీక్ష ఇదివరకులాగ, ఏ స్కూలు విద్యార్థులకు ఆ స్కూలులో జరిగే పరీక్ష కాదు. ఏ జిల్లాలోని స్కూళ్ళన్నిటికీ కలిపి, రాష్ట్రం మొత్తానికి స్కూలు పైనలు పరీక్ష జరిగినట్టుగా జరుగుతుంది. ఏడవ తరగతి పరీక్ష ప్యాసయిన విద్యార్థులకు, మళ్ళీ పదవ తరగతి దాకా పరీక్షలు లేవు. పదవ తరగతి చదువు పూర్తి అయిన తరువాత, ఆ తరగతి విద్యార్థులందరికీ, రాష్ట్రంలోని అన్ని స్కూళ్ళకూ కలిసి, స్కూలు పైనలు పరీక్ష జరిగినట్టుగా జరుగుతుంది. పదవ తరగతి పరీక్ష ప్యాసయిన విద్యార్థులు, కాలేజిలో ఇంటర్మీడియేట్ తరగతిలో చేరవచ్చును.

రాష్ట్రప్రభుత్వం చేసిన ఈ నిర్ణయం, చాలా సాహసవంతమైనదే. అయితే, విద్యాబోధన విషయంలో మంచి కట్టు దిట్టంతో కూడిన ఏర్పాట్లు జరిగిన పక్షంలోనూ, విద్యార్థులలో క్రమశిక్షణ లోపం లేకుండా చూసిన పక్షంలోనూ, ప్యాసయిన

విద్యార్థులు భవిష్యత్తును గురించి ఆందోళన పడనవసరంలేని విద్యావిధానాన్ని అమలు జరిపినట్లయితేనూ, ప్రతి సంవత్సరం జరిగే పరీక్షలను ఎత్తి వేయ్యడంలో రాష్ట్ర ప్రభుత్వం చేసిన నిర్ణయం ప్రయోజనకరమవుతుంది.

ఈ నాటి విద్యా విధానం, ఏ కొద్ది మార్పులతోనో తప్ప, నూరేండ్లనాడు రూపొందించబడినది. ఆ నాటి పరిస్థితులలో, గవర్నమెంటు ఉద్యోగాలకు ఇంగ్లీషు చదువుకున్నవారిని తయారు చెయ్యడానికి విద్యా విధానం తయారు చెయ్యబడింది. తరువాత, స్వల్పమైన మార్పులు అప్పుడప్పుడు జరుగుతూ వున్నప్పటికీ, ఆ విద్యా విధానంలో చెప్పదగిన పెద్ద మార్పులు ఏమీరాలేదు. కాలేజీలనుంచి డిగ్రీలు తీసుకొని బయటికి వస్తున్న విద్యార్థులందరూ, కుర్చీలలో కూర్చుని చేసే ఉద్యోగాలనే కోరుతున్నారు. నూరేళ్ళనాడు, ఇంగ్లీషు చదివిన ప్రతివాడికీ గవర్నమెంటు ఉద్యోగం దొరికింది. క్రమంగా గవర్నమెంటు ఉద్యోగాల సంఖ్య పెరగడమే కాకుండా, వ్యాపార విస్తరణ బాగా జరిగింది అయినా, చదువుకుంటున్నవారి సంఖ్య ఏటేటా పెరిగిపోతున్నందున, చదువుకున్నవారందరికీ ఉద్యోగాలు దొరకని పరిస్థితి నలభై ఏళ్లనాడే వచ్చింది. అయినా, ఉద్యోగాలకోసం చదువుకోవడం అనే పద్ధతి మారలేదు. విద్యా విధానంలో మార్పు రాలేదు.

ప్రతి వ్యక్తికీ బుద్ధి వికాసం కావాలి. ప్రపంచ జ్ఞానంకావాలి. బుద్ధి వికాసాన్ని పెంపొందించుకోడానికీ, ప్రపంచ జ్ఞానాన్ని వృద్ధిచేసుకోవడానికీ అనవసరమైనంత వరకు మాత్రమే స్కూళ్లలోను చదువుకోవడం మంచిదనే భావం ఎవరికీ కలగలేదు. ఏదో ఒక డిగ్రీని సంపాదించుకుంటే దానిమూలంగా ఏదో ఒక ఉద్యోగం సంపాదించుకోవచ్చుననే భావంతో విద్యార్థులు చదవడమూ, డిగ్రీని సంపాదించుకోవడానికి పరీక్ష ఎలాగయినా ప్యాసుకావడానికి ప్రయత్నం చెయ్యడమూ, కొన్ని సందర్భాలలో అక్రమమైన మార్గాలను అనుసరించడమూ కూడా జరుగుతోంది. ఎక్కువ మార్కు వెయ్యడానికి ఉపాధ్యాయులు లంచం తీసుకుంటున్నారనే అప్రతిష్ఠ కూడా వచ్చింది. ఇలాటి విద్యా విధానానికి స్వస్తి చెప్పడం చాలామంచిది.

అయితే, వున్న విధానానికి స్వస్తి చెప్పడం సులభమే కాని ప్రయోజనకరమైన నూతన విధానాన్ని తయారుచేసి, అమలు జరపడం సులభంకాదు. ఇది చాలా దురాలోచనతోనూ, బాధ్యతతోనూ చెయ్యవలసిన పని. నూతన విద్యా విధానం, విద్యార్థులను ప్రయోజకులైన భావిపౌరులుగా తయారు చేయగలదై వుండాలి. ప్రతి

విద్యార్థి విషయంలోనూ, తగు పరిశీలన చెయ్యగల ఉపాధ్యాయులు వుండాలి. విద్యార్థి ప్రతిభ, అభిరుచి, కృషి—యీ మూడింటినీ పరిశీలించి, ఆ విద్యార్థి జీవితంలో యే ఉద్యోగంలో, ఏ వృత్తిలో, ఏ రంగంలో రాణించగలడో, ఆ విద్యను అతడికి నేర్పడానికి అవకాశం కలిగించాలి. ప్రతి విద్యార్థికీ, సమర్థతతో కృషిచేసి జీవితాన్ని, గౌరవయుతంగా సాగించుకోవడానికి, ఏ వృత్తి అయినా మంచిదే అనే భావాన్ని కలిగించాలి. కాయకష్టంతో కూడిన వృత్తిని అవలంభించినంత మాత్రాన, ఆత్మ గౌరవం సశించదనే సంగతిని బోధపరచాలి.

ఈ నాటి డిగ్రీదారులు ఒక పెద్ద భ్రమలో వున్నారు. డిగ్రీ సంపాదించిన తరువాత, నడుమువంచి పనిచెయ్యడం మర్యాదకు లోపమని, ఈ పొరపాటు అభిప్రాయాన్ని పోగొట్టడం చాలా అవసరం. విద్యార్థులు యీ భావాన్ని చిన్నతనంలోనే పోగొట్టి, ప్రతి విద్యార్థికీ—అతడి అభిరుచి, ఏ వృత్తిపై వుంటుందో గమనించి, ఆ అవసరమైన కృషి అతడు చెయ్యగలిగినట్లయితే, ఆ వృత్తిని అవలంభించడానికి కావలసిన విద్య అతడు పొందగలిగే అవకాశాన్ని కలిగించాలి. తనకు అభిరుచిలేని వృత్తి విద్యలో డిగ్రీని ఏదోవిధంగా సంపాదించి, చివరకు ఆ వృత్తికాక మరొక వృత్తిలో ప్రవేశించినవారు ఎంతోమంది వున్నారు. ఇలాటివారు, తమకు అక్కర లేని విద్యలో డిగ్రీని సంపాదించడానికి డబ్బునూ, కాలాన్నీ పాడు చేసుకోవడమే కాక, ఆ వృత్తిలో రాణించే మరొక అభ్యర్థి అవకాశాన్ని పాడుచేసిన వారవుతున్నారు.

కుర్చీలో కూచుని చేసే వుద్యోగాలు ఎక్కువ లేకపోయినా, యువకులకు వృత్తి అవకాశాలు నేడు చాలా ఎక్కువగానే వున్నాయి. అయితే, ప్రతివృత్తికీ దానిపట్ల అభిరుచి గలవారూ, దీక్షతో దానిని అవలంబించగలవారూ కావాలి. విద్యార్థుల అభిరుచిని కనిపెట్టడంలోనే, ఉపాధ్యాయుల ప్రజ్ఞ వుంది. దానికి, ఉపాధ్యాయులకు తగిన శిక్షణ కావాలి. అంచేత, సుశిక్షితులైన ఉపాధ్యాయులను తయారుచెయ్యడంకూడా, చక్కని విద్యావిధానాన్ని అమలు జరపడానికి చాలా అవసరం. అంచేత, ఏ మాత్రం కాలయాపన లేకుండా ప్రభుత్వం, సమగ్రమైన విద్యావిధానాన్ని రూపొందించి అమలు జరపాలి.






# దీపావళి పండుగ బహుమానం

'యువ' పాఠకులు, చందాదారులు తమ తమ బంధువులకు, మిత్రులకు 'యువ' బహుమానంగా ఒక సంవత్సరం పంపవచ్చును. పండుగకు గాను ప్రత్యేకంగా రూ. 21—00 (దీపావళి ప్రత్యేక సంచికతో) తగ్గించినాము. పాఠకులు ఈ అవకాశము అక్టోబరు 1-వ తేదీ వరకు ఉపయోగించుకోవచ్చును. దీపావళి సంచిక రిజిష్టరులో పంపగోరిన రూ. 22/—పంపవలసి వుంటుంది.

వడపళని,
మద్రాసు-26.

మేనేజర్,
యువ.




ఆరోజు అన్నపూర్ణమ్మగారి భవనం చాలా సందడిగా హడావుడిగావుంది. దాసీలు ఇటూ అటూ చకచక తిరుగుతున్నారు. అన్నపూర్ణమ్మ వాసంతికి ఏదో చెప్ప బోతూంటే శ్రీకాంత్ వచ్చేడు.

"అమ్మా, మాకు వాసంతితో కాస్త పనుంది, నువ్వుకూడా ఇలారా." అంటూ పిలిచేడు.

ముగ్గురూ కలిసి డ్రాయింగ్ రూంలోకి నడిచేరు. అక్కడ ఇంకా—వాసంతి అన్న రాజు, మరో ఇద్దరు మిత్రులూ వున్నారు. అన్నపూర్ణమ్మ గదిలోకి రాగానే అంతా లేచి ఆమెకి నమస్కరించేరు.

'వీణ'

"వాసంతీ, ఇక్కడున్న మా అందరికీ నువ్వు వీణ వాయించగా వినాలనుంది." అంటూ కుర్చీలో కూర్చున్నాడు శ్రీకాంత్.

"అమ్మో, నావల్ల కాదు బాబూ!" అంటూ పారిపోబోతూన్న వాసంతి చెయ్యి పట్టుకున్నాడు శ్రీకాంత్.

"ఎందుకలా బెదిరిపోతావ్? వీణ వాయించడమేగా—నీ చేతిలోవున్న పనే. కాస్త మా మీద దయ చూపించావంటే ఆనందలహరిలో మేమంతా మునిగి తేలి ఉక్కిరి బిక్కిరై "

క్షణాల్లో వీణ సభలో అమర్చబడింది. వీణని చేతిలోకి తీసుకొని తీగలను చేతివేళ్ళతో నిమరసాగింది వాసంతి. ఆ మధురధ్వని అతిధుల వీనులకి విందు చేసింది. ఆ సంగీతంలో ఏదో అలౌకిక శక్తివుంది. ఆకర్షణవుంది. అందరి హృదయాల్లోనీ హర్షోల్లాసాలు నృత్యం చేయసాగినై.

శ్రీకాంత్ కనురెప్పయినా వేయకుండా వాసంతి అమాయక వదనాన్ని దీక్షగా చూస్తున్నాడు. ఇంతకుముందు ఆమె ముఖం మీదుండే అల్లరి చిరునవ్వు ఇప్పుడు లేదు. వీణ చేతిలోకి రాగానే ముఖం గంభీరంగా మారిపోయింది.

వాసంతి—రాజూ అంతగా లేని కుటుంబానికి చెందినవారు. శ్రీకాంత్ వాళ్ళకి అండగా నిలబడి ఏ విషయంలోనూ కూడా లోపమన్నది లేకుండా కనిపెట్టూ వస్తున్నాడు. ఆ అన్నాచెల్లెళ్ళ ఆనందం కోసం—ఎట్లాంటి త్యాగానికైనా శ్రీకాంత్ సిద్ధమే! వాసంతికి వీణ నేర్చుకోవాలని ఎన్నాళ్ళనుంచో కోరికగా వుండేది. ఓ వీణ తెచ్చి పెట్టమని అన్న రాజుని అడిగింది. ఫలితం పూజ్యం. ఈ సంగతి గ్రహించిన శ్రీకాంత్ ఓ వీణని కొని వాసంతికి ఆమె పుట్టినరోజు బహుమతిగా యిచ్చేడు. అంతేగాకుండా ఆమెకి వీణ నేర్పేందుకు ఓ గురువును కూడా ఏర్పాటు చేశాడు. ఆయిన ప్రతిరోజూ సాయంకాలం భవనానికి వచ్చి వాసంతికి వీణ నేర్పుతూ వుంటాడు.

నేర్చుకోవడం ప్రారంభించిన అనతి కాలంలోనే మంచి ప్రావీణ్యత సంపాదించింది వాసంతి. అంత త్వరగా నేర్చుకోవడమన్నది చాలా అసాధారణమైన విషయం. వాయిద్య నైపుణ్యాన్ని ఆశ్చర్యపోతూ వినసాగేడు రాజు. ఎప్పుడూ అల్లరి చిల్లరగా నవ్వుతూ తిరిగే ఈ అమాయకురాలిలో ఎంత శ్రద్ధవుందో! వీణ తీగెలపై నర్తించే కోమలమైన చెల్లెలి చేతి వ్రేళ్ళని పరికించసాగేడు.

వీణా వాయిద్యం ఆగిపోయింది. కొన్ని క్షణాలవరకూ గదిలో నిశ్శబ్దం రాజ్యం చేసింది. గంభీరవందనంతో తన వీణని సర్దుకుంటోన్న వాసంతిని అందరూ ఆశ్చర్యభరిత దృష్టితో చూశారు. వెంటనే చప్పట్ల ధ్వనుల్తో గదంతా దద్దరిల్లి

యువ



పోయింది. వాసంతి వదనంలో చిన్న చిరునవ్వు మొలకెత్తుతుండగా శ్రీకాంత్‌ని చూసింది.

కాసేపట్లో అతిధులందరూ వెళ్ళిపోయారు. అన్నపూర్ణమ్మ మాధవిని పిలిచి కాబోయే కోడలు దగ్గరకి చీర ఇచ్చేందుగ్గాను వెళ్ళమన్నది. అ మాట విన్నాక శ్రీకాంత్ వేపు తిరిగింది వాసంతి.

"ఏదైనా సందేశం వుందా ?"

"ఎందుకు ?"

"ఓహో. ఏం నంగనాచులు ? వినలేదా—నేనిప్పుడు కాబోయే వదినగారి దగ్గరికి వెళ్తున్నాను "

"అయితే, ఇది చెప్పు."

"ఏమిటది ?"

"పుట్టింటినుంచి దాసీలెవర్నీ తీసుకురావొద్దూ ... నేనున్నానూ—అని !"

"మీ సంగతేనా అంటున్నారు. ?" అంటూ పగలబడి నవ్వింది వాసంతి.

శ్రీకాంత్ కూడా ఆమెతోబాటు నవ్వేడు.

ఓ దాసీ వెంట రాగా శ్రీకాంత్ అత్తవారింటికి బయలుదేరింది వాసంతి. అక్కడ ఆమెను సాదరంగా ఆహ్వానించేరు. వెండిపళ్ళెంలో తీసుకువెళ్ళిన చీరనీ—పసుపు కుంకుమనీ దాసీచేతికి యిచ్చి కాబోయే శ్రీకాంత్ భార్య—రేణూ గదివేపు నడిచింది. వాసంతిని చూడగానే కాబోయే భర్తని చూసినంత సిగ్గుపడింది రేణుక. లజ్జాభారంతో ముఖం కిందికి దించుకుంది. వాసంతి ఆమె దగ్గరసా వెళ్ళి ఆమె చుబుకం పట్టుకొని యెత్తి కళ్ళల్లో కళ్ళుపెట్టి చూసింది.

"నే నెవరినో తెలుసా?"

"ఉఁహూఁ" అంది రేణుక మెల్లిగా.

"నేను వాసంతిని."

"వారి బంధువులా?"

"నీ ఇష్టం, నువ్వేలాగనుకున్నా సరే! చూస్తే నేను ఆయనకి ఏమీ కాను, ఆలోచిస్తే నేను వారికెంతో కావలసిన దగ్గరిదాన్ని నువ్వొస్తావుగా .నీకే అర్థమౌతుంది" అంటూ దాసీ చేతుల్లోని వెండిపళ్ళెం అందుకుంది వాసంతి. చీరని చేతిలోకి తీసుకొని రేణూకి చూపిస్తూ—"చూడు—బావుందా?" అంది,

బావుందన్నట్లు సిగ్గుపడ్తూనే తలవూపింది రేణు. కాసేపు ఆ కబురూ ఈకబురూ చెప్పి వాసంతి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోగానే రేణుక మస్తిష్కంలో ఓ ప్రశ్న నిలిచింది. వాసంతి మాటలు ఆమెలో ఏవేవో ఆలోచనల్ని రేకెత్తించేయి.

క్రమంగా ఆమె కనులముందు శ్రీకాంత్ రూపం నిలిచింది, అవ్యక్త మధుర భావనతో రేణుక శరీరం పులకించింది.

## 2

"రాజూ ! రాజూ !.. రాజేడీ వాసంతీ :"

"ఓ మీరా ? రండి. అన్నయ్య స్నానం చేస్తున్నాడు."

"ఇంతసేపై మేం తయారై రెడీగా వుంటే—ఇంకా ఇప్పుడా స్నానం చేసేది ?!"

"ఏమైందిపుడు ? సొంత వాహనం వుంది, క్షణాల్లో బయల్దేరవచ్చు"

"అవున్లే, నువ్వా అన్నకి చెల్లెలువేగా, ఆయనగారి పక్షమే మాట్లాడతావు.... అదుగో మనవాడు .."

"ఏమంటున్నావు ?" అన్నాడు అప్పుడే వచ్చిన రాజు.

"నీ గురించే, ఏమైపోయావా? ఇంత లేటుకి కారణమేమిటా అని !"

"మీలాగ అన్నయ్యకి వెనకా ముందూ నౌఖర్లెవరూ లేరు, పాపం, ఇంటి పనంతా తనొక్కడే చూసుకోవాలి. కదన్నయ్యా?" అంది వాసంతి రాజు వంక చూస్తూ.

"సరే బాబూ, క్షమించేశాం. గబగబ కానీ, వాళ్ళందరూ కార్లో కూర్చుని మన కోసం వెయిట్ చేస్తున్నారు ." అంటూ వాసంతికేసి నడిచేడు శ్రీకాంత్. వాసంతి అన్నకోసం టిఫిన్ కేరియర్ సర్దసాగింది,

"పరోటాలు చేశావా, ఏం?" అన్నాడు శ్రీకాంత్.

"మరే, ఒక్కసారి రుచిచూస్తే మళ్ళీ మర్చిపోరు."

"అలానా, ఎన్ని పరోటాలు పెట్టేవు?"

"లెక్కపెట్టి సరిగ్గా పద్నాలుగు పెట్టేను."

"అమ్మో.... అన్నే ?!"

"ఇప్పుడిలాగే అంటారు కానీ అక్కడికి వెళ్ళేక అన్నీ అపురాపురుమని తినేస్తారు.... ఒక్కటైనా మిగల్చకుండా," అంది వాసంతి.

శ్రీకాంత్ మారుమాట్లాడలేదు. ఆమెకి పనిలో సహాయం చేసేందుగ్గాను ముందుకి నడిచేడు. శ్రీకాంత్‌కి ఇవేళ చాలా ఆనందంగా వుంది, ఈరోజు చాలామంది మిత్రుల్తో కలిసి అక్కడికి దగ్గర్లోనే వున్న జలపాతం దగ్గరికి పిక్నిక్‌గా వెళ్తున్నాడు,

"నన్నుకూడా మీతోపాటు తీసుకెళ్ళరూ?" చేతిలో వున్న కేరియర్‌ని ఓమూల పెడ్తూ అమాయకంగా అడిగింది వాసంతి.

"ఇవాళ కాదు ఇంకోసారి ."

"ఇవాళ కాదూ .అంటూ దాటెయ్యడం మీకు బాగా వచ్చు, ఈ మాయ మాటలు విని విని నా చెవులు గళ్ళు పడిపోయేయి, అంతేకాని .."

"ఏనాడైనా తీసుకెళ్లేరా—అంటావు, అంతేగా? పోనీ నువ్వే చెప్పు, మేమందరం మగాళ్ళం, నువ్వొక్కర్తివే ఆడదానివి ."

"అయితే ఏం?" అంది మధ్యలో వాసంతి,

అంతలో రాజుకూడా బట్టలు వేసుకొని అక్కడికి వచ్చేడు, వస్తూనే— "ఏమిటి కథ? ఏమంటూంది వాసూ?" అన్నాడు,

"ఏముందీ పాతపాటే నేనూ వస్తానూ అంటూంది" అన్నాడు శ్రీకాంత్,

"మరేం ఫర్వాలేదు చెల్లాయ్. మాతో నువ్వుకూడా వచ్చేరోజు ఎంతో దూరంలో లేదు." అన్నాడు రాజు నవ్వుతూ.

"ఎప్పుడు?" అంది వాసంతి చిరుకోపం అభినయిస్తూ.

"మీ రేణూ వదిన వచ్చేస్తూందిగా—అప్పుడన్నమాట!"

ఈ మాట విన్నాక వాసంతి మలినముఖం విప్పారి కళకళలాడింది.

"మరైతే రేణూ వదిన్ని వేగరం తెచ్చెయ్యరాదూ?

"తెచ్చేద్దాం .ఈలోగా రాజుకికూడా ఎక్కడేనా ." అన్నాడు శ్రీకాంత్.

"ఒద్దు బ్రదర్. ఇంత వేగరం ఇట్లాంటి బంధాల్లో చిక్కుకోను."

"ఈ పప్పులేం ఉడకవ్. అమ్మ నిన్ననే ఎవరో అమ్మాయిని చూసి వచ్చిందట." అన్నాడు శ్రీకాంత్.

"మీ అమ్మగారికి మరేమీ పని లేనట్టుందే. ఈ సంగతి చెప్పు శ్రీకాంత్ ... ముందు వాసంతికోసం ఓ మాంచి అబ్బాయిని చూడమను "

అన్నయ్య నోటమ్మట ఈ మాటలు వినగానే వాసంతికి ఎక్కడలేని సిగ్గు ముంచెత్తింది. తడబడే కాళ్ళతో అక్కడినుంచి వెళ్ళిపోతున్న వాసంతిని, రాజూ శ్రీకాంత్‌లిద్దరూ నవ్వుతూ చూశారు. కాసేపాగి శ్రీకాంత్ భుజంమీద చెయ్యివేశాడు రాజు. "శ్రీకాంత్, ఈ జీవితంలో నాకొక్క కోరికమాత్రం చాలా గాఢంగా వుంది... వాసంతికి వివాహం చెయ్యాలి. మంచి వరుడిని ఎన్నికచేసి—తలిదండ్రులు లేని లోటుని అన్నయ్యగా నేను తీర్చాలి." ఈ మాటలు అంటూవుండగా రాజు గొంతుక గద్గదమై పోయింది. అతని కళ్ళల్లో నిల్చిన కన్నీటి బిందువుల్ని చూశాడు శ్రీకాంత్. తన రుమాలు తీసి అతని కన్నీరు తుడిచేడు.

"భలేవాడివి రాజూ. నీకు పిచ్చిగాని పట్టిందా ఏం? నేనూ అమ్మా వుండగా ఏం మాటలవి? నువ్వే చూద్దువుగాని వాసంతి పెళ్ళి బ్రహ్మాండంగా జరిగేలా చేస్తు చూస్తాను. సరేనా?" అన్నాడు శ్రీకాంత్.

కృతజ్ఞతాభరిత నయనాల్తో అతనికేసి చూశాడు రాజు. అంతలో వాసంతి వొచ్చి అన్నవేపు తిరిగింది. "అన్నయ్యా, సాయంకాలం తొందరగా వచ్చెయ్యాలి సుమా!" అంది.

"ఒకవేళ ఏ కారణంచేతనైనా ఆలస్యం అయితే నువ్వేం గాభరా పడకు. వంట పూర్తిచేసుకొని అమ్మగారింటికి వెళ్ళు. సాయంకాలం నేను వచ్చేవరకూ అక్కడే వుండు" అన్నాడు రాజు.

"అలాగే. సాయంత్రం నువ్వొచ్చిన తర్వాతిగానీ నేను భోజనం చెయ్యను."

"ఆఁ. అలాగేలే!"

స్నేహితులిద్దరూ వీధిలోకి నడిచేరు. వాళ్ళ కారు కనుమరుగు అయ్యేవరకూ





అటే చూస్తూ నిల్చున్నది వాసంతి....చిన్నప్పట్నించీ రాజుకి చెల్లెలంటే విపరీతమైన ప్రేమా అభిమానం. వాసంతికికూడా అన్నయ్య అన్నా అంతే గౌరవం. ఎన్నడూ ఒకరినొకరు ఎక్కువకాలం వదిలి గడపలేదు. ఈ రోజు పిక్నిక్ కని అన్నయ్య అలా వెళ్తూంటే ఎంచేతో మాధవి మనస్సులో ఏదో మేఘాలగుంపు ముసురుకుంది. నెమ్మదిగా లోపలికి వెళ్ళి వంటా అదీ పూర్తిచేసింది. ఆనక అలసటగా మంచంమీద మేను వాల్చింది. అంతలో అకస్మాత్తుగా ఆమెకి రాజు అన్నమాటలు స్మృతిపథంలో మెదిలేయి.

"ముందు వాసంతికోసం మాంచి అబ్బాయిని చూడమను!" ఆ మాటలు తలుచు కుంటూ భవిష్యత్తుని చిత్రించుకోసాగింది వాసంతి. అంతలో మరో ఆలోచన మెరుపులా మెరిసింది. ఒకవేళ పెళ్ళి గిళ్ళీ అయిపోతే—అప్పుడు తనని అన్నయ్య దగ్గర వుండనిస్తారా? తనకి దూరం అయిపోడూ? జీవితాంతం పెళ్ళి చేసుకోకుండా బ్రహ్మచారిణిగా అన్నయ్య సేవలో గడిపేస్తే ఏం?

దూరంగా చెట్లమీద పక్షుల కోలాహలం విన్పిస్తోంది. గాలి తాకిడికి చెట్లు పెద్దగా శబ్దంచేస్తూ పిశాచాల్లా వూగుతున్నాయి. ఎంచేతో వాసంతి వున్నట్టుండి భయభ్రాంతు రాలైంది. ఒక్క ఉదుటున లేచి ఇంటికి గొళ్ళెంపెట్టి రోడ్డుమీదికి నడిచింది. అన్న పూర్ణమ్మగారి భవంతి అక్కడికి ఫర్లాంగు దూరంలోనే వుంది. భవంతి మెట్లు ఎక్కు

తూనే ఒక్కసారి గట్టిగా నిట్టూర్చింది.

ఆ భవంతిలోని నౌఖర్లందరూ వాసంతిని ఎంతగానో ఆదరిస్తారు. వాసంతి మాటలూ, ఆమె కోమలస్వభావం వాళ్ళని ఎంతో ఆకర్షించింది. అమాయికమైన ఆమె మొహం చూడగానే వసంతాగమనాన్ని గుర్తించిన పూలమొక్కలై పోతారు. ఆమె భవంతికి ఎంచేతేనా రావడం ఆలస్యమైతే, ఇక అందరి దృష్టీ రోడ్డుమీదే వుంటుంది. ఆమె వస్తూన్నదంటే చిరునవ్వుతో స్వాగతమిస్తారు భవంతిలో అడుగుపెట్టిన వెంటనే అమ్మగారివద్దకి వెళ్లింది వాసంతి.

"ఎక్కడున్నావమ్మా వాసంతీ, ఇంతసేపూ?"

"ఇవాళ అన్నయ్య పిక్నిక్ కి వెళ్ళాలన్నాడు ."

"అవునూ .వాళ్ళు వెళ్ళిపోయి చాలాసేపైంది గదూ ?"

"అవుననుకోండి. కాని ఇంకా పన్లున్నాయిగా అంట్లూ అవీ "

"అలాగా. మరింక పనేం లేనట్టేగా ! ?"

"లేనట్టే!"

"అన్నట్టు రా వాసంతీ! చిన్నపని చెప్తాను, మీ వదిన కోసమని కొన్ని చీరలు తెప్పించేను, మంచివి ఎంచు ."

"ఏయే రకాలు తెప్పించేవు?"

"నువ్వే చూద్దువుగాని రా!" అంటూ దారితీసింది అన్నపూర్ణమ్మ. ఆమెని అనుసరించింది వాసంతి. గదిలో రెండు ట్రంకుపెట్టెలున్నాయి. రెండిట్లో ఎన్నో రకరకాల చీరలున్నాయి. ఆ చీరల్ని చూస్తూ ఒక్కక్షణంపాటు "రేణూ" అదృష్టానికి ఈర్ష్య చెందింది వాసంతి. అన్నపూర్ణమ్మ ఒకొక్క చీరా తీస్తూ వాటి గొ—అదీ వివరించి చెప్తున్నారు వాసంతికి. ఆఖర్న ఓ చీర తీసి వాసంతి భుజంమీద వేసిందామె.

"ఎలా వుంది వాసూ, ఈ చీర?"

"చాలా బాగుంది." అంది వాసంతి వణుకుతూన్న చేతుల్తో ఆ చీరని పొదివి పట్టుకుంటూ.

"ఇది నీకోసమే నేను తీసుకున్నాను."

"నాకోసమా?"

"అవును. శ్రీకాంత్ పెళ్ళికి నువ్వీచీర కట్టుకోవాలి .. ఒకవేళ నీకీరంగు నచ్చకపోతే చెప్పు. మరోటి తెప్పిస్తాను."

కృతజ్ఞతతో ఆమె వైపు చూసింది వాసంతి, "రంగు బాగానే వుంది," అంటూ

చీరని చేతుల్లోకి తీసుకుంది.

*　　　　*　　　　*

మధ్యాహ్నం భోజనం అమ్మగారితోపాటు ఆమె బలవంతంమీద వారి భవంతిలోనే చేసింది. భోజనాలయ్యేక కాసేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పుకున్నారు. తర్వాత అన్నపూర్ణమ్మ నిద్రపోయింది. వాసంతి కూడా నిద్రపోవాలని ప్రయత్నించింది. కాని నిద్ర వాస్తేగా! నెమ్మదిగా లేచి భవంతి ముందున్న తోటలోకి నడిచింది. ఏపుగా పెరిగిన చెట్లకొమ్మల్లో కూర్చున్న పక్షులు అవ్యక్తాలాపనలు చేస్తున్నాయి. తలెత్తి నీలాకాశాన్ని పరికించింది. గుంపులు గుంపులుగా ఎగురుతున్న పక్షులు కమనీయంగా కన్పించేయి. ఎగుర్తోన్న విహంగాల్ని చూసిన వాసంతిలో ఏదో ఈర్ష్యాభావం పేరుకోసాగింది. తనకి కూడా రెక్కలుంటే ఎంత బాగుణ్ను. తనకిష్టంవచ్చిన చోటికి హాయిగా ఎగిరిపోవొచ్చు! అంతలో ఆమె దృష్టి అకస్మాత్తుగా ఆకాశంలో ఎగురుతూన్న రెండు పక్షులమీద నిలిచింది. ఆ రెండూ చాలాసేపు అలా జంటగానే ఆకాశంలో ఎగిరేయి. అకస్మాత్తుగా సగం దారిలో రెండూ విడిపోయేయి. వాసంతి హృదయంలో కనిపించని ముల్లేదో గుచ్చు కున్నట్టయింది. అందులో ఒక పక్షి గుండుదెబ్బ తిన్నట్టు రెక్కలు తపతప కొట్టు కుంటూ నేల రాలసాగింది. మరికొన్ని క్షణాల్లో చిన్న శబ్దంచేస్తూ ఆమెకి సమీపంగా నేలమీద పడింది వెంటనే చచ్చిపోయింది. భయంతో ఒక్కసారి కళ్లు మూసు కొంది వాసంతి. శరీరం చిన్నగా కంపించసాగింది. రక్తప్రసారం ఒక్కసారిగా ఆగిపోయినట్టనిపించింది.

భయపూర్ణ దృష్టితో నెమ్మదిగా తలెత్తి ఆకాశం వంక చూసింది. ఇందాకటి పక్షి దిక్కు తోచనట్టు వెర్రిగా అరుస్తూ, క్షణానికోసారి దిక్కులు మారుస్తూ ఎగుర్తోంది. ఎగరడం మర్చిపోయినదానిలా ఆగి—నేలవేపు జారిపోతూ—మళ్ళీ ఎగుర్తోంది. వాతావరణం ప్రశాంతంగా వుంది. ఆకాశంలో ఇందాకటి నీలిమ అట్లాగే వుంది. ఏమీ జరగనట్టు నిల్చున్నాయి చెట్లు .సాయంకాలం కాసాగింది. భయవిహ్వ లత్వం ఆమెనింకా అంటిపెట్టుకునే వుంది. ఏదో పక్షి చచ్చిపోయినంతమాత్రాన దిగులెందుకు? ఈ దిగులు అణుచుకుందామని విశ్వప్రయత్నం చేసింది వాసంతి. కాని—ఆ నిస్సహాయపక్షి ఆక్రందన—రెక్కల తపతపలు దాని చావు మాటి మాటికీ ఆమె మనోఫలకం మీద నిలవసాగేయి. భవంతిలోకి అడుగుపెడ్తూ వుంటే అన్నపూర్ణమ్మ ఆమెకి ఎదురు వచ్చింది

"వాసంతీ, ఇంతవరకూ ఎక్కడున్నావ్?"

"ఇక్కడే"

"గురువుగారు నీకోసం చూస్తున్నారు ..."

"అయ్యో....అలాగా? ఎక్కడున్నారు?"

"ముందు గదిలో"

వాసంతి గబగబ అడుగులేస్తో ముందు గదివేపు నడిచింది. వీణానాదాల్తో ఆ ప్రాంతమంతా ఓలలాడ్తోంది. గురువుగారు వీణ చేత్తో పట్టుకుని తంత్రులు మీటుతున్నారు. వాసంతిని చూస్తూనే ఆయన అంగుళులు నిలిచిపోయినై.

"క్షమించండి మాస్టారూ, ఆలస్యమైపోయింది ..."

"లేదే . అయితేమాత్రం ఏం? బంగారుకలలు కంటూ ఆలోచనల్లో మునిగిపోతున్నావా ఏం, ఇంతసేపూ?"

వాసంతి మనసులోనే నవ్వుకున్నది. గురువుగారు తన కోపాన్ని గాని, విసుగుదలనిగాని ఎన్నడూ బయటపెట్టరు. వారికి ఎదురుగా కూర్చుని ఆయన చేతిలోని వీణ అందుకొని వాయించడం మొదలుపెట్టింది. తంత్రులు ఆమె చేయి తగలగానే ఝుమ్మన్నాయి. అదే సమయాన ఆమె హృదయవీణ కూడా నినదించ నారంభించింది. నీలాకాశం, పచ్చని వృక్షాలు, కదిలే లతలు, హసించే పుష్పాలు, మౌనప్రకృతి, సరోవరం, జలపాతం ఆమె దృష్టిపథంలో నిలువసాగేయి. చేతివేళ్లు అప్రయత్నంగా వీణ తీగలపై కదులుతున్నాయి.

గురువుగారు విస్మితులవుతూ తదేకంగా వాసంతి ముఖంలోకి చూడసాగేరు. ఈనాటి వీణారవళిలో ఏమిటీ వేదనాభరితస్వరాలు? ఇది వాసంతి మనోవ్యాకులతకి ప్రతిబింబం కాదుగద!

"వాసంతీ, ఏమైందివేళ? ఏమలా వున్నావు?"

"అదే అర్థం కావడం లేదు మాస్టారూ!"

"నీ సంగీతంలో ఇవాళ చాలా అగాధమైన సంగతులు పలికిస్తున్నావు. దుఃఖప్రపూర్ణమైన భావం స్పష్టంగా విన్పిస్తోంది. ఎందుకీ విచారం?"

"మాస్టారూ .ఎంచేతో ఇవాళ నా మనస్సు అదోలా వుంది. హృదయంలో ఏదో వెల్తి ఏర్పడినట్టు బాధగా వుంది."

"పిచ్చిపిల్లా. ఎంతాలోచన! మనస్సుని కుదుటపరుచుకో. నుదుటిమీద చెమట తుడుచుకో. కాసిని మంచినీళ్ళు తాగు ఏం ..ఏదీ సుఖంమీదికి నవ్వుకూడా రావాలి. ఆఁ. అదీ ఏదీ—మంచిదానవుగా—ఇప్పుడు వీణ అందుకో. ఇవాళ నీకొక కొత్త రాగం చెప్తాను. ఈ స్వరం విషాదంలో వున్నవాళ్లకి మనశ్శాంతి నిస్తుంది. ఆనంద




తరంగాలు ఉవ్వెత్తున లేస్తాయి. ఏం? ప్రారంభించు!'' అంటూ వాయించే పద్ధతిని వివరించేరు. వాయిద్దామని తీగెపై వేళ్లుంచి మీటబోయింది వాసంతి. మొదటి ఝంకారంతోనే తీగ తెగింది....

వీణని నేలమీద వుంచమని ఆదేశించేరు గురువుగారు. లజ్జాభరితవదనంతో వీణ పక్కనిపెట్టి గురువుగారిని క్షమించమని వేడుకుంది. నెమ్మదిగా లేచి కిటికీవద్దకి నడిచింది. గురువుగారు వాసంతి ప్రవర్తనని చూసి విస్మితులయ్యేరు. తన ఈ వ్యాకులతకి కారణమేమిటో తనకే తెలీని అయోమయావస్థలో కొట్టుమిట్టాడసాగింది వాసంతి. గురువుగారు వీణ అందుకుని తీగెలవేపు చూడసాగేరు.

కిటికీలోంచి కన్పిస్తోన్న చెట్లనీ, వాతావరణాన్ని ఆవరించిన చీకట్లనీ కాసేపు తదేకదీక్షగా చూసింది వాసంతి. ఎక్కడో దూరంగా జలపాతపు హోరు విన్పిస్తోంది.

"ఏం మాస్టరుగారూ, ఇవేళ్టి పాఠం అయిపోయిందా?'' అంటూ అన్నపూర్ణమ్మ గదిలోకి వచ్చింది.

చేతిలో వీణని కింద పెట్టేరు గురువుగారు. "వీణ తీగె తెగిందమ్మా. రేపు మరో తీగ వేయించాలి....ఈ రోజుకి మరి పాఠం లేదు ' అంటూ లేచి నిలబడ్డారు. వాసంతి మౌనంగా మాస్టరుగారి వేపు తిరిగి నమస్కారం చేసింది. బైటికి వెళ్లడానికి ఉద్యుక్తురాలయ్యేంతలో అమ్మగారి మాటలు ఆమెని ఆపేశాయి. భుజంమీద చెయ్యివేస్తూ "ఎక్కడికి?'' అందామె ప్రేమగా.

"రాత్రి అవుతోంది. అన్నయ్య వస్తాడేమో?"

"అయితే?"

"వంట చెయ్యాలిగా. అన్నయ్య రాగానే, అలిసిపోయి వుంటాడేమో, ఆకలి అంటాడు "

"అన్నయ్య అంటే ఎంత శ్రద్ధ నీకు?"

"నేను కాక మరెవరున్నారు, అన్నయ్యకి?"

"నేనూ, శ్రీకాంత్ ఎవరంకూడా లేమంటావా?"

"అబ్బే. నేనసేది అది కాదమ్మా! మీ ఆశ్రయమే గనక లేకపోతే ఏమిలా వుండేవాళ్లమేనా అసలు?"

"అయితే నేనోమాట చెప్తాను, వింటావా?"

"చెప్పండి."

"ఇవాళ అందరం కలిసి ఇక్కడే భోజనం చేద్దాం."

"ఒద్దమ్మగారూ, ఇంకోసారి చేద్దాం. ఇవాళ వద్దు!"

అన్నపూర్ణమ్మ అంతకన్న ఎక్కువగా వాసంతిని బలవంతం చెయ్యలేకపోయింది. తలమీద చెయ్యివేసి ఆశీర్వదించి, వెళ్లిపోడానికి అనుజ్ఞ యిచ్చింది. ఈనాటి వాసంతి మౌనం ఆమెని చకితురాలిగా చేస్తోంది. ఆమె హావభావాల్లో పూర్వం వుండే చంచలతా చురుకుదనం మాయమయ్యాయి.

చీకటి ప్రపంచంమీద తన రెక్కలు పరుస్తోంది. అసంఖ్యాక నక్షత్రగణం ఆకాశంలో మినుకు మినుకు మనసాగింది. వాసంతి వెళ్ళిపోయేక పూజగదిలోకి వెళ్లింది అన్నపూర్ణమ్మ. దేవికి హారతిచ్చి, హారతిని కళ్లకి అద్దుకుంది. "శ్రీకాంత్ ఇంకా రాలేదేం చెప్మా?" అనుకుంటూ మేడ దిగి వీధి గుమ్మంవద్దకి వెళ్లింది. కారు వస్తూన్న జాడ కన్పించలేదు. కనుల ముందు కటిక చీకటి. కాసేపు అలాగే ఎదురు చూస్తూ నిలబడింది.

అంతలో దూరాన కారుదీపాలు తళుక్కుమన్నాయి. మరి కొన్నిక్షణాల్లో భవంతి ముందు కారాగింది. కారులోంచి దిగుతోన్న శ్రీకాంత్‌ని చూసి అన్నపూర్ణమ్మ హృదయారాటం తగ్గింది. ముఖంలో సంతోషం నిలిచింది. దగ్గరికొచ్చి నిల్చున్న శ్రీకాంత్ ముఖంలోకి చూసి నిర్ఘాంతురాలై పోయింది. చెదిరిన ముఖంమీద చిందర వందరగా పడిన ముంగురులు, ఎర్రగా నిప్పుకణికల్లా మండుతూన్న కళ్లు. ధారాప్రవాహంగా కార్తోన్న స్వేదం. ముఖంమీద భయంచేసిన నీలినీడలు

"శ్రీకాంత్, ఏమలా వున్నావ్? ఒంట్లో బాగా లేదా?"

"అవునమ్మా .రాజు . " అంటూ ఏదో చెప్పబోయి ఆగిపోయేడు శ్రీకాంత్.
ఆత్రుతగా అతన్నే చూడసాగింది అన్నపూర్ణమ్మ.

"ఎందుకలా గాభరా పడ్తున్నావు నాయనా, రాజు ఏడీ?"

" ."

"ఏమైంది బాబూ?"

"రాజు మనకి చాలా అన్యాయం చేశాడమ్మా!"

అన్నపూర్ణమ్మకేమీ అర్థం కాలేదు. "సరిగ్గా చెప్పు, నాయనా!" అంది.

కాస్సేపు పోయేక, వేదనాభరిత కంఠంతో జరిగినదంతా చెప్పాడు శ్రీకాంత్. బోటు షికారు చేస్తున్నపుడు వున్నట్టుండి పడవ బోల్తాకొట్టింది. అంతలో జలపాతం వున్నవేపు ప్రవాహం అతన్ని లాక్కుపోయింది. అంతే, రాజు మరి కన్పించలేదు. మిగతావాళ్లంతా అతి ప్రయాసమీద ఆ ప్రమాదంనుంచి గట్టెక్కేరు.

ఈ మాట వింటూనే అన్నపూర్ణమ్మ గుండెలు బాదుకుంటూ ఏడ్వడం మొదలెట్టింది. భవంతిలోని నౌకర్లందరూ ఈ సంఘటన విని నిరుత్తరులయ్యేరు. చాలా సేపటివరకూ భవనంలో భయంకర మౌనం రాజ్యం చేసింది. ఈ వార్త వాసంతికి ఎవరు చెప్తారు? ఎలా చెప్పగలరు?

ఆఖరికి శ్రీకాంతే స్వయంగా లేచేడు. అన్నపూర్ణమ్మకూడా అతని వెంట వస్తానంది. కాని వద్దన్నాడు శ్రీకాంత్. నౌకర్లని ఎవర్నీకూడా వెంట తీసుకెళ్లకుండా, ఒంటరిగానే వాసంతి ఇంటికేసి నడిచేడు .ఇంటి గుమ్మంలో నిలబడి మెల్లిగా తలుపుతట్టేడు శ్రీకాంత్. అందుకోసమే ప్రతీక్ష చేస్తూన్న వాసంతి తటాలున తలుపు తీసి ఆత్రంగా 'అన్నయ్యా . " అంటూ ఏదో అనబోయి—ఎదురుగా అన్నయ్య స్థానంలో శ్రీకాంత్ వుండడం చూసి ఆగిపోయింది. చీకట్లో నిలబడి కరుణామయ నేత్రాల్తో ఆమెని చూశాడు శ్రీకాంత్.

"ఓ—మీరా—రండి. లోపలికి ' అంది వాసంతి తనని తాను సంబాళించుకుంటూ.

చిత్రవధ చేస్తున్న ఉద్వేగాన్నీ—మానసిక వ్యధనీ బలవంతాన అదిమిపట్టి నిలబడ్డాడు శ్రీకాంత్.

"అన్నయ్యేడీ?"

"అన్నయ్య రాలేదు"

"ఓహో ఇప్పు డర్థమైంది. బాగానే వుంది. అన్నయ్య చిన్నపిల్లాడా ఏం? అతన్ని శాసించే అధికారం నాకేమన్నా వుందా? ఎవరింటికో పోయివుంటాడు.

కంగారు పడొద్దని మీతో కబురు పెట్టేడు. అంతేగా?" అంది సగం కోపంగా సగం భయంగా.

"కాదు. వాసంతీ, అది కాదు"

'ఏది కాదు? ఎప్పుడొస్తాడా అన్నయ్య .అని కళ్లల్లో ఒత్తులు వేసుకొని ఇక్కడ కూర్చున్నాను. వంటచేసి రెడీగా వుంచేను. తీరా చేసి—ఇలాగా చెయ్యడం? మీరే చెప్పండి ' అంటూ ఇంకా ఏమో చెప్పబోయిన వాసంతి హఠాత్తుగా ఆగిపోయి శ్రీకాంత్ ముఖంలోకి ధ్యానపూర్వకంగా చూడసాగింది. శ్రీకాంత్ ముఖంలో భయం బాధ పేరుకుని వున్నాయి. చేష్టలుడిగిన మనిషిలా, ప్రతిమలా నిలబడివున్నాడు. కను కొలకుల్లో నీళ్లు కూడా నిలిచేయి. అది గమనించిన వాసంతి—" ఏమైంది శ్రీకాంత్‌బాబూ, ఏమిటా కన్నీరు?" అంది.

నీగురించే వాసంతీ అన్నయ్య రాకపోతే నీకెంత దుఃఖం అది ఆలోచిస్తూ వుంటే కళ్ళల్లో నీళ్లు తిరిగేయి "

"ఏమైనా సరే నేనొకటి నిశ్చయించుకున్నాను. ఇవాళ ఎంత రాత్రి కానీ— అన్నయ్య వచ్చినతర్వాతే నేను భోజనం చేస్తాను. అంతే."

"వాసంతీ !"

వేదనాభరితమైన శ్రీకాంత్ గొంతుక బొంగురుపోయింది. వాసంతి విస్మితురాలై శ్రీకాంత్‌ని చూసింది. అతని కళ్ళవెంట ధారాపాతంగా అశ్రువులు రాలుతున్నాయి.

'ఏమిటి శ్రీకాంత్ బాబూ! ఏమిటా కన్నీరు? చెప్పండి. విషయమేమిటి?"

"వాసంతీ, రాజుకి మనమీద కోపం వచ్చింది."

"కోపమా? నామీదేనా? '

"నీ ఒక్కతె మీదా కాదు. అతనికి మనందరి మీదా కోపం వొచ్చింది. రాజు మరింక ఎన్నడూ రాడు. మనల్ని రాజు శాశ్వతంగా ఒదిలి వెళ్ళిపోయేడు .. వాసంతీ!"

వాసంతికి కళ్ళముందు దట్టమైన చీకటి తెరలు దిగినట్టయింది. గుండెల్లో ఎవరో గునపాలు గుచ్చినంత యాతన. ఆకాశంలో అనాథపక్షుల ఆక్రందన. మరోసారి నమ్మనట్టు శ్రీకాంత్‌ని చూసింది. ఒక్కసారి వెర్రిగా 'అన్నయ్యా" అని కేక పెట్టింది.

"చెప్పండీ మా అన్నయ్య ఏడీ? ఎక్కడ? అతన్ని ఒంటరిగా ఒదిలేసి మీరొక్కరూ ఎందుకొచ్చేరు .చీకటైపోయింది .అడవిలో అన్నయ్య ఒక్కడే . అయ్యో .మా అన్నయ్యని దయచేసి తీసుకురండి... ' అంటూ వాసంతి భోరుమని




ఏడవసాగింది అంతలో చటుక్కున తెలివితప్పి పడిపోబోతూండగా శ్రీకాంత్ ఆమెని చప్పున పట్టుకున్నాడు.

## 3

"వాసంతీ .."

"వాసంతీ, లేమ్మా"

"వాసంతీ, అదిగో చూశావా ఎంతపొద్దు ఎక్కిందో ఎంతసేపని ఇలా కూర్చుంటావు?"

అన్నపూర్ణమ్మ ఆప్యాయంగా ఆమె భుజంమీద చెయ్యివేస్తూ లేవనెత్తాలని విఫల ప్రయత్నం చేసింది. వాసంతి నిశ్చలంగా కూర్చొని చెదిరిపోని దృష్టితో శూన్యకాశాన్ని పరికిస్తోంది.

ఇవ్వాల్టికి రాజు చనిపోయి పదిహేను రోజులైంది. ఇన్నాళ్ళూ కాసిని మంచినీళ్ళు తప్పితే ఆహారమనేది ఎరగదు వాసంతి. ఒకవేళ అమ్మగారూ, శ్రీకాంత్ బలవంతం చేస్తే—కంచం ముందు కూర్చొని, చేతిలో వున్న అన్నంకేసి దీక్షగా చూస్తూ ధారాపాతంగా కన్నీరు కార్చేది 'ఆకలేస్తోంది అన్నం పెట్టమ్మా' అనే అన్నయ్య రూపం ఆమె దృష్టిపథాన్నించి చెదురుతేగద!—ఆహారం నోట్లోకి ఎలా వెళ్తుంది?

పదిహేనురోజులై ఆమె బయట అడుగు పెట్టలేదు. ఆనాటినుంచీ అన్నపూర్ణమ్మ

తమ భవంతి వొదిలి ఈ పూరింటికి వచ్చి వాసంతితో పాటు వుంటున్నది. "లచ్చిని" తన దగ్గరుంచితే చాలు మీకెందుకు శ్రమ వెళ్ళిపొమ్మన్నప్పటికీ—ఆమె ఒప్పుకో లేదు. ఆమె, వాసంతి—రాజులు ఇద్దర్నీ శ్రీకాంత్‌తో సమానంగా చిన్నప్పట్నించీ చూస్తున్నది. చెక్కు-చెదరని ఆ అనుబంధం ఆమెనెలా వెళ్లనిస్తుంది?

పిచ్చిదానా—లేమ్మా—ఏమన్నా కాస్తా తిను. ఇలాంటి అనుకోని తుఫానులు ఎదురవడం మానవజీవితంలో తప్పనిసరి. భగవంతుడి మీద భారం వెయ్యి. మనం నడిచే ప్రతిదారీ—మనం అనుకునేంత సాఫీగా వుండదు..." అంటూ ఆమె అప్పుడే వచ్చిన శ్రీకాంత్‌ని చూసి ఆగిపోయింది.

'ఏమన్నా, తిన్నదా అమ్మా అన్నాడు శ్రీకాంత్.

ఉఁహూఁ. ఇంతసేపూ నేను ప్రయత్నించేను. ఎంత బతిమాలినా తిననుగాక తినినంటూంది. ఇహ నువ్వు చెప్పు వింటుందేమో?"

శ్రీకాంత్ వాసంతిని నెమ్మదిగా సమీపించి ఆమెని లేవనెత్తేడు. గదిలో మరో వైపుకి తీసుకెళ్ళి 'వాసంతీ నువ్వు కాస్త తినక తప్పదు. నేను ఇంతకు ముందు ఏం చెప్పినా వినేదానివి ఈసారి కూడా నామాట నిలబెట్టు.'' అన్నాడు ప్రాధేయ పూర్వకంగా.

ఏం చెయ్యమన్నారు శ్రీకాంత్ బాబూ? అన్నం సహించటంలేదు''

'నిజమే. కాదనను. కాని నువ్విలా ఏమీ తినకుండా నీరసించి రోజురోజుకీ కృంగిపోతూవుండడం మేం సహించగలమంటావా?"

. ''

ఎక్కువొద్దు. కాస్తంత తిను. చాలు. లేకపోతే నామీద ఒట్టే."

అన్నపూర్ణమ్మ కంచంలో కాస్త పెరుగూ అన్నం కలిపి తీసుకువచ్చింది. ఆ కంచాన్ని శ్రీకాంత్ అందుకొని వాసంతి చేతుల్లో పెట్టేడు. "ఇదుగో, కొంచెమే తిను. లేకపోతే నేను చెప్పేనుగా...నేను చచ్చినంత ఒట్టు!'' అన్నాడు వేదనా పూర్వకంగా.

వాసంతి ఆందోళనగా శ్రీకాంత్ నోటిని మూసేసింది. చెంచాతో ఇంత పెరుగన్నాన్ని ఆమె నోటిదగ్గిర పెట్టాడు. వాసంతి మరింక కాదన్లేకపోయింది. ఆ ముద్దని మింగింది. అది చూసి అన్నపూర్ణమ్మ ముఖంమీద చిరునవ్వు వెలిగింది.

రాజు మరణం శ్రీకాంత్‌కి చాలా తీరని దుఃఖం కలిగించింది. మానసికంగా ఆ ప్రభావంనుంచి అతనిప్పటికీ కోలుకోలేక పోతున్నాడు. తనలోని వేదనని ఎవరికి చెప్పుకోగలడు?

వాసంతి మెల్లిగా భోజనం అయిందనిపించింది. శ్రీకాంత్ కంచాన్ని అన్నపూర్ణమ్మ చేతికిస్తూ "నువ్వింకో పనిచేయాలి వాసంతీ! నేనూ అమ్మా ఒకటనుకున్నాం. అది కూడా నువ్వు కాదనకుండా అంగీకరించాలి" అన్నాడు.

"మీ ఆజ్ఞని నే నెన్నడైనా కాదన్నానా చినబాబూ?"

"అయితే—లే—తయారవు!"

"ఎక్కడికి?"

"నువ్విప్పుడు శాశ్వతంగా యీ ఇంటిని విడిచిపెట్టెయ్యాలి."

"ఏం?"

"ఇకనుంచీ—నువ్వు మాతోనే మా మేడలో వుందువుగాని—"

మాధవి వెంటనే ప్రత్యుత్తరం ఇవ్వలేకపోయింది. కృతజ్ఞతాపూర్వక నయనాల్తో అన్నపూర్ణమ్మకేసి చూస్తూండిపోయింది.

"అవును వాసంతీ! శ్రీకాంత్ చెప్పింది సబబుగానే వుంది!"

"ఇదిగో వాసంతీ—ఇప్పుడే చెప్పేస్తున్నాను .ఏదో పరాయి ఇంటికి చుట్టపు చూపుకి వచ్చినట్టు రాకూడదు. నీ సొంత ఇల్లుగా భావించి రావాలి. తెలిసిందా?"

వాసంతి ముందుకి వంగి అన్నపూర్ణమ్మ పాదాల్ని స్పృశించింది.

ఆమె వాసంతిని చేతుల్లోకి తీసుకొని కౌగలించుకుంది. "ఇప్పుడు నా జీవితం మీ యిద్దరిమీదే ఆధారపడి వుందమ్మా" అంది.

వాసంతి మరేం మాట్లాడలేదు. ఈ విశాల ప్రపంచంలోనే తనకి నా అన్నవా ళ్ళెవరూ లేరు. ఉన్న ఒక అన్నా అన్యాయం చేసిపోయాడు. తనకింకెవరు దిక్కు? అలాంటి పరిస్థితుల్లో ఆదుకోడానికి మేమున్నామంటూ ముందుకి వచ్చేది ఎవరు?

కావలసిన బట్టలూ ఇతర ముఖ్యమైన వస్తువులూ మూటకట్టి అన్నపూర్ణమ్మగారి మేడకి తీసుకు వెళ్ళిపోయింది లచ్చి. ఆ పూరింటికి తాళం పెట్టి అన్నపూర్ణమ్మగారి వెనక నడిచింది వాసంతి.

ఇపుడు వాసంతి పూర్వంలా చలాకీగా వుండటం లేదు. ఎప్పుడూ దీర్ఘంగా ఆలోచిస్తూ—ఒంటరితనంలో మునిగిపోతున్నది.

ఓ రోజు డాబా ఎక్కి పిట్టగోడవద్ద నిలబడింది వాసంతి. నిశ్శబ్దంగా వుంది ప్రకృతి. దూరంగా వున్న అడవిలోంచి జలపాతం హోరు లీలగా విన్పిస్తోంది. ఆ అడవిలోని జలపాతమే తన అన్నయ్యని కబళించింది. తదేకంగా అటే చూస్తూ చేష్టలుడిగి నిలబడింది. వాసంతికోసం మేడంతా వెదికిన శ్రీకాంత్—ఎక్కడా కన్పించకపోయేసరికి డాబా ఎక్కేడు. వాసంతిని చూస్తూనే ఆశ్చర్యపోయి నిలబడ్డాడు.

వాసంతి ఇటు తిరిగి చూడనైనా లేదు.

కాస్త పక్కగా నిలబడి "వసూ!" అని మెల్లిగా పిలిచేడు.

"మీరా?!" అంది వాసంతి తత్తరపాటుతో.

"ఆఁ. నేనే. నే నెంతసేపట్నుంచీ నీకోసం ఎదురుచూస్తున్నానో తెలుసా?"

"నే నిక్కడే వున్నానే!"

"నువ్విక్కడే వున్నావులే. కాని నీ దృష్టే ఎక్కడో వుంది" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"ప్చ్ ..ఎంచేతో అప్పుడప్పుడు ఇలా అయిపోతున్నాను."

"వాసంతీ, నీ బాధని నేను అర్థం చేసుకోగలను. ఏకాంతంలో మనం ప్రేమించే వ్యక్తుల విషాదస్మృతులు ఎంతో కలవరం కలిగిస్తాయి. కాదనను."

వాసంతి హృదయసాగరంలో ఒక దుఃఖతరంగం చివ్వుమని ఉవ్వెత్తున ఎగసి పడింది. చప్పున కనుకొలకులు కన్నీటితో నిండినై.

"వసూ, నీ సుఖశాంతుల్ని కోరే ఒక వస్తువుని ఇన్నాళ్ళూ మరిచిపోయావు. చూడు. ఎంత మౌనంగా ఆ మూల వుందో—నీ కరస్పర్శకోసం ఖేదిస్తూ—"

"ఎవరు?"

"ఇంకెవరు? నీ ప్రియమైన వీణ. ఒక్కనాడైనా దాన్ని సముదాయించేవా నువ్వు?"

చాలాసేపటివరకూ మౌనం వహించింది వాసంతి. శ్రీకాంత్ తన చేతి రుమాల్తో ఆమె కన్నీటిని మృదువుగా తుడిచేడు. కాస్సేపయ్యేక ఆమె తలెత్తింది.

"ఏడుస్తున్నావా వసూ?"— వద్దన్నట్టు జీరపోయిన గొంతుకతో అనునయంగా అడిగేడు శ్రీకాంత్.

"ఊఁ" అంది వాసంతి.

"రా వాసంతీ, లే. మూగవోయిన వీణని నీ వేళ్ళతో పలకరించు. నిశ్శబ్దం పేరుకున్న ఈ భవంతిలో వీణానాదాలు చిందులెయ్యాలి . వూఁ కానీ!"

వాసంతి శిలలా నిలబడి శ్రీకాంత్ని చూడసాగింది. అతని పట్టుదల ఆమెకి తెలుసు. తన ముఖంమీద చిరునవ్వు వెలగాలంటే—ఆకాశంలోని నక్షత్రాల్ని దొరకపుచ్చుకొని అయినా, తన అభీష్టం నెరవేర్చుకోగలడు. మెట్లమ్మట కిందికి దిగి తన గదిలోకి నడిచింది. ఆమెను అనుసరించేడు శ్రీకాంత్,

అంతకుముందే గురువుగారు వీణతో సిద్ధంగా వున్నారు. వాసంతి ఆయనకి నమస్కరించి చాపమీద ఎదురుగా కూర్చొని వీణని చేతుల్లోకి తీసుకుంది.




కాస్సేపటికి వాసంతి అంగుళులు వీణ తంత్రులపై నర్తించసాగేయి. ఆ సంగీత తరంగాలు పరిసర వాతావరణాన్ని శోభామయం చేసేయి.

మిత్రుని మరణం శ్రీకాంత్ హృదయంలో ఓ పెద్ద బండరాయిని తెచ్చి పడేసింది. హృదయగతమైన ఆ బాధని వాసంతితో చెబుదామని ఎన్నోసార్లు అనుకున్నాడు శ్రీకాంత్. ఆనాటి ఆ దృశ్యం ఇంకా అతని మనోఫలకంమీంచి చెరిగిపోలేదు.

*　　　　*　　　　*

శ్రీకాంత్ ఆమెకోసం చక్కని ఖరీదైన బట్టలూ, ఇతర వస్తువులూ తరచూ తెచ్చేవాడు. ఆ తల్లీ కొడుకులు తనమీద చూపించే శ్రద్ధని చూసి కృతజ్ఞతాభారంతో వాసంతి శిరస్సు వంగిపోయేది. ఎక్కడా ఏ విషయంలోనూ కూడా వాళ్ళామెకు లోటు రానివ్వటం లేదు.

రోజులు అలా దొర్లిపోతున్నాయి. వసంత ఋతువు వచ్చింది. నేల నాలుగు చెరుగులా రంగురంగుల పువ్వులు వింత వెలుగులు విరజిమ్మసాగిన్నై. చెట్లు ఫల భారంతో వంగుతున్నాయి. పక్షులు రోజుకో కొత్త పాట పాడ్తున్నాయి. వాసంతి మెల్లిమెల్లిగా గతకాలపు స్మృతులనుంచి విముక్తురాలై వర్తమానం ధ్యాసలో పడ సాగింది తల్లికొడుకులకి ఆమెలోని ఈ మార్పు ఎంతో సంతోషం కలిగించింది. ఇప్పుడు వాసంతి పూర్తిగా మనుషుల్లో పడింది. అప్పుడప్పుడూ నౌకర్లని సరదాగా పలకరిస్తుంది. కాసేపు అవీ యివీ మాటాడ్తుంది. అన్నపూర్ణమ్మ పూజగదిని శుభ్రం

చేస్తుంది. శ్రీకాంత్ అవసరాల్ని ఏమరకుండా కనిపెట్టుకుంటూ వుంటోంది.

ఓ రోజు తన గదిలో కూర్చొని కిటికీలోంచి కన్పిస్తోన్న పూలతోటని తదేకంగా చూడసాగింది వాసంతి. ఎవరిదో అడుగుల చప్పుడు వినబడగానే లేచి చూసింది. శ్రీకాంత్ నవ్వుతూ కన్పించేడు.

"అంత దీర్ఘంగా ఏమిటి ఆలోచిస్తున్నావు వాసంతీ?"

"చెప్పమన్నారా?" అంది లేచి నిలబడ్తూ.

"ఊఁ....కానీ—

"చెప్తా. మరి. మీ రేమీ అనుకోరుగదా?"

"ఏమీ అనుకోను. సరేనా? ఏమిటది?"

"ఇంత పెద్దయింట్లో ఒంటరిగా వుండాలంటే ఏదోగా వుంటోంది. పనీపాటా లేకుండా గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవాలంటే చిరాగ్గా వుంటోంది. ఎవరేనా తోడుగా వుంటే గంటలు నిమషాల్లా గడిపెయ్యవచ్చు "

శ్రీకాంత్ ఆమె మాటలు వింటూ గంభీరంగా ఆమెకేసి చూడసాగేడు. ఆమె చెప్పబోయింది అతనూహించలేకపోలేదు.

"మీరు అనుమతిస్తే ఒక స్నేహితురాల్ని తెచ్చుకుంటా"

"ఎవర్ని?" సందేహభరిత దృష్టితో ఆమెని చూస్తూ అడిగేడు.

" రేణూని" అంది వాసంతి తన కోమల కంఠస్వరంతో మృదువుగా.

"అన్నా. పెంకిపిల్లా! మళ్ళీ అదేమాట మొదలెట్టేవూ? ఎన్నిసార్లు చెప్పేను—ఆ ప్రసక్తి ఎత్తవద్దని! ఉండు నీ పని చెప్తాను...." అన్నాడు శ్రీకాంత్ కోపం నటిస్తూ.

" ఏమిటి బాబూ. దెబ్బలాడుకుంటున్నారు, ఏమిటి గొడవ?"

"అబ్బే. ఎమీ లేదమ్మా"

"ఆ—ఆగండాగండి. అయితే—అమ్మగారితో అసలు సంగతి చెప్పెయ్యనా?" అంది వాసంతి మధ్యలో అడ్డు వస్తూ.

"సరే, ఏం చెప్తావో చెప్పు" అన్నాడు.

" అమ్మగారూ, చినబాబు ఎమంటున్నారంటే...." అంటూ ఆగిపోయింది వాసంతి.

"ఆఁ . .ఏమంటున్నాడు?"

"అమ్మతో చెప్పి నా పెళ్ళి...."

"ఏమ్ పెంకిపిల్లా, అబద్ధాలు చెప్తున్నావా?"

"నువ్వూరుకోరా. మన వాసంతి అబద్ధం చెప్పదు. నాకు తెలుసు"

"నీకు తెలీదమ్మా—" అంటూ ఏదో అనబోయేడు శ్రీకాంత్.

"నువ్వాగు. మరింక నీ మాటలేం వినను. నే నివాళే మన అవధాన్లుగారితో చెప్తాను ..."

"మీ యిష్టం. ఏం చేసుకున్నాసరే నా కనవసరం. నేను మాత్రం ఇంకో రెండేళ్ళవరకూ పెళ్ళిచేసుకోను!" అన్నాడు శ్రీకాంత్ దృఢంగా. ఆనక ముఖం గంభీరంగా పెట్టి అక్కడినుంచి నడిచి తన గదిలోకి వెళ్ళిపోయేడు. వాసంతీ, అన్న పూర్ణమ్మా ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

"చూసేవా. వాసంతీ! పెళ్ళంటే మండిపడ్తున్నాడు. ఏం చేద్దామంటావు?" అంది అన్నపూర్ణమ్మ నిరాశగా.

"మీకెందుకమ్మా అదంతా? ఆ విషయం నాకు ఒదిలేయండి. నేను చూసు కుంటాగా!"

"ఈ విషయం గనక తేలిస్తే నీకు మంచి బహుమానం యిస్తాను వాసంతీ! ఒద్దనేవరకూ లడ్డూలు తినిపిస్తాను ."

"అబ్బే. కేవలం లడ్డూలతో లాభం లేదు, నాకింకా పెద్ద లంచం కావాలి ."

"చెప్పు . .ఏం కావాలో?"

"మరి, మాటిస్తారా?"

"ఏమని?"

"ముందు మాటివ్వండి."

"ఆఁ యిచ్చేననుకో. నీకేం కావాలో చెప్పు"

"మన ఇంటి ముందు పూలతోట వుందిగా—"

"ఆఁ వుంది."

"అందులో ఓ అందమైన తూగుటుయ్యాల"

"ఇంతేగద. సరే కానియ్యి. ఇవాళనుంచే పని ప్రారంభించు, కానీ—"

"మిగతాది నాకు ఒదిలెయ్యండి. నేను చూసుకుంటాను. మీరు ముందు మన అవ ధాన్లుగారిని పిలిపించి ఆ వ్యవహారం మాట్లాడండి" అంటూ శ్రీకాంత్ గదివేపు నడచింది వాసంతి.

గదిలో మంచం మీద కూర్చుని కిటికీవేపు చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు శ్రీకాంత్. వాసంతి అడుగుల చప్పుడు విని చప్పున లేచేడు.

"ఓ. నువ్వా వాసంతీ! రా!"

"మీకు కోపం వచ్చిందా?"

"పిచ్చిపిల్లా, కోపమా? నీ మీదా? నువ్వేం తప్పుచేసేవని? ఒకవేళ నువ్వేదైనా తప్పే చేశావనుకో. ..అయినా సరే నాకు కోపం రాదు తెలుసా?" అన్నాడు పెదాల మీదికి నవ్వును తెప్పించుకొని.

"నిజమా? నేనంటే మీకెంత అపేక్ష!"

"అంచేత, అలా ఎప్పుడూ అనుకోకు?"

"సరే. అయితే నా మనస్సులోని ఓ మాట చెప్పేదా?"

"వూఁ చెప్పూ. ఏం కావాలి?"

"ఇది కోరిక కాదు. కేవలం ప్రార్ధన....అనుకోండి. ఇది గనక మీరు నిరాకరిస్తే—నేననుభవించే బాధని ఊహించనైనా వూహించుకోలేను." అంది వాసంతి నమ్రత వుట్టిపడ్తూన్న కంఠంతో.

ఆమె మాటలు వినగానే శ్రీకాంత్ మొదట కంగారు పడిపోయేడు. తననుంచి ఏమి కావాలీ అమ్మాయికి?!

"అడగరాదూ? ఏం కావాలి? కోరిక ఏదైనా సరే చెల్లిస్తానన్నాగా?"

"అమ్మగారితో చెప్పి—మన పూలతోటలో నాకోసం ఒక అందమైన తూగుటుయ్యాల కట్టించండి"

"ఇంతేనా? ఇంకేమిటో అనుకున్నాను. ఇవాళే అమ్మతో చెప్పి పని మొదలు పెట్టిస్తాను...."

"నేను అమ్మగారిని ఇంతకుముందే అడిగేను ఆమె ఒప్పుకోలేదు "

శ్రీకాంత్ కొద్దిగా గాభరా పడ్డాడు.

"ఎం, ఎందుకని?" అన్నాడు.

"దానికి ముందు నేనో పని చేస్తేగానీ—అందుకు ఒప్పుకోమన్నారు!"

"ఏమిటది?"

"మీ వివాహం అయ్యేంతవరకూ ఇలాంటివేం కుదరవన్నారు."

"వివాహమా?"

"అవును. మిమ్మల్ని పెళ్ళికి ఒప్పిస్తేనే తోటలో అది కట్టిస్తామన్నారు."

"అదా. అమ్మాయీ అసలు సంగతి?"

"అవును ఇప్పుడు చెప్పండి. నా కోరిక తీర్చలేరా?"

శ్రీకాంత్ స్తబ్ధుడై వాసంతి అమాయిక వదనాన్ని చూడసాగేడు. తన నెలాగైనా పెళ్ళికి ఒప్పించాలని ఈమెకి ఎందుకింత పట్టుదల? ఇందులో తన తల్లి ప్రోద్బలం ఎంత వున్నదీ అతనికి తెలుసు!




"వాసంతీ? మొత్తానికి నా వివాహం ఎలాగైనా త్వరగా జరిపించాలని చూస్తున్నా వన్నమాట?"

"బావుంది. వదినగారంటే నా కెంతో యిష్టం?"

'నువ్వలాగే వెర్రిగా అనుకుంటూ వుండు. లేదా—ఆ ఒదినగారొచ్చి నీతో మాటాడనైనా ఆడదు. అప్పుడో ..?"

"అఁహఁ. అలా ఎన్నటికీ కాదు. మా వదిన చాలా మంచిది!"

"నీ కెలా తెలుసు?"

"నాకు తెలుసు. మనిషి మొహంలోకి ఒక్కసారి చూస్తే చాలు....గ్రహించేస్తాను నేను." అంది వాసంతి నిశ్చయంగా.

"సరే—నా మొహంలోకి చూడు. ఏమన్పిస్తుందో చెప్పు చూద్దాం?"

వాసంతి నిశితదృక్కుల్తో శ్రీకాంత్ ముఖంలోకి రెండు క్షణాల పాటు చూసింది. 'నిజంగా చెప్పమన్నారా?" అంది మెల్లిగా.

"ఊఁ"

"పాపం, మీకు మనసులో ఏదో కొట్టుకుంటూ వుంది. కాని పెదాలు విప్పి

చెప్పలేకపోతున్నారు....

"ఏమిటది?"

"వేగిరం పెళ్ళివాలనే కోర్కె!"

"మళ్ళీ.... పెంకిపిల్లా! సరే—ఇది చెప్పు, నీకు వదిన కావాలా?

"నాకు ముందు వదిన కావాలి. తూగుటుయ్యాల దానిమట్టుకదే ఆనక వచ్చేస్తుంది"

శ్రీకాంత్ ఒక్క-క్షణంపాటు ఆలోచించేడు. ముఖంమీదికి చిన్న చిరునవ్వు పాకింది. వాసంతి దగ్గరగా వెళ్ళి ఆమె భుజంమీద చెయ్యి వేశాడు. "సరే వాసంతీ. వెళ్ళు. అమ్మతో చెప్పి— ఆమె యిష్టం వచ్చినట్లు అన్నీ ఏర్పాట్లూ చెయ్యమను." అన్నాడు.

వాసంతి కొన్ని క్షణాలపాటు విస్మయంగా శ్రీకాంత్ ముఖంలోకి చూసింది. ఆతని మాటలు కలా నిజమా అన్నట్టు వున్నాయి. "నిజంగానా?! ' అంది చప్పున.

"నిజంగా నిజం!" అన్నాడు శ్రీకాంత్.

వాసంతి ఉరుకులు పరుగుల్తో ' అమ్మా....అమ్మా" అని అరుస్తూ అన్నపూర్ణమ్మ గది వేపు పరుగెత్తింది.

"ఏవమ్మా, వాసంతీ! ఎందుకా ఉరుకులూ పరుగులూ? ఏమైంది?"

"అమ్మగారూ! ఇంక ఒక్క-క్షణం కూడా ఆలస్యం చేయకండి . .ప్రయత్నాలూ అవీ ఇప్పుడే ప్రారంభించండి."

' దేనికి? ఏ ప్రయత్నాలు?"

' అయ్యో. ఇంకా మీకు వేరే చెప్పాలా? చినబాబు పెళ్ళికి ఒప్పుకున్నారు!"

"నిజంగానా?!" అంది అన్నపూర్ణమ్మ అమిత ఆశ్చర్యంతో.

' నిజమే"

"ఎంత మంచిదానవమ్మా?" అంటూ ఆమె వాసంతిని కౌగలించుకుంది. ఇద్దరి కళ్ళలోనూ వింత మెరుపులు మెరిసినై.

# 4

భవనం అంతటినీ రంగురంగుల దీపాల్తో అతి వైభవంగా అలంకరించేరు. ఇంటి ముందు పెద్ద పందిరి. ఆ పచ్చని పందిరికింద అతి వైభవంగా, ఎందరో పెద్దల నమక్షంలో శ్రీకాంత్ రేణుకల వివాహం జరిగింది.

రాత్రి తొమ్మిది గంటలవుతూంది. భవనంలో జనసమ్మర్ధం కాస్త తగ్గింది.

బయటినుంచి వొచ్చిన అహూతులందరూ ఒక్కొక్కరే వెళ్ళిపోసాగేరు.

రేణుక ఒంటరిగా కూర్చొనివుంది. ఆ రోజు రాత్రి ఆమె వాసంతితోబాటు భోజనానికి కూర్చుంది. భోజనాల సమయంలో—రేణుని విశ్రాంతి తీసుకోమని పదేపదే చెప్పింది అన్నపూర్ణమ్మ. భోజనాలు కాగానే తాంబూలాలు వేసుకున్నారు. రేణూ చెయ్యి పట్టుకుని మేడమీది గదివేపు తీసుకువెళ్ళింది వాసంతి. వాళ్ళ వెనకే లచ్చికూడా వెళ్ళింది.

గది ద్వారందగ్గరికి వొచ్చి వాసంతి ఆగిపోయింది. సిగ్గుతో వంగిన రేణూ ముఖాన్ని ఎత్తింది. "చూడమ్మా వదినా! నీ ముఖంలో దోబూచులాడ్తున్న సిగ్గుల్ని విడిచిపెట్టు. ఇక్కడ వేరే ఇంకెవ్వరూ లేరు. ఈ రాజ్యానికి మహారాణివి నువ్వే! నువ్వు మిగతావాళ్ళని నీకు దాసులుగా చేసుకుంటావో, మహారాణీవే అవుతావో అంతా నీ యిష్టం!" అంది.

రేణూ నెమ్మదిగా తల తిప్పి చూసింది. గది ద్వారాలకి ఖరీదయిన సిల్కు తెరలున్నాయి. తళతళ మెరుస్తూన్న నాలుగు టేబులుఫేన్లు గదికి నాలుగుమూలలా వున్నాయి. పూలరథంలా అమర్చిన మంచం. ఓ మూల ఫ్లవర్ వేజ్ లో నానా సుగంధాలు వెదజల్లుతూన్న రకరకాల పువ్వులు.

"ఇది నీ విశ్రాంతిగృహం" అంది వాసంతి మంచాన్ని చూస్తూ.

నవ్వుతూన్న కళ్ళతో కృతజ్ఞతాపూర్వకంగా వాసంతిని చూసింది రేణుక. వాసంతి టేబులు దగ్గరికి వెళ్ళి పాన్ దాన్ వేపు చూసింది.

"లచ్చీ ఇక్కడ ఏలకుల్లేవేం?"

'నేను తేలేదమ్మగారూ."

"ఉఫ్. అబ్బా. ఏ పని చేసినా నువ్వెప్పుడూ ఇంతే. అంతా సగం సగం చేస్తావు. వెళ్ళి అమ్మగారిదగ్గరుంటాయి తే . అఁహాఁ ఒద్దులే నేనే వెళ్తాను. చూడూ

"చెప్పండమ్మగారూ."

"ఆ కిటికీలకీ, ద్వారాలకీ వున్న తెరలు దించు. నే నిప్పుడే వస్తా' అంటూ వాసంతి వెళ్ళిపోయింది. లచ్చి ఒకొక్క తెరనే దించసాగింది. రేణుక మౌనంగా కుర్చీలో కూర్చుంది. ఈ ఇంటికి వచ్చినదగ్గర్నుంచీ తనకి వాసంతి అన్న పేరు తప్ప మరోపేరు వినబడటం లేదు. ఎంతసేపూ ప్రతివారి నోటా వాసంతీ—వాసంతీ! ఏ పని చెయ్యాలన్నా వాసంతే చెప్పాలి. ఏ వస్తువు కన్పించకపోయినా వాసంతినే సలహా అడగాలి. వాసంతి లేకపోతే ఇంత పెద్ద భవంతిలోని కార్యకలాపాలూ స్తంభించిపోతాయేమో....ఎవరీ వాసంతి?

"లచ్చీ."

చేస్తున్న పని ఆపి తనని నెమ్మదిగా పిల్చిన రేణుకవేపు చూసింది. మెల్లిగా ఆమెని సమీపించింది. రేణు ఓ పదిరూపాయల నోటు తీసి దాన్ని మాయ చేతుల్లో కుక్కింది.

"ఇదేంటమ్మా?"

"మామూలేగా."

"ఒద్దమ్మగారూ. "

"అరే. వుంచమన్నాగా. వుంచుకో." అంటూ రేణూ బలవంతం చేస్తుంటే—ఆమె మాట కాదనలేకపోయింది లచ్చి. నోటుని రెండు మడతలు పెట్టి జాకెట్లో దోపుకొంది.

"ఎవరికీ చెప్పకు" అన్న రేణు మాటలు విని నిరుత్తరురాలైంది. లచ్చి మనస్సులో ఏవేవో సందేహాలు రేకెత్తినయి. అంతలోనే వాసంతి మళ్ళీ తిరిగివచ్చింది. "లచ్చీ. బాబుగారి బట్టలూ, అమ్మగారి బట్టలూ కింద తీసిపెట్టి వుంచేను. వెళ్ళి తీసుకురా." అంది.

"అలాగేనమ్మా" అంటూ వెళ్ళిపోయింది లచ్చి.

"ఎమిటలా చూస్తున్నావు?" అంది రేణుక తననే తదేకంగా చూస్తోన్న వాసంతిని వుద్దేశించి.

"చంద్రబింబంలాంటి నీ మఖాన్ని చూస్తూంటే నాకొకటి అన్పిస్తోంది పదినా? బ్రహ్మదేవుడు చాలా తీరుబాటుగా నీ రూపురేఖల్ని సృష్టించివుంటాడు."

"అబ్బ. వూరుకుందూ. అంతా వేళాకోళమే."

"వేళాకోళం కాదొదినా. నిజంగానే చెప్తున్నా. సరేగాని ఇక నేను వెళ్తాను."

"ఎక్కడికి?"

"మరి నేను రెస్టు తీసుకోవద్దూ. అదీగాక అమ్మగారికి భోజనంకూడా వడ్డించాలాయె ..."

నన్ను ఒంటరిగా వదిలేస్తావా?"

"గాభరాపడకమ్మా, వదినా! నీ పతీదేవులుంగారు ఈపాటికి వేంచేస్తూనే వుంటారు... "

"అదుగో మళ్ళీ—"

కోప్పడకండి మరి. ఇహ వస్తా." అంటూ బైటికి వెళ్ళిపోయింది వాసంతి.

రేణు తలలో మళ్ళీ ఆలోచనలు చెలరేగేయి. ఎవరీ వాసంతి? ఆమె ఆజ్ఞ లేందే




ఒక్క ఆకైనా అల్లాడదెంచేత ? వాసంతికీ ఈ కుటుంబానికీ ఏమిటి సంబంధం ?

అంతలో ద్వారం దగ్గర చప్పుడయింది. లచ్చి, చేతిలోవున్న బట్టల్ని టేబిలుమీద పెట్టి నిలబడింది.

"లచ్చీ."

"ఏం అమ్మగారూ?"

"నువ్విక్కడ ఎన్నాళ్ళనుంచి పని చేస్తున్నావు?"

"చాలాకాలంనుంచీ పని చేస్తున్నానమ్మా."

"వాసంతి?"

"ఆమెగారు చిన్నప్పట్నుంచీ ఇక్కడే వుంటున్నారని విన్నానమ్మా."

"చినబాబుగారికి ఏమైనా బంధువా?"

"అబ్బే. కాదమ్మగారూ. నిజం చెప్పాలంటే . "

ఆ( ఆ( చెప్పు."

"పెద్దబాబుగారి దగ్గర ఆమె తండ్రిగారు గుమాస్తాగా పని చేసేవారంటమ్మా. ఆయనగారు కాలం చేసేక వాసంతమ్మగార్ని కన్నబిడ్డల్లే పెద్దమ్మగారు చూసు

కుంటున్నారు ..''

''వాసంతి కింకెవరూ లేరా?''

''ఒక అన్నయ్య వుండేవాడమ్మా. ఆయనా, మన చినబాబుగారూ ప్రాణ స్నేహితులు.''

''ఓ—అతనా! జలపాతంలో ప్రమాదవశాత్తూ చనిపోయేడు ...''

''అవునమ్మా. అన్నగారు పోయేక పెద్దమ్మగారు ఆమెని ఈ ఇంటికొచ్చి వుండ మన్నారు.''

''అంతకు ముందో?''

''ఇదుగో ఈ కిటికీలోంచి చూడండమ్మా అదుగో ఆ కనిపించే యింట్లోనే ఆమె యింతకు ముందు వుండేది. .

''ఇప్పుడు—అక్కడెవరుంటున్నారో?''

''ఎవరూ లేరు. ఏదో కొంత పాత సామానుందక్కడ''

ఇంతలో శ్రీకాంత్ జోళ్ళ చప్పుడు వినిపించింది. లచ్చి తత్తరపాటుతో రేణుక దగ్గర సెలవు పుచ్చుకుని ఆక్కడినుంచి నిష్క్రమించింది.

''రేణూ'' అంటూ తన సహజ గంభీరస్వరంతో పిలిచాడు శ్రీకాంత్. అతని పిలుపుకి జవాబు రేణూ గుండెల వరకూ వచ్చింది. కాని సిగ్గుతో నోటంట మాట రాలేదు.

'నిద్ర వస్తోందా?'' మంచం మీద ఆమె పక్కనే కూర్చుంటూ అనునయంగా అడిగేడు శ్రీకాంత్. ''లేదు .'' అంటూ తత్తరపాటుతో లేవబోయింది. ఆమె భుజంమీద చెయ్యి వేస్తూ బలవంతంగా కూర్చోబెట్టేడు శ్రీకాంత్, ఎంతగానో ప్రయత్నించిన మీదట ఆమె సిగ్గుని కొంతైనా పోగొట్టగలిగేడు.

''ఉఁ. ఎలా వుంది—ఈ కొత్త యిల్లు? ఆమె ముంగురుల్ని సవరిస్తూ ప్రశ్నించేడు

''ఒక్క రోజులో యెలా చెప్పగలను?' అంది రేణు నెమ్మదిగా, ఆనక ' వాసంతి అంటే మీకెంతో అభిమానం అనుకుంటాను. నిజమేనా?''

''అవును. నిజం చెప్పాలంటే—ఈ రోజు ఈ భవనం ఇంతలా రంగుల్తో కలకలలాడ్తూ వుందంటే అది వాసంతి చలవే....పైగా నువ్వు కూడా వచ్చేవు. ఇంకేం?

'ఈ భవనం అందం ఎక్కువవుతుందంటారా?''

''వసంతం వస్తే పూలతోట గుబాళించదూ? అలాగే—'' అన్నాడు శ్రీకాంత్

నవ్వుతూ.

రేణుక మౌనంగా వుండిపోయింది. వాసంతికి ఈ ఇంట్లో ఇంత ప్రముఖస్థానం ఎలా యివ్వబడింది అన్నది ఆమెకి అంతు దొరకని ప్రశ్న.

'ఓమాట అడగనా?' నెమ్మదిగా అంది రేణు.

' ఒకటి కాదు వెయ్యి అడుగు '

' వాసంతి ఎవరు?'

"నాకు రాజు అనే స్నేహితుడు వుండేవాడు. అతని చెల్లెలు వాసంతి. అతను చనిపోయిన తర్వాత వాసంతి ఏకాకి అయిపోయింది. అప్పట్నించీ ఆమె యిక్కడే వుంటూంది ..."

ఈ మాటలు అంటూంటే శ్రీకాంత్ కళ్ళు చెమర్చడం రేణుక గమనించింది....

' రేణూ ...నువ్వు నాకో మాటియ్యాలి. నీ కంఠంలో ప్రాణం వుండేవరకూ వాసంతికి ఏ కష్టమూ కలగనివ్వకూడదు. అలా అని మాటియ్యి ." అంటూ ఆమె చెయ్యి అందుకున్నాడు

*   *   *

' అబ్బ.. .నువ్వా వాసంతీ!'

"ఆఁ. నేనే వదినా. తెల్లారిపోయింది. ఇంకా ఎంతసేపు నిద్రపోతావ్?"

"నిద్రపోవొద్దంటావా?"

"ఉహూ. అది కాదొదినా . తెల్లారిందీ అంటున్నా—"

"నాకాసంగతి కన్పిస్తూనే వుందిగా"

రేణూ కంఠంలో అస్పష్టంగా వినిపించిన కరినత వాసంతిని కొంచెం కదిలించింది. నిన్నరాత్రి శ్రీకాంత్‌తో ఏదైనా ప్రణయకలహం జరిగివుంటుందని మనస్సుకి సమాధానం చెప్పుకొని కప్పుతో మంచం దగ్గరికి నడిచింది వాసంతి.

"ఇదేమిటి?" అంటూ మంచంమీద లేచి కూర్చుంది రేణుక.

' కాఫీ'

"నువ్వు తాగవా?"

"లేదొదినా. నేను స్నానం అదీ కానిచ్చి తాగుతాను."

' నేను బెడ్ కాఫీ తాగుతానని నీ కెలా తెలుసు?"

"చినబాబు చెప్పారుగా—అదిసరేగాని. స్నానం ఎప్పుడు చేస్తావొదినా?"

' నా స్నానం సంగతి నువ్వాలోచించకు. స్నానం చెయ్యాలనిపించినప్పుడు లచ్చిని కేకేస్తాలే?"

"లచ్చినా! దానికేం తెలుసు, వట్టి మొద్దు. నిన్ను సంరక్షించే బాధ్యతంతా నాదే నండీ వదినమ్మగారూ!' అంటూ నవ్వింది వాసంతి.

"నీ బాధ్యతా? ఏమేం పన్లు చెయ్యాలి నువ్వు?"

'చెప్పనా? నీ విశ్రాంతికి ఏర్పాట్లు నీ బట్టల ఎన్నిక...భోజన సదుపాయాలు. అన్ని విషయాలూ నేను గమనించాలి. ఒకవేళ నీ మనసు బాగా లేదనుకో. ."

'ఆఁ—లేకపోతే, ఏం చేస్తావు?"

వదినగారి మనస్సులో సంతోషం నింపడానికి వీణ వాయిస్తాను. పాటలు పాడ తాను. మంచి మంచి కబుర్లు చెప్తాను."

"అప్పటికీ నా విచారం పోకపోతే—?"

"అప్పుడేం చెయ్యనూ ' అంటూ బుర్రగోక్కుంది, "ఆఁ చినబాబుని మీ దగ్గరకు లాక్కొస్తాను " అంటూ కిలకిల నవ్వింది వాసంతి. రేణుకి కూడా ఎంత ఆపుకుందామనుకున్నా నవ్వొచ్చింది.

# 5

"ఎవరబ్బా! ఈ వీణ వాయిస్తున్నదీ? : '

' వాసంతి"

'అబ్బ. ఇంత చక్కటి సాయంకాలం పూటా ఆ సంగీతం వింటూంటే మనస్సులో ఏదో దేవుతున్నట్టన్పిస్తూంది '

"చాలా విచిత్రంగా వుందే, ఈ మధుర సంగీతం మనస్సుకి శాంతి గాని .."

' ఒకే మందు అందరు రోగులకీ పనికి వస్తుందా? కొందరికి శాంతినిస్తుంది. మరి కొందరికి వేదనని కలిగిస్తుంది '

"రేణూ : !"

"ఏం? '

"అది సరేగాని—ముందు బట్టలేసుకొని తయారవు, టైమైపోతూంది . "

రేణుక డ్రెసింగ్‌రూంలోకి నడిచింది. అద్దం ముందు నిలబడి శ్రీకాంత్ టై కట్టుకోసాగేడు. కింద గదిలోని వాసంతి వీణా వాయిద్యం యిక్కడివరకూ విన్పిస్తోంది.

'ఏమండీ, ఈ వీణని నేర్చుకోడం మాన్పించేస్తే ఏం? అంది రేణుక ఒక్కసారిగా.

ఆమె ప్రశ్నకి చకితుడైన శ్రీకాంత్ ఏం?" అన్నాడు.




"సంగీతం నేర్చుకునేవాళ్లు కఠిన హృదయులు అవుతారని విన్నాను."

"అయితే—?"

"మన వాసంతికూడా అలాగే అయిపోతుందేమోనని నా భయం!"

"వాసంతి అన్నివేళలా తాను నవ్వుతూ—అందర్నీ నవ్విస్తూ వుండడం నాకు యిష్టమే. కాని వీణ అభ్యాసం ఆపడం—అది అసంభవం?"

"ఎంచేత?"

"చెప్తా విను. ఒక అందమైన రామచిలుకని నువ్వు పెంచుతున్నావనుకో. ఆ చిలక నిన్ను వదిలి ఆకాశంలోకి ఎగిరిపోవడం నీకిష్టం లేదు. అలాగన్చెప్పి దాని రెక్కలు తెగనరుకుతావా, చెప్పు?" అన్న శ్రీకాంత్ ప్రశ్నతో నిరుత్తరురాలై మౌనంగా నిలబడింది రేణుక.

కాసేపటికల్లా చీర మార్చుకొని, వచ్చి భర్తకి ఎదురుగా రేణు నిలబడింది. "పదండి. నేను రెడీ!" అంది.

"ఆగాగు. వాసంతి యేదీ?"

"వాసంతికూడా వస్తుందా?"

"అవును, రేణూ! వాసంతికి నాట్యం అంటే ఎంత ఇష్టమో. ఆ పేరు చెప్తే చాలు యెగిరి గంతులేస్తుంది."

రేణుకకి ఏమనాలో మరి తోచలేదు. నెమ్మదిగా మేడమెట్లమ్మట కిందికి దిగ సాగింది. ఆమె మస్తిష్కంలో రకరకాల ఆలోచనలు చోటు చేసుకోసాగేయి. పెళ్ళయి ఇంకా నెలరోజులుకూడా పూర్తిగా కాలేదు. రాత్రి సమయాల్లో భర్త సరసని నిద్రపోవడం తప్ప—వేరే సంభాషణలకి అవకాశమే లేదు. అతను సరేసరి. ఇరవై నాలుగ్గంటలూ వాసంతీనామ జపమే! ఇంటా బైటాకూడా వాసంతిదే రాజ్యం. అన్ని పనులూ ఆమె ఇచ్ఛానుసారంనే జరుగుతాయి. ఆమె గురించి ఎవ్వరూ ఒక కరినగా వాక్యమేనా అనరు. ఆమె వీణ నేర్చుకోవాలంటే బోలెడంత జీతం పోసి ఒక గురువు గారు. ఆమె కోరడమే తరువాయి—అన్నీ అప్పటికప్పుడు ప్రత్యక్షమౌతాయి. ఇంతకీ ఆమె ఎవరో—ఒక సామాన్యమైన ఎస్టేటు గుమాస్తా కుమార్తె! తోడూ నీడా లేక అనాథ అయింది! అయితే ఏం? అలాంటి అనాథలు ఈ దేశంలో ఇంకా ఎందరు లేరు?

కింద సావడి గదిలో వాసంతి కూర్చొని వీణ సాధన చేస్తోంది. మాస్టరు - రు అప్పుడే వెళ్లిపోయినట్టున్నారు. ఆమెను సమీపించి మెల్లిగా "వాసంతీ" అని పిల్చింది రేణుక.

తీగెలను మీటుతూన్న వాసంతి అంగుళులు ఆగిపోయేయి. తలెత్తి రేణుకను చూసింది.

"ఆయన నీకోసం చూస్తున్నారు పొడిగా అంది రేణు.

"ఓహో—నే నది మర్చేపోయాను. మనం డాన్స్ ప్రోగ్రాం చూడడానికి వెళ్తున్నాం గదూ?' అంది వాసంతి సంభ్రమంగా.

"అవును. నువ్వు లేకపోతే ఈ ప్రోగ్రాంలో ఆనందమే లేదు."

"ఇదిగో వచ్చేస్తున్నా. ఒక్క నిమిషం ." అంటూ 'లచ్చీ' అని పెద్దగా కేకేసింది వాసంతి. లచ్చి రాగానే 'ఇదిగో దీన్ని లోపల పెట్టెయ్యి" అంటూ లచ్చికి వీణ అందిచ్చింది. ఇద్దర్నీ చూస్తూ అంటీ ముట్టనట్టు నిలబడింది రేణు. బట్టలు మార్చుకునేందుకు తన గదివేపు వాసంతి వెళ్ళగానే, దగ్గరకి రమ్మన్నట్టు లచ్చివేపు చూసి సైగచేసింది రేణుక. దగ్గరికి రాగానే చెవిలో మెల్లిగా ఏదో చెప్పింది. అంతా అయ్యేక—సానునయంగా అభియపూర్వకంగా రేణూవేపు చూసింది లచ్చి. నిశ్చింతగా తిరిగి మేడ మెట్లెక్కింది రేణుక.

అద్దం ఎదురుగా కూర్చొని తల దువ్వుకోసాగింది వాసంతి. తెర తొలగించి ఆమె పక్కనే నిలబడింది లచ్చి. అటు చూస్తూ 'ఏం లచ్చీ?' అంది వాసంతి.

"ఏం లేదమ్మగారూ ." అంటూ నసిగింది.

"అలా అన్నావంటే తప్పకుండా ఏదో వుందన్నమాట. ఏంటది చెప్పు. త్వరగా!" అంది వాసంతి రెట్టిస్తూ.

'మీరు డేన్స్ చూడ్డానికి వెళ్తున్నారు కదమ్మా?"

"అవును. ఇవాళ పద్మిని డేన్స్ ప్రోగ్రామ్ వుంది.'

'మీరెళ్లడం మానేస్తే మంచిదేమోనమ్మా'

'ఏం?' వెంటనే ప్రశ్నించింది వాసంతి.

'మీరు, కూడా రావడం కోడలుగారికి యిష్టం లేనట్టుంది.... '

"ఏమేనా అన్నారా? '

'అబ్బే అదేం కాదు. అయినా నా కెందుకు కానీ, మీరు గబగబ తయారవండి అమ్మగారూ!

' సంగతేమిటో నువ్వు చెప్పకపోతే నిన్ను చంపుకు తిన్నంత ఒట్టు!'

'అమ్మా! ఎంతమాటన్నారమ్మా! వారి గది పక్కనుంచి వెళ్తూ యాదాలాపంగా విన్నానమ్మా . . '

"ఏమిటి?"

"వాసంతి రాకపోతే సరదాగా వుంటుంది కదండీ—అంటూ కోడలుగారు చిన బాబుతో చెప్తున్నారు ..."

' చినబాబేమన్నారు?

"నిజమేగాని — రావొద్దంటే — పిచ్చిపిల్ల. చిన్నబుచ్చుకుంటుందేమో !— అన్నారమ్మా"

వాసంతి మౌనం వహించి శిలలా కూర్చుండిపోయింది. ఆమె మనస్సులో దట్టమైన నల్లని మేఘాలు ముసురుకొనసాగేయి, లచ్చీ.... అని పిలిచింది.

"లచ్చీ.... నేను రాను. వాళ్ళిద్దర్నీ వెళ్ళిపొమ్మని చెప్పు!

"ఒద్దమ్మా, మీరూ వెళ్ళండి. లేకపోతే నాకు మాటొస్తుంది

"అబ్బబ్బ! నేను చెప్పినట్టు చెయ్యవే లచ్చీ! వెళ్ళి—నాకు మనసు బాగాలేదనీ—రాననీ—చెప్పు. ఏం?

"అలాగేనమ్మా!" అంటూ లచ్చి అక్కడినుంచి నిష్క్రమించింది.

నిజమే. వారిద్దరూ కొత్త దంపతులు. ప్రేమపారవశ్యంలో మునిగి తేలాల్సిన వాళ్లు, ఇద్దరికీ ఎన్నెన్నో ఆశలుంటాయి. మధ్యలో—తానెందుకూ పానకంలో పుడకలాగ!....కాని, అంతలోనే పద్మిని నాట్య భంగిమలు ఆమె మనోనేత్రం ముందు తళుక్కుమని మెరిసేయి అణువణువునా ఆనందం వెల్లివిరియించే ఈ నృత్యప్రదర్శన

చూసే భాగ్యం మళ్ళీ ఎన్నాళ్ళకి వస్తుందో!

''వాసంతీ!''

ఉలిక్కి పడింది వాసంతి. ఎదురుగా నవ్వుతూ శ్రీకాంత్ నిలబడి వున్నాడు.
''మీరా?!'' అంటూ సంభ్రమంగా లేచి నిలబడింది.

''నిన్ను స్వయంగా తీసుకెళ్దామని వచ్చాను వాసంతీ.''

''కానీ, నా కెంచేతో ఇవేళ మనసు బాగోలేదు చినబాబూ!''

''అయితే మరింకేం? నాట్యప్రదర్శన చూస్తూనే మనస్సు బాగై పోతుంది. పదపద!''

''కాని....'' కళ్ళల్లోంచి ఉబికివస్తున్న కన్నీటిని అతి ప్రయత్నం మీద ఆపుకో గల్గింది వాసంతి.

''కానీ లేదు. పైసా లేదు. ఈ కబుర్లన్నీ కట్టిపెట్టు వసూ. అవతల వేళ మించి పోతూంది. పద పద.''

''ఈ ఒక్కసారికీ నన్ను క్షమించి ఒదిలెయ్యండి. బలవంతం చేయకండి.''

''సరే—మేం కూడా వెళ్ళడం మానేస్తాం.''

''అయ్యో. అదేం?''

''మరి, నువ్వొ రా?''

ఆ కంఠంలో ధ్వనించిన ఆజ్ఞనీ అభ్యర్థననీ మరి కాదన్లేక పోయింది వాసంతి. తప్పనిసరిగా బయల్దేరక తప్పలేదు!

* * *

ఓనాటి సాయంత్రం—

''వాసంతీ!'' అని పిల్చింది రేణుక.

పరధ్యానంగా ఎటో చూస్తున్న వాసంతికి ఆమె పిలుపు వినబడలేదు. ''వాసంతీ'' అంటూ మళ్ళీ పిలిచింది రేణుక.

''ఏం వదినా?

''ఏం ఇవాళింత విచారంగా వున్నావ్?''

''లేదే.''

''అదిగో. నువ్వేదో నా నుండి దాచుతున్నావు.''

''అబ్బే. లే దొదినా! నీ దగ్గర దాచదగ్గ విషయం నా దగ్గర ఏముంటుంది?'' అలా అంటూ వుంటే వాసంతి పెదాలు వణికినై. రెండు కన్నీటి బిందువులు చెంపల మీదుగా జారి పడ్డాయి. అప్రయత్నంగా రేణు వాసంతిని దగ్గరికి తీసుకొని వీపుమీద




చెయ్యివేసి నిమిరింది.

"పిచ్చిదానా, విషాదాన్ని గుండెల్లో పెట్టుకొని ఎంతకని భరిస్తావు?"

'నన్ను నమ్మ వదినా. ఏ విషయానైనా సరే—నేను దాచే ప్రయత్నం చెయ్యలేను."

మరేమిటీ కన్నీరు? ఎందుకీ మౌనం?'

"అదిగో....అక్కడ ఓ జలపాతం వుండడం నువ్వు ఎప్పుడేనా చూశావా? జాగ్రత్తగావింటే జలపాతపు హోరు కూడా విన్పిస్తుంది...."

'ఆఁ. అవును.'

"నా జీవితంలో విషాదానికీ అదే కారణం!"

"ఎంచేత?"

'అది అడక్కు వదినా....ఆ పీడకలల్ని గుర్తుకి తెచ్చుకుంటే ప్రయోజనంలేదు. మరింత పిచ్చిదాన్నయిపోతాన్నేను." అంటూ నెమ్మదిగా అక్కడినుంచి నిష్క్రమించింది వాసంతి.

రేణుకకి అంతా అయోమయంగా తోచింది.

* * *

ఆ రోజు శ్రీకాంత్ ఇంటికి తిరిగివచ్చేసరికి చాలా పొద్దుపోయింది. వస్తూనే భార్యని కేకేసి "వాసంతి ఏదీ?" అన్నాడు.

" నిద్రపోయింది."

" ఇంత త్వరగానా ?"

"ఏమో మరి, నిద్ర వస్తోందంటూ వెళ్ళిపోయింది."

' అలాగా.... '

"లేపి తీసుకురమ్మన్నారా ?" అంది రేణుక నెమ్మదిగా, కంటి చివర్లతో భర్తని చూస్తూ.

"ఒద్దొద్దు. ఎందుకూ ?' అంటూ బట్టలు మార్చుకోసాగేడు. రేణు లచ్చిని కేకేసి భోజనాన్ని మేడమీదకే తీసుకురమ్మని చెప్పబోయింది.

"ఎందుకూ. డైనింగ్‌హాల్లోకే వెళ్ళి భోంచేస్తే పోలా ?" అన్నాడు శ్రీకాంత్ మధ్యలో.

"మనిద్దరమేగా మిగిలింది. అంచేత ఇక్కడికే తెప్పించేస్తున్నాను ..."

"సరేలే—అవును గానీ—వాసంతి భోజనమైందా ?"

"లేదు. ఆకలి లేదంది."

"ఆకల్లేదందా ? ఇంత త్వరగా నిద్రపోయిందా ?"

"అతి సాధారణ విషయాల్నికూడా మీరింత సీరియస్‌గా తీసుకొని ఆందోళన పడతారేం ?"

"ఏమిటో అలవాటైపోయింది. మామూలుగా జరిగేదానికి ఏమాత్రం భిన్నంగా జరిగినా కంగారుగా వుంటుంది. ఒక్క క్షణం వాసంతి కన్పించకపోతే తోచదు !"

భర్తమాటలు వింటూ ఓరకంటితో అతన్ని గమనించసాగింది రేణుక. అతని హృదయగతభావాన్ని తెలుసుకోవాలంటే సాధ్యపడటంలే దామెకి. ఈలోగా లచ్చి వొచ్చి భోజనపదార్థాల్ని పాత్రల్లో తీసుకొచ్చి టేబులుమీద పెట్టింది.

"రేణూ, నువ్వు కంచాలువేసి వడ్డిస్తూ వుండు. నేనిప్పుడే వెళ్ళి అమ్మతో ఒక విషయం చెప్పి వస్తాను." అంటూ శ్రీకాంత్ మేడ దిగి కిందకి వెళ్ళేడు.

తల్లితో ఏదో మాటాడి మేడమెట్లవేపు వెళ్తూవుంటే, తన గదిముందు నిలబడి వున్న వాసంతి కనిపించింది శ్రీకాంత్‌కి. ఆమెని చూస్తూనే నిలబడిపోయాడు.

"ఎంతసేపైంది మీరొచ్చి?" అంది వాసంతి శ్రీకాంత్‌ని చూస్తూ.

"ఏదీ యిప్పుడే వచ్చా. నువ్వు నిద్రపోతున్నావని చెప్పిందే రేణూ ?"

ఏదో అందామని నోరు తెరిచింది వాసంతి. కాని మౌనంగా ఆశ్చర్యమయదృష్టితో శ్రీకాంత్‌ని చూసింది.

"ఇవాళ నువ్వు భోజనంకూడా చెయ్యలేదట ?!"

"ఆకలి కాలేదు."

"నాన్సెన్స్....రా, భోంచేద్దాం. ఇవేళ నువ్వు మాతోపాటు గదిలో తిందువు గాని రా !"

"మీరు తినండి నాకు ఆకలిగా లేదు."

"ఒంట్లో బాగుంది కద !"

"బాగానే వుంది గానీ—ఎంచేతో ఇవాళ నిద్ర ఒకటే ముంచుకొస్తోంది."

"సరే—వెళ్లు. విశ్రాంతి తీసుకో." అంటూ మేడ మెట్లెక్కి తన గదివేపు వెళ్ళిపోయేడు శ్రీకాంత్.

వాసంతి అక్కడే నిలబడిపోయి రేణూ చేసిన పనినిగురించి ఆలోచించసాగింది. ఎందుకు అబద్ధమాడింది? భోజనం తమ గదిలోకే రప్పించుకోవడానికి ఏమిటి కారణం? తనని దూరదూరంగా వుంచడానికి చేసే ప్రయత్నం కాదుగదా ఇది! ఇంతకీ ఆమెకి ఏం కావాలి? ఆమె ఆశయం ఏమిటి?

ఆమె మనస్సులో ఓమూల పేరుకునిపోయి నిద్రాణమైవున్న వేదన అంతా ఒక్క సారిగా జాగృతమైంది. నెమ్మదిగా తన గదివేపు దారి తీసింది. తన విషయంలో రేణూ అబద్ధమాడిందని తను శ్రీకాంత్‌కి ఎట్లా చెప్తుంది? ఈ చిన్న విషయానికి భార్యాభర్తల మధ్య కలతలు రావడం ఏందుకు? వారి అన్యోన్యతని భంగంచేసే హక్కు తనకేం వుంది? తనెవరు? తనకున్న అర్హత అల్లా రాజుకి సోదరి కావడమే! రాజూ, శ్రీకాంత్‌లు ప్రాణమిత్రులు గాబట్టి తనకీమాత్రమేనా ఆశ్రయం దొరికింది లేకపోతే తననీ విశాల ప్రపంచంలో ఆదరించే ప్రాణి ఎవరున్నారు?

నిర్జీవంగా మంచంమీద కూలబడి, తలగడలో తలదూర్చి వెక్కి-వెక్కి ఏడ్వ సాగింది వాసంతి.

# 6

"వాసంతీ, అలా వెళ్దాం వస్తావా?"

"ఎక్కడికి వదినా?"

"బజారుదాకా వెళ్దాం."

"ఏం, ఏమన్నా పనుందా?"

"ఏం లేదు. ఏవేనా కొందామని...."

"నువ్వెళ్లు వదినా, నాకొంచెం పని వుంది."

తమతో రమ్మని ఎంతగానో బ్రతిమలాడింది రేణు. కాని వాసంతి వినలేదు.

"పోనీ! నీకేమేనా కావాలా చెప్పు. బజార్నుంచి తెస్తాను."

"తెస్తావా?" అంటూ మెరుస్తూన్న కళ్ళతో నవ్వింది వాసంతి. "నా కోసం ఒక మంచి బొమ్మ తీసుకురా వదినా!"

"బొమ్మా....ఏం చేస్తావు దాంతో?" అంటూ నవ్వింది రేణు.

"ఆడుకుంటాను."

"జీవంలేని బొమ్మతో ఏం ఆట ఆడ్తావు? జీవం వుండీ కదిలే ఇంచక్కని బొమ్మని వెదుక్కోరాదూ?" అంది రేణు ఇంకా నవ్వుతూనే.

"నువ్వన్నట్టు—మాట్లాడే బొమ్మని తీసుకొచ్చేను. కాని ఆ బొమ్మ పరాయి దయిపోయింది. అంచేత మాటలు రాని బొమ్మమీదికి నా దృష్టి మళ్లింది" అన్నది వాసంతి రేణుని భావస్ఫోరకంగా చూస్తూ.

"సరేనమ్మా— నీ యిష్టం?" అంటూ వెళ్లిపోయింది రేణుక.

నిస్పృహగా కుర్చీలో కూలబడింది వాసంతి.

కళ్ళముందు ఏవేవో దృశ్యాలు కదులాడసాగినై.

చల్లటి సంధ్యాసమయం....ఆనాటి గాలి....దూరంనుంచి విన్పిస్తోన్న జలపాతపు హోరు....పక్షుల కేకలు....రెక్క తెగిన పక్షి ఆర్తనాదాలు....ఒక్కొక్కటే వుచ్చరించ సాగినై ...అంతలో రేణుక ప్రవర్తన, ఆమె అనుమాన ప్రవృత్తి....గుర్తుకి వచ్చింది. అప్రయత్నంగా వాసంతి కనుకొలకుల్లో నీళ్ళు నిలిచేయి. అప్పుడే అక్కడికి వచ్చిన అన్నపూర్ణమ్మ వాసంతి నీళ్ళునిండిన కళ్ళని గమనించింది. ఆందోళనగా ఆమెని దగ్గరికి తీసుకుని "ఏమమ్మా, చినబాబు యేమైనా అన్నాడా?" అంది. తలని అడ్డంగా వూపింది వాసంతి.

"అయితే ఇది రేణూ పనే అయివుంటుంది"

అ మాటతో వాసంతి దుఃఖం మరీ పెల్లుబికింది. "అమ్మా" అంటూ ఆమె కౌగిట్లో ఒదిగిపోయింది. అన్నపూర్ణమ్మ కాసేపు ఏమీ మాట్లాడలేదు. ఆలోచనా పూర్వకంగా వాసంతి తలని ప్రేమగా నిమిరింది. "ఏమందమ్మా రేణూ?" అంది.

"అబ్బే ఏమీ అనలేదు"

"మరి...."

"అమ్మగారూ, నేనొకటి చెప్తాను. ఎవరికీ చెప్పనని ఒట్టేయండి"

వాసంతి చేతిలో చెయ్యివేసింది అన్నపూర్ణమ్మ. "చెప్పు, ఏమైంది?" అంది.

"రేణూ వదిన ఈ మధ్య ఎంచేతో నన్ను దూరదూరంగా వుంచుతోంది.... ఎందుచేతో! నాకు అర్థం కావటం లేదు."




"అంతేనా?"

"అప్పుడప్పుడు ఏవేవో సూటీపోటీ మాటలంటోంది...."

"చిన్నపిల్లవిగదూ....నిన్ను ఉడికించాలని అంటూందేమో! నువ్వేమీ మనస్సుని కష్టపెట్టుకోకు." అంది అన్నపూర్ణమ్మ. పైటచెంగుతో కళ్ళుతుడుచుకుంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయింది వాసంతి.

అన్నపూర్ణమ్మ ముఖం ఒక్కసారిగా గంభీరంగా మారిపోయింది. కోడలుపిల్లి ప్రవర్తన గురించి తెలుసుకున్నాక చెప్పలేని ఏదో మనో వ్యాకులత ఆమెలో చోటు చేసుకుంది. ఇలాంటిదేదో జరిగి వాళ్ళమధ్య కలతలొస్తాయని ఆమె ముందే వూహించింది. కాని వాటి పరిణామం—ఈ విధంగా వుండగలదని—పరిష్కారం ఇదని గాని ఆమె ఆలోచించలేకపోయింది.

* * *

భార్యాభర్తలిద్దరూ బజార్నుంచి వచ్చేటప్పటికి కనుచీకటి పడింది. వాసంతికోసం అందమైన జపానుబొమ్మ ఒకటి కొన్నాడు శ్రీకాంత్. దాన్ని రేణూ చేతికిచ్చి తను బట్టలు మార్చుకుందామని మేడమెట్లెక్కేడు.

వాసంతి తన గదిలో కూర్చొని, వీణ చేతబుచ్చుకుని సాధన చేస్తోంది. రేణూ నెమ్మదిగా ఆమెను సమీపించింది. చేతిలోవున్న బొమ్మని వాసింతికి యిచ్చి "ఇదిగో నమ్మా, నీ బొమ్మ!' అంది.

"నిజంగానే తెచ్చేవే?!"

"నువ్వు చెప్పడం నేను తేకపోవడమూనా?"

"థాంక్స్" అంటూ బొమ్మ కాళ్లూ చేతులూ ఆప్యాయంగా తడిమింది వాసంతి.

"బావుందా?"

"నువ్వు తేవడమూ, నాకు నచ్చకపోవడమూనా?" అంది వాసంతి కృతజ్ఞతా పూర్వకంగా.

రెండు క్షణాలు గడిచేక 'నీకోసం ఏమిటి తెచ్చుకున్నావు వదినా?' అంది వాసంతి.

"రా. నా గదిలో వున్నాయి."

"చినబాబుగారుంటారేమో!"

"వుంటే ఏం? రారాదూ!"

వాసంతి వీణని పక్కని పెట్టి లేచింది. ఇద్దరూ మెట్లు ఎక్కేరు. వాళ్ళిద్దరూ గది లోపలికి వెళ్ళేటప్పటికి శ్రీకాంత్ సోఫాలో కూర్చొని వున్నాడు. వాసంతి చేతిలోని బొమ్మనిచూసి చిన్నగా నవ్వుతూ "వాసంతీ, ఎలా వుంది బొమ్మ?' అంటూ ప్రశ్నించేడు.

"బాగానే వుంది. గానీ...."

"కానీ—ఏమిటి?"

"మనదేశం బొమ్మయితే బాగుండేది....ఈ జపాను బొమ్మకి నా తెలుగు భాష అర్థం అవుతుందో అవదో?!" అంటూ ఫక్కున నవ్వింది. రేణూ శ్రీకాంత్‌లుకూడా ఆ మాటకి ఆమెతోపాటు నవ్వేరు.

రేణు తనకోసం కొన్ని జాకెట్టు బట్టలూ చీరలూ తెచ్చుకుంది. మంచి రంగుల్లో చూడ చక్కగా వున్నాయి బట్టలు. "ఎలా వున్నాయి?' అన్నట్టు వాసంతికేసి చూసింది రేణు. ఓ చీర వాసంతి భుజాలమీద వేసి—ఒక్క క్షణంపాటు దీక్షగా చూసి....అచ్చంగా పెళ్ళికూతుర్లా వుంటావు ఈ చీర కట్టుకుంటే....' అంది.

వాసంతి సిగ్గుతో ముఖం పక్కకి తిప్పింది.

"ఇవేమిటి?"

"అవా, రాఖీలు."

"అవెందుకు?"

"చీరలు కొనుక్కొని వస్తుంటే—ఇవి అమ్మే షాపు వచ్చింది. మేం బొంబాయిలో వుండేవాళ్ళంగా....ప్రతి ఏడాదీ రాఖీలు కొనడం నాకు అలవాటు. ఎందుకేనా

మంచిదని రెండు రాఖీలు తెచ్చేను....''

''చెల్లెళ్ళు తమ అన్నల చేతికివి కడ్తారు. ఆ అన్నయ్య తనకి తోచిన బహుమతి చెల్లెలికిస్తాడు. ఇది ఒక ఆనవాయితీ.... నువ్వొకటి తీసుకో— ' అంది రేణు.

'నేనా—నా కెందుకు?''

' ఎందుకేమిటి? ఎవరి చేతికైనా కట్టు!'' అంటూ రేణు హఠాత్తుగా ఆగి పోయింది. వాసంతి కనుకొలకుల్లో నీటిబిందువులు ముత్యాల్లా మెరుస్తున్నాయి. ''అయ్యో ...అన్నయ్య గుర్తుకొచ్చేడా....ప్చ్....'' అంది అని చూసి, పరిస్థితి అర్థం చేసుకోడానికి శ్రీకాంత్‌కి ఎంతోసేపు పట్టలేదు. వెంటనే లేచి ఓ రాఖీని చేతికిస్తూ ''తీసుకో వసూ, నీ అన్నయ్యకి కడ్డువుగాని....'' అన్నాడు.

వాసంతి తల ఎత్తి కంపిస్తూన్న చేతుల్తో రాఖీని అందుకుంది. మారు మాటాడకుండా తడబడి అడుగుల్తో తన గది వేపు నడిచింది.

''ఎంతపని చేశావు రేణూ?'' అన్నాడు శ్రీకాంత్ విచారంగా, వాసంతి వెళ్ళిన దిక్కే చూస్తూ.

''ఇంత బేల అనుకోలేదు....'' అంటూ ఏమో చెప్పబోయింది రేణు. ఎర్రటి కళ్ళతో భార్యని చూస్తూ వద్దని వారించేడు శ్రీకాంత్.

*   *

''వాసంతీ, మీ అన్నయ్య ఈ జలపాతంలోనే పోయేడంటారు, నిజమేనా?''

''అవును వదినా!''

'ఇక్కడ ఈ సరస్సు లోతుగా వుంటుందా?''

ఏమో వదినా....అన్నయ్య శరీరం కూడా దొరకలేదు. '

''వాసంతీ, మీ అన్నయ్య ఈ సరస్సులో మునిగి, జలపాతంలో కొట్టుకుపోవడానికి—ఇంకెవరి అదృశ్యహస్తమైనా కారణమేమో!''

వాసంతి నిర్వికారంగా నవ్వింది. ''అది అసంభవం వదినా ' అంది. కాస్సేపు మౌనం.

''వాసంతీ! నాలో ఒక సందేహం చాలా కాలంగా కొట్టుమిట్టాడుతోంది అడగనా?''

''అడుగు.''

''ఒద్దు బాబూ. లేదా అడిగేక—ఏమిటే వదిన యిల్లా మాట్లాడ్తుంది—అని నన్ను తిట్టుకుంటావేమో!''

''అబ్బే. లేదొదినా!''

"తప్పుగా భావించవు గదః"

"ఉఁహూ."

"నే నింతకుముందు ఏమనుకున్నానంటే—నువ్వూ చినబాబూ ఒకర్నొకరు ప్రేమించుకున్నారేమోనని?"

వాసంతి ఒక్క నిమిషంపాటు రేణూ కళ్ళల్లోకి మౌనంగా చూసింది. తర్వాత మెల్లిగా "నిజమే, ఒదినా?" అంది.

"నిజమేనా?"

'నిజమే...గాని నువ్వు అనుకుంటూన్న ప్రేమ కాదది. అందులో కేవలం అపేక్ష, అభిమానం, నిస్వార్థం, తప్ప యింకేదీ లేదు."

"ఆయన కూడానా?"

'ఏమో చినబాబు సంగతి నాకు తెలీదు."

రేణూ చప్పుడు చేస్తోన్న జలపాతం కేసి నిర్నిమేషంగా చూస్తూ వుండిపోయింది. బరువుగా కొన్ని నిమషాలు దొర్లినై. "వాసంతీ" అంటూ ఆమె భుజంమీద చెయ్యి వేసింది రేణు. "నాదొక ప్రార్థన. మన్నిస్తావా?" అంది.

' ఏమిటది వదినా?

"రాఖీని చినబాబు చేతికి కట్టకు. ఈ సంగతి ఎవరికీ చెప్పకు. ఏం?"

' ఏం?"

"ఎంచేతో నా కలా అనిపించింది. బలవంతంగా నీ యిష్టానికి విరుద్ధంగా నీ చేత రాఖీ యెందుకు కట్టించడం? ఉఁహూఁ ..అదికాదు...." అంటూ మాటలు దొరక్క ఆగిపోయింది రేణుక. మళ్ళీ అంతలోనే—"అఁ....ఓ పని చెయ్యి వాసంతీ—అతన్ని అన్నయ్యగా ప్రేమిస్తున్నట్లయితే—కట్టు? నాకేం అభ్యంతరం లేదు. మానేసినా ఫర్వాలేదు...."

"నీ మాటలు నాకేమీ అర్థం కావటంలేదు వదినా?"

"తర్వాత చెప్తాలే. పద. పోదాం?" అంటూ వాసంతి చెయ్యి పుచ్చుకుని కారు వేపు నడిచింది రేణు.

# 7

అతి వైభవంగా వాసంతి వివాహం శేఖర్‌తో జరిగింది.

శ్రీకాంత్ శేఖర్‌లు అనుకోకుండా హఠాత్తుగా ఒక హోటల్లో కలుసుకున్నారు. ఒకే వూరని తెలియగానే—ఒకరి గురించి ఒకరు ఆరాలుతీసి దగ్గరివాళ్ళమేనని



తెలుసుకున్నారు. శ్రీకాంత్‌కీ అన్నపూర్ణమ్మకీ కూడా వాసంతీ శేఖర్‌లూ ఈడూ జోడూగా వుంటారన్న యోచన కలిగింది. వెంటనే మిత్రుడిని కదిపి వివాహానికి ప్రసన్నుడిగా చేశాడు.

శేఖర్ తండ్రి చాలాకాలం కిందటే ఆఫ్రికా వెళ్ళిపోయాడు. అక్కడ అతనికి చక్కటి వ్యాపారం వుంది. శేఖర్ చదువు సంధ్యలన్నీ భారత దేశంలోనే జరిగేయి. పెళ్ళికి శేఖర్ తండ్రి ఎంచేతో ఆఫ్రికానుంచి రాలేకపోయాడు.

ఆ రోజు వాసంతి భవంతిని శాశ్వతంగా విడిచిపెట్టే రోజు. భవంతికి ఎదురుగా వున్న పూలతోటని చూస్తూ వుంటే, వాసంతికి విపరీతంగా దుఃఖం పెల్లుబకసాగింది. అప్పగింతలు అయ్యేయి. అన్నపూర్ణమ్మకి దుఃఖంతో గొంతు పూడుకొని పోయింది. శ్రీకాంత్ సంగతి సరేసరి. మౌనంగా నిలబడివున్న వాసంతిని చూశాడు శ్రీకాంత్.

"వాసంతీ, ఏం కావాలి నీకు? ఇవేళ నీ స్వంత యింటికి వెళ్ళిపోతున్నావు. ఈ వూరే అనుకో....నీకేంకావాలో చెప్తే...." అన్నాడు.

"ఇస్తారా" అంది వాసంతి మెల్లిగా.

"అదేగా నా కోరిక."

'నాకు వీణ కావాలి...."

"అంతేనా? ఏం చేస్తావు దాంతో?"

"ఎప్పుడేనా ఏకాంతంలో వాయించుకుంటాను...."

"పిచ్చిదానా. ఈ నిర్జీవతంత్రుల్లో ఏముందని? చక్కటి చెలికాడు పక్కని వుండగా—నీకీ వీణ యెందుకు?"

"మీరేం చేస్తారు దాన్ని?"

"ఎప్పుడేనా నువ్వు గుర్తుకొస్తే—ఆ వీణని చూసి నిన్నుచూసినట్టే—సంతృప్తి పడతాను....'

అంతే. వాసంతి మారుమాట్లాడలేదు....వాసంతీ, శేఖర్లు అందరి దగ్గరా శలవు పుచ్చుకున్నారు. ఇద్దరూ కార్లో కూర్చోగానే కారు కదిలింది.

మర్నాటి ఉదయం శ్రీకాంత్‌కి ఏమీ తోచలేదు. వాసంతి యింటికి వెళ్ళవద్దామా అని అడిగేడు భార్యని. ఆమె సరేననగానే ఉదయం తొమ్మిదిగంటల ప్రాంతంలో కారేసుకుని భార్యాభర్తలిద్దరూ బయల్దేరేరు.

ఇద్దర్నీ చూడగానే వాసంతి ముఖం చేటంత అయింది. రేణు దగ్గరికి నడుస్తూ "నన్ను మర్చిపోలేదన్నమాట!" ఏళ్ళ తర్వాత మళ్ళీ వాసంతిని చూసినట్టనిపించింది శ్రీకాంత్‌కి.

"శేఖర్‌బాబేడీ?" అన్నాడు.

"పొద్దున్నే ఏదో పనుందన్చెప్పి వెళ్ళిపోయేరు...."

"ఎప్పుడొస్తారట? '

"ఇప్పుడే వచ్చేస్తానని వెళ్ళేరు.'

"అవునుగానీ వాసంతీ, ఎలా వుంది?"

"ఏమిటి?'

" మిటా? కొత్త పెళ్ళికొడుకుగారూ....ఈ కొత్త యిల్లూ ఇదంతా—?"

"ఒక్క రోజులో అన్నీ ఎలా తెలుస్తాయి? ఇంకొన్నాళ్లు ఓపిక పట్టు వదినా.... చెప్తాను."

"రేణూ" అంటూ శ్రీకాంత్ లేచినిలబడ్డాడు. "మీరిద్దరూ తయారుగా వుండండి,



బహుశః శేఖర్‌బాబు వస్తూనేవుంటాడు. నే నలా ఓ ఫ్రెండుని చూసి యిప్పుడే వచ్చేస్తాను.' అని బైటికి వెళ్ళిపోయేడు.

అతను వెళ్ళేక వాసంతి రేణూలిద్దరూ సోఫాలో పక్కపక్కగా కూర్చున్నారు. వాసంతి భుజంమీద చెయ్యివేస్తూ రాత్రి ఎలా గడిచింది వాసూ?'' అంది రేణూ చిలిపిగా.

ఆమె ప్రశ్న విని తత్తరపడింది. ముఖం మీదికి పేలవమైన చిరునవ్వొకటి బలవంతంగా తెచ్చుకుంది. ''చుక్కలు లెక్కపెడ్తూ....'' అంది పొడిగా.

అబద్ధం!

నిజమే, ఒదినా!''

''కిటికీలన్నీ వేసేసివున్నాయి. ఇంత పెద్ద తెరలున్నాయి. అయినా నీకు ఆకాశం యెలా కల్పించింది?''

''నీకెలా చెప్పేది వదినా ...'' అంటూ దుఃఖోద్వేగంతో రేణుకి అంటుకుపోయింది వాసంతి.

''ఏమైంది వాసంతీ, ఇప్పుడేమైంది? ఎందుకీ విచారం?''

"ఒదినా, నన్నిక్కణ్ణించి తీసుకుపో. ఈ ఏకాంతవాసం భరించలేన్నేను."

"పిచ్చిదాన్లా ఏమిటీ మాటలు? స్త్రీకి పతిగృహమే దేవాలయం....అలా ఎప్పుడూ అనకు!

ఆయనగారి మాట ఎలా వుంటుందోకూడా నాకు తెలీదు"

"ఆఁ ఆయన నీతో మాటాడనే లేదా?"

"అసలు రాత్రంతా ఆయన మేడమీదికి రానేలేదు.

మరి ఎక్కడున్నారు?"

కింది గదిలో ఎవరెవరో స్నేహితుల్తో కలిసి బ్రాందీ తాగుతూ వుండిపోయేరు....

"ఆయన తాగుతారా?"

వాసంతి కొన్ని క్షణాలపాటు మౌనంగా వుండిపోయింది ఒదినా, ఈ సంగతులేవీ చినబాబుతో చెప్పకు. చెప్పినంత మాత్రాన నా కష్టం గట్టెక్కదు. పైగా నేను దుఃఖిస్తున్నానంటే చినబాబు మరింత మనస్సు కష్టపెట్టుకుంటారు .... వదినా నన్నిక్కడినుంచి తీసుకుపోవూ?"

"వాసంతీ, నీకన్నా వయస్సులో చిన్నదాన్నో పెద్దదాన్నో చెబుతున్నా విను. తాత్కాలికమైన ఉద్రేకంతో బతుకు నాశనం చేసుకోకు. పట్టుదలతో ఈ పరిస్థితి మారేందుకు కృషి చెయ్యి. శేఖర్‌ని నీవాడిగా చేసుకో. నువ్వు తల్చుకుంటే అదేమంత పెద్ద కష్టం కాదు.

అంతలో మేడమెట్లు ఎవరో ఎక్కుతూన్న చప్పుడు విన్పించింది. హఠాత్తుగా ఆగిపోయింది రేణు.

"ఓహో ఒదినగారొచ్చారే!" అన్నాడు శేఖర్ గదిలోకి అడుగుపెడ్తూ.

"ఉదయంనుంచీ మీకోసం యెదురుచూస్తూ వున్నాం" అంది రేణు నవ్వుతూ.

"అబద్ధం!"

"కావాలంటే వాసంతిని అడగండి."

"శ్రీకాంత్ రాలేదా?"

"వచ్చారు. మీరు లేకపోవడం చూసి ఆ పక్కవీధిలో ఎవరో స్నేహితుడిని చూడ్డానికి వెళ్ళేరు. బహుశః ఈ పాటికి వచ్చేస్తూ వుంటారు."

"అలాగా?"

"మీ భోజనాలు ఇవాళ మా యింట్లోనే—బట్టలు మార్చుకొని తయారుగా వుండండి....ఆయనిప్పుడే వచ్చేస్తారు...." అంది రేణు.



భోజనాలయ్యేక వాసంతీ—శేఖర్‌లు తమ యింటికి వెళ్ళిపోగానే భవనం అంతా వెలవెలపోయినట్టు అన్పించింది శ్రీకాంత్‌కి నెమ్మదిగా మేడమీదికి వెళ్లి వీణపక్కని కూర్చున్నాడు. ఏదో ఆలోచిస్తూ నెమ్మదిగా కుడిచేతి చూపుడువేలుతో వీణ తీగల్ని మీటసాగేడు. భర్తకోసం వెదుకుతూన్న రేణుక ఈ దృశ్యం చూసి నెమ్మదిగా అతని వెనక వెళ్లి నిలబడింది, మెల్లిగా అతని భుజంమీద చెయ్యివేసింది. వీణానాదం చటుక్కున ఆగిపోయింది.

''ఓ—నువ్వా ?'

'నేనే. ఏమిటి చేస్తున్నారు ?''

''ఏం తోచటల్లేదు'' అన్నాడు శ్రీకాంత్ వీణమీంచి చేతులు తీసేస్తూ.

'ఏం తోచటంలేదని—వీణ వాయించటం రాక, తీగెల్ని ఇష్టం వచ్చినట్టు మీటితే ఏమవుతుంది? ఆ ధ్వని మీకేం ఆనందమిస్తుంది? భలేవారే! అంటూ నవ్వింది రేణు. శ్రీకాంత్‌కూడా నవ్వుతూ లేచి నిలబడ్డాడు.

'రేణూ! పోనీ నువ్వో పని చేస్తావా—వీణ వాయించడం నేర్చుకోరాదూ ?' అన్నాడు శ్రీకాంత్ ఆప్యాయంగా రేణు కళ్లల్లోకి చూస్తూ.

"వినాలని అంత కోరికగా వుంటే—వాసంతికి మళ్లీ రమ్మనమని కబురంపనా?"

"ప్చ్....వాసంతిని ఈ ఇంటినుంచి శాశ్వతంగా పంపించేశాం. ఇక ఆమె మన యిష్టం వచ్చినపుడల్లా రమ్మంటే ఎలా వస్తుంది?"

కాసేపు మౌనంగా గడిచింది.

"వాసంతి మీకు తప్ప ఇంకెవరికీ గుర్తు రాదనుకుంటున్నారా?" అంది రేణు హఠాత్తుగా.

"నీకూ జ్ఞాపకం వస్తూ వుంటుందా?"

"ఆ సంగతి మీకేం తెలుసు? మీరు పక్కనివుంటే సరేసరి. లేకపోతే వాసంతే మనస్సులో అస్తమానూ మెదుల్తూవుంటుంది."

"ఇంతలా విడిచివుండలేకపోతున్నాం కదా—ఈ వాసంతి పరాయిది కాదేమో అన్పిస్తూ వుంటుంది రేణూ...."

"పోనీ, వచ్చి కొన్నాళ్లుండమని కబురు పంపనా?"

"ఒద్దు. ఇప్పుడు వద్దు కొన్నాళ్ళు పోనీ—"

"శేఖర్‌బాబు ఏమీ అనుకోరుగా?"

"అతనేమీ అనుకోడనుకో కాని వాసంతి ఇప్పుడిక్కడికి రావడం నాకే యిష్టం లేదు."

"ఏం?"

"అతనిప్పుడు కొన్ని చికాకుల్లో వున్నాడు. ఇలాంటి సమయంలో వాసంతి అతని పక్కనే వుండటం ఎంతైనా అవసరం."

"ఏమిటండీ ఆ చికాకులు?"

"తండ్రి ఏమయినా డబ్బు పంపే ఏర్పాట్లు చేస్తాడని పాపం, శేఖర్ ఆశించేడు. ఆ డబ్బు వస్తుందనే ధైర్యంతో ఓ ఫేక్టరీ స్థాపించే ఏర్పాట్లుకూడా చెయ్యడం ప్రారంభించేడు...."

'ఏం ఫేక్టరీ?'

'పెన్నులు వుత్పత్తిచేసే ఫేక్టరీ. దాదాపు ముప్ఫయివేల పెట్టుబడి కావాలి దానికి...."

"అయితే—?"

"పదివేలు అర్జెంటుగా ఇవ్వకపోతే ఇంతకుముందు అతను చేసుకున్న ఎగ్రిమెంటు కేన్సిలయిపోతుంది. ఇంతవరకూ చేసిన ప్రయత్నమంతా బూడిదలోపోసిన పన్నీరవుతుంది. శేఖర్‌మీద తండ్రికి ఎంచేతో కోపం వున్నట్టు కనిపిస్తుంది...." అంటూ శ్రీకాంత్ ఆగిపోయేడు. కొద్దిసేపటివరకూ రేణూ శ్రీకాంత్‌ని ఆశ్చర్యంగా చూసింది.

"ఇప్పుడేమవుతుంది?'

"నువ్వలా గాభరా పడిపోతున్నావేం? నే నింకా బతికేవున్నా. ఏదో పెళ్ళి చేసి అమ్మాయినత్తారింటికి పంపేసి—అక్కడితో నా బాధ్యత అంతా తీరిపోయిందన్నట్టు చేతులు కడుక్కొని ఎలా కూర్చోనూ?"

"ఏమైందసలు?'

"అవాల్సిందే అయింది. ఫేక్టరీ స్థలానికి కావలసిన ఆ పదివేల ఎడ్వాన్స్ నేనిచ్చేను. తన మాట విననందుకు తండ్రి కోపించి డబ్బు యివ్వకపోతే మనం చూస్తూ వూరుకోలేం గదా!"

"అయితే మీరు పదివేలు...."

'అఁ. నేనే ఇచ్చేను. వాసంతికోసం ఈ పదివేలేకాదు—నా ప్రాణాలు అయినా సరే—నవ్వుతూ ఇచ్చేస్తాను....' అన్నాడు శ్రీకాంత్.

రేణు మౌనంగా తన గదివేపు నడిచింది. పదివేలు అన్న సంఖ్య వినగానే ఆమెకి కళ్ళు చీకటి కమ్మేయి. ఒంటిమీద తేళ్ళూ, జెర్రులూ పాకుతున్నట్టు అనిపించింది. ఒక మామూలు గుమాస్తా కుమార్తెకి పదివేలు ఇవ్వడం అన్నవిషయమే వూహించుకోలేక పోతూందామె. వాసంతి పేరు తల్చుకుంటూన్నకొద్దీ ఆవేశంతో ఒళ్ళు వణికిపోతూంది. విసురుగా మంచంమీద పడుకుని కళ్ళు మూసుకుంది రేణూ.

## 8

"ఏమండీ, ఏం అలా మౌనంగా వుంటున్నారు? ఎవరితో మాట్లాడరు....ఎక్కడికీ షికారుకైనా వెళ్లరు....ఏమిటి కారణం?'

'ఏం లేదే!"

"మీరేదో విషయాన్ని నానుండి దాచుతున్నారు...."

"లేదు వాసంతీ...."

'మనస్సులో ఏదైనా విచారం వున్నట్టయితే—అది బయటికి వెళ్ళగక్కితే యెంతో శాంతి లభిస్తుంది...."

"నీకు తెలీందేముంది వాసంతీ? ఆ ఫేక్టరీ గొడవే ఇంకా తెమల్లేదు. నేరకపోయి అందులో కాలుపెట్టేను....ఏ కారణం చేతైనా అడుగు వెనక్కి తీస్తే వేలకొద్దీ రూపాయిలు నష్టం!"

'మరి ఇంతకుముందు పదివేలూ...."

"అడ్వాన్సిచ్చేశాను. ఇంకా మిగతా డబ్బివ్వాలిగా. నాన్నగారు ఈసారికూడా

నన్ను అన్యాయం చేసెరు....''

'ఇప్పుడేం జరుగుతుంది....?'' ఆదుర్దాగా అడిగింది వాసంతి.

'అదే ఆలోచిస్తున్నాను. బొత్తిగా ఏమీ తోచకుండా వుంది'' అన్నాడు శ్రీకాంత్. ఒక్క క్షణం పోయేక ''ఒక ఉపాయం లేకపోలేదు'' అన్నాడు కంఠాన్ని తగ్గిస్తూ.

''ఏమిటది ?'' అంది వాసంతి. చిన్న ఆశాదీపం ఆమె కంటిపాపల్లో మెరిసింది.

''నువ్వు అవునంటే సరి—ఈ చిక్కంతా సులభంగా విడిపోతుంది''

''చెప్పండి. ఏమిటది? కావాలంటే నా ప్రాణాలైనా యిచ్చేస్తాను.''

''అంతమాటెందుకు? కొంచెం ధైర్యం వహిస్తే చాలు!''

''చెప్పండి, ఏం చేయమన్నారు?''

''నువ్వడిగితే ఇంకో పదివేలు శ్రీకాంత్ ఇవ్వకపోడు....''

''మీ రీ సంగతి ఆలోచించండి. చినబాబు దగ్గర పదివేలు తీసుకుని ఇంకా నెలైనా పూర్తిగా కాలేదు....''

''అయితే ఏం? అప్పుగా తీసుకుంటున్నాం గానీ, ఊరికే కాదుగా. కావాలంటే అందుకు వడ్డీకూడా యిస్తాం....''

''కాని, ఆపని నావల్ల కాదండీ ?''

''నాకా సంగతి తెలుసు వాసంతీ. మనస్సులోని బాధని వినడం చాలా సులభం. ఏమైనా చెయ్యాలంటే—చాలా కష్టం ?''

అబ్బే అది కాదండీ. ఇంతపెద్ద మొత్తాన్ని ఏ మొఖంపెట్టుకుని అడగనూ ?''

'కాస్త ఆలోచించు వాసంతీ, ఇది మన జీవన సమస్య. ఈ ఒక్క సమస్యా తేలితే నీకు నేను జీవితాంతం కృతజ్ఞుడినై వుంటాను....''

శేఖర్ మాటల్ని కాదన్లేకపోయింది వాసంతి. చివరికి ఆమె సరేనన్నవరకూ విడిచి పెట్టలేదతను. డ్రయివర్‌తో చెప్పి కారు సిద్ధం చేయమంది. బట్టలైనా మార్చుకోకుండా అలాగే కారెక్కింది

కదుల్తోన్న కార్లోంచి రోడ్డుమీదికి చూస్తూందే గాని వాసంతి దృష్టి అక్కడ లేదు. ఆమె మస్తిష్కంలో రకరకాల ఆలోచనలు చెలరేగ సాగేయి....తను ఓ పెద్ద ప్రశ్న కాబోతూందిప్పుడు. తన భర్త ఆర్థిక పరిస్థితి మెరుగు పర్చేందుగ్గాను ఇంకొకరి దగ్గరికి చేతులు చాచడానికై వెళ్తూంది. తను కేవలం అమ్మగారి నడిగే దనైతే బాగుండేది. అంతడబ్బు ...పదివేలు ఆమెకెక్కడివి? ఒకవేళ అంతమొత్తం ఇవ్వడానికి చినబాబు నిరాకరించిన పక్షంలో తనేముఖం పెట్టుకొని వెనక్కి తిరిగి రాగలదు? వట్టి చేతుల్తో వస్తే శేఖర్ ప్రళయకాల రుద్రుడే అవుతాడు. అంతకు




ముందు చినబాబిచ్చిన పదివేలూ శేఖర్ ఏం చేశాడో ఎంత ఆలోచించినా వూహించలేక పోతూందామె. తన కష్టాల్తో వాళ్ళ సంసారంలో కూడా నిప్పులు పోస్తూన్నది తను. ..ఇలా వారి సహాయం ఎంతకాలం అర్థించడం? ఎంచేతో ఒక్కసారి—కారు వెనక్కి తిప్పమని డ్రయివర్‌తో చెప్పబోయింది. కాని భర్త స్ఫురణకి రాగానే ఆ ప్రయత్నంనుంచి విరమించుకుంది వాసంతి.

భవంతి ముందు కారాగింది. చిన్నగా వణుకుతూన్న కాళ్ళతో కారుదిగింది. మేడ మెట్లు ఎక్కుతుంటే వాసంతికి అన్నపూర్ణమ్మ ఎదురు పడింది.

''శేఖర్ కూడా వచ్చేడా అమ్మా?'' అందామె.

''లేదు. నే నొక్కదాన్నే వచ్చానమ్మా!'' అంది వాసంతి పైటని సరిచేసుకుంటూ.

''అదేం?'' S X ఫ||

''ఏదో పనుందని వారు బయటికి వెళ్ళి పోయారమ్మా. ఒక్కదాన్నీ కూర్చోడం విసుగెత్తి ఇలా వచ్చేశాను....''

''మంచిపని చేసేవు. వుండు పూజ చేసుకుని ఇప్పుడే వచ్చేస్తాను.'' అంటూ పూజగదిలోకి వెళ్ళిపోయింది అన్నపూర్ణమ్మ.

మేడ మెట్లెక్కి శ్రీకాంత్ గదివేపు నడిచింది వాసంతి. గది గుమ్మంలో నిలబడి 'వదినా—వదినా' అని మెల్లిగా పిలిచింది.

''ఎవరూ, వాసంతేనా?'' అన్న గొంతుక విన్పించింది లోపల్నించి. మరుక్షణంలో గుమ్మం దగ్గిర నిలబడివున్నాడు శ్రీకాంత్. ''లోపలికి రా వసూ, అక్కడే నిలబడి

పోయావేం?'' అన్నాడు.

కంపిస్తున్న పాదాల్తో, భావోద్వేగంతో చెదిరిన మనస్సుతో—లోపలికి అడుగు పెట్టింది వాసంతి. మంచం మీద పడుకుని వున్న రేణూ నవ్వుతూ వాసంతికి స్వాగత మిచ్చింది.

"రా వాసంతీ, రా! ఒంటరిగా వచ్చేవా?''

"అవునొదినా....ఆయన కేదో పనివుండి బయటికి వెళ్లేరు. ఒదినని చూడా లన్పించి ఇటొచ్చేశాను....'' అంది వాసంతి చిరునవ్వుతో. ఆ తర్వాత ఏమన డానికీ మాటలు దొరకలేదు. రేణువంక చూస్తూ ఉదాసీనంగా వుండిపోయింది.

"ఏం వాసంతీ, ఇవాళ అదోలా వున్నావేం?''

"నేనా? లేదే!''

"అవును వాసంతీ, నీ ముఖంలో నిర్లిప్తత, కించిత్ విచారం నాకూ అలాగే అన్పిస్తోంది!'' అంది రేణు భర్తని సమర్థిస్తూ.

"ఉదయాన్నే—తలయినా దువ్వుకోకుండా వచ్చేశానుగా, అంచేత నీకలా అన్పి స్తూందేమో!'' అంది వాసంతి పైట చెంగుని కుడిచేతి చిటికెన వేలుకి ముడిపెడ్తూ.

"ఏమయినా పనిమీదొచ్చేవా?'' అన్నాడు శ్రీకాంత్ వెంటనే.

ఏమనాలో తోచలేదు వాసంతికి.

"శేఖర్ బాబు ఏమైనా చెప్పి పంపించేడా?'' అన్నాడు శ్రీకాంత్ మళ్లీ. అతికష్టం మీద 'ఊఁ' అనగలిగింది వాసంతి.

వాసంతి పరిస్థితిని అర్థం చేసుకున్న శ్రీకాంత్ లేచి నిలబడ్డాడు. 'ఇలారా, వాసంతీ—' అన్నాడు. ఇద్దరూ ఆ గదిలోంచి ఇవతలికి వచ్చేరు. అదే సమయంలో 'టీ'లు ట్రేలో తీసుకువచ్చింది లచ్చి. వాటిని టీపాయ్ మీద పెడ్తూ సందేహంగా రేణుని చూసింది.

"వాళ్లిద్దరూ ఎక్కడికి వెళ్ళేరు?'' అంది రేణు మెల్లిగ.

"కింద డ్రాయింగ్ రూమ్‌వేపు వెళ్లేరమ్మా?''

"వెళ్లి—ఏం జరుగుతూందో చూసిరా—జాగ్రత్త సుమా?'' అని లచ్చిని హెచ్చరించింది రేణు. నెమ్మదిగా డ్రాయింగ్ రూంవేపు నడిచింది పనిమనిషి.

"ఏమిటి వాసంతీ, అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?''

"వారు....'' ఏం చెప్పాలో—సంభాషణ ఎలా మొదలుపెట్టాలో తోచలేదు వాసంతికి.

"కానీ—వసూ! నీపట్ల అతనేమన్నా చెడుగా ప్రవర్తించాడా?''

"అబ్బే. అదేం లేదు."

"మరి....?"

"మరో పదివేలు అడిగి తెమ్మని నన్ను పంపించేరు...." ఒక్క గుక్కలో గబగబ అంది వాసంతి.

"ఎందుకుట?"

"ఆ పెన్ ఫేక్టరీ లేదూ—దానికోసం...."

"మొదట తీసుకున్న డబ్బు ఏం చేసినట్టు?"

"నాకేం తెలుసు? ఈ ఫేక్టరీ కాదుగానీ—ఇది నాకో పెద్ద సమస్య అయి కూర్చుంది"—దీనంగా అంది వాసంతి తలొంచుకుని.

"ఇలా అయితే ఎలా?"

"నేనూ అదే చెప్పేను చినబాబూ, ఇంత డబ్బు ఎవరిస్తారు?"

"డబ్బుగురించి నేనేం బాధపడటం లేదు వసూ! నాకు వేరే ఇంకొకటి అన్పిస్తోంది ..."

"ఏమిటి చినబాబూ?"

శేఖర్‌బాబు రాత్రిళ్లు తరచూ ఆలస్యంగా ఇంటికి వస్తున్నాడా?"

'లేదే!"

"ఎందుకలా గాభరా పడ్తావ్? నిజం చెప్పు భయమేముంది?"

"ఏం చెప్పను చినబాబూ, మీరన్నట్టు ఆయన 12 దాటితేగాని యింటికి రావటం లేదు...

"గట్టిగా అడగకపోయావా?"

"ఒళ్లు తెలియని నిషాలో వున్నవాళ్లని ఏం అడిగి ఏం ప్రయోజనం చినబాబూ?" తలొంచుకుంది వాసంతి.

"ఏమిటీ, శేఖర్‌బాబు తాగుతాడా?' ఆశ్చర్యంగా ప్రశ్నించేడు శ్రీకాంత్. అవునన్నట్టు తలూపింది వాసంతి.

"మరి, ఈ సంగతి నాతో ఎప్పుడూ చెప్పలేదేం?"

"ఏం చెప్పేది చినబాబూ! నేను బాధపడ్తున్నది చాలదూ? మిమ్మల్నికూడా బాధించడం యెందుకు—?"

"అంత పొద్దుపోయేక ఇంటికి వస్తున్నాడంటే—బహుశా జూదమాడుతున్నాడేమో....ఇంతకుముందు డబ్బు ఇందులోనే ఖర్చయిందేమో...."

"అబ్బే. ఆయనలాంటివారు కాదు చినబాబూ!"

"నీకేం తెలుసు వాసంతీ?"

వాసంతి మారు మాట్లాడలేకపోయింది. దుఃఖం తెరలుతెరలుగా పొంగివచ్చి కన్నీరై కనుకొలకుల్లో ప్రవహిస్తోంది. ఒకపక్క కర్తవ్యం, ఇంకోపక్క జీవితం, కట్టిపడేసి ఆమెను వివశువుగా చేస్తున్నాయి.

"వాసంతీ ప్రేమపూర్వకంగా పిలుస్తూ ఆమె తల నిమిరాడు శ్రీకాంత్. "మరేం గాభరా పడకు. కొంచెం ఓపికపడ్తే చాలు ...నీకోసం చక్కటి పూలబాట వేశాననే మురిసిపోయేను గానీ, ఆ పూలవెనక ముళ్లుకూడా వుంటాయన్న విషయం విస్మరించేను. అయినా, ఏం ఫర్వాలేదు. ఆ ముళ్లన్నీ ఏరి నీ జీవితం సుఖమయం చేస్తాను!"

వాసంతి ఇంకా మౌనంగా ఏడుస్తూనే వుంది. ఆ కన్నీరు చూసి ఓర్వలేక పోతున్నాడు శ్రీకాంత్. 'నా మాట విను వాసంతీ, ఇక నీకు ఏ కష్టమూ రానీయ నన్నాగా! అన్నాడు చిరునవ్వుతో. పాలిపోయిన ముఖాన్ని ఎత్తి దీనంగా ఆశగా శ్రీకాంత్ కళ్లల్లోకి చూసింది వాసంతి.

శ్రీకాంత్ చెక్ బుక్ తీసి పదివేలకి చెక్కు రాశాడు. దాన్ని వాసంతి చేతికిస్తూ "చూడు వాసంతీ, పదివేల రూపాయలకి పోస్ట్‌డేటెడ్ చెక్ ఒకటిస్తున్నాను. దీన్ని నాలుగురోజులు పోయేక మార్చుకోమను." అన్నాడు.

"అలాగే" అంటూ లేచి నిలబడింది.

"ఇంటివరకూ దిగబెట్టనా నేను?"

"అక్కర్లేదు."

"అమ్మతో మాట్లాడి వెళ్ళరాదూ?"

"ఉఁహూఁ. ఇప్పుడుకాదు." అంటూ త్వరత్వరగా మేడమెట్లు దిగివాసంతి వెళ్ళి పోయింది.

"వాసంతి యేదీ?" అంది అప్పుడే అక్కడికి వచ్చిన రేణుక, భర్తని చూసి.

"అరె—కాఫీ యేనా తాగకుండా వెళ్ళిపోయిందా!!"

"అయ్యో అ సంగతే మర్చిపోయాను నేను."

"అయినా ఇంత త్వరగా వెళ్ళిపోయిందేం?"

"కాస్త అర్జెంటు పనిమీద వచ్చిందిగదూ, అందుకు!"

"ఏమిటో అంత అర్జెంటు పని?"

"తెలుసుకోవాలని అంత కుతూహలం యెందుకు నీకు?"

"కుతూహలం కాక మరేమిటి? ఆవిడ ఏదో హడావిడిగా రావటం . . మీ ఇద్దరూ




రహస్యంగా మాట్లాడుకోవటం ...ఆనక చెప్పాపెట్టకుండా ఆమెగారు ఉడాయించడం... కుతూహలంగా వుండదూ?'' అంది రేణుక తీక్షణంగా.

'వ్యవహారం అలాంటిది!''

మీ దగ్గరకి ముష్టెత్తడానికి వచ్చిందని చెప్పరాదూ?"

"రేణూ!!! ' గర్జించాడు శ్రీకాంత్.

కోపంతో ముఖం కందగడ్డ అవగా, చరచరా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

* * *

నాలుగు రోజులు గడిచేయి ..

అయిదోనాడు బేంక్‌కి వెళ్ళిన శేఖర్, లెడ్జర్ కీపర్ చెప్పిన మాట విని నిర్ఘాంతపోయాడు. పదివేల రూపాయిల చెక్ తిరిగివచ్చింది. లెడ్జర్‌కీపరిచ్చిన చెక్‌ని అక్కడికక్కడే ముక్కముక్కలుగా చింపెయ్యాలనుకున్నాడు. ఎంత మోసం?

ఈ సంగతేమిటో శ్రీకాంత్‌నే అడిగి, ముఖం మీద నాలుగూ దులిపేద్దామని నిశ్చయించుకుని, భవంతి వేపు నడిచేడు.

శ్రీకాంత్ శేఖర్ని చూస్తూనే ఆప్యాయంగా భుజంమీద చెయ్యివేసి ఆహ్వానించాడు.

ఏమిటీ తమాషా శ్రీకాంత్ బాబూ?''

' తమాషానా? అంటే....?

''ఏం తెలీనట్టు మాట్లాడుతున్నారే! మీ చెక్, కేష్ అవలేదు. నా పరువు గంగలో కలిసింది!"

' ఎలా?''

"మీ చెక్ కేష్ అవుతుందన్న ధీమాతో నే నింకొకరికి నా చెక్కు వ్రాసిచ్చేను....'

"ఎవరికి?'

"సేట్ బన్‌వారీలాల్‌కి '

''బన్వారీలాల్ అంటె—యూనివర్సల్ పెన్ కంపెనీ ప్రొప్రయిటర్ గదూ?''

"అవును. కాని....''

"సరే—మొదట యిస్తామన్న పదివేలూ అతనికిచ్చేరా?

"అప్పుడే యిచ్చేశాను!" అన్నాడు శేఖర్ నిశ్చలంగా.

"శేఖర్‌బాబూ!" అన్నాడు శ్రీకాంత్ గంభీరంగా. వాసంతి నాకెంత ప్రియమైనదో మీకు తెలుసనుకుంటాను?

" తెలుసు."

"ఆమెను మీ చేతుల్లో పెట్టానంటే మిమ్మల్ని ఎంతగా విశ్వసించేనో మీరు వూహించగలరనుకుంటాను.

''విశ్వసించి వుండొచ్చు ..."

''నా విశ్వాసాన్ని వమ్ము చేశారు.'

''మీ మాటలు నా కేమీ అర్థం కావటల్లేదు.'

"అర్థమయ్యేట్టు చెప్తా వినండి. మొదట తీసుకున్న పదివేలూ మీరు బన్‌వారీలాల్‌కి యివ్వలేదు. ఆ డబ్బు బహుశః జూదాలకీ, తాగుడుకీ పోయిందని నా అంచనా—అంతేగాదు నా నమ్మకం!''

"శ్రీకాంత్ బాబూ!"

"అవును. ఇది చూడండి....' అంటూ సొరుగులోంచి కొన్ని కాగితాలు తీసి శేఖర్‌కిచ్చాడు శ్రీకాంత్.

అవి చూస్తూనే నిర్ఘాంతపోయేడు శేఖర్. అవి యూనివర్సల్ పెన్ కంపెనీ అమ్మకానికి సంబంధించిన కాగితాలు. దాదాపు ముప్పయి వేలు చెల్లించి—ఫేక్టరీ అంతా వాసంతికి దఖలు పడేటట్లు చేశాడు శ్రీకాంత్.

" మీరు మాటతప్పేరు. కాని నేను తప్పలేదు.... అంటూ శేఖర్ చేతులు పట్టుకున్నాడు శ్రీకాంత్.

ఏం మాట్లాడాలో శేఖర్‌కి తోచలేదు.

''వెళ్ళొస్తాను.'' అంటూ వీధిగుమ్మం వేపు నడిచేడు శేఖర్.

# 9

ఆ రోజు వుదయం శేఖర్‌బాబు తండ్రి ఆఫ్రికానుంచి వచ్చాడని తెలిసింది. వెంటనే శ్రీకాంత్ వెళ్ళి ఆ రోజు సాయంత్రం భోజనానికి రమ్మని పిలిచాడు. వంట పనంతా అన్నపూర్ణమ్మ తనమీద వేసుకుంది. రేణు ఆమెకి సాయంగా వుండి అవీ ఇవీ అందించసాగింది. నౌకర్ల చేత ఇల్లంతా నీటుగా సర్దించేడు శ్రీకాంత్. ఆరున్నరకి అన్నిపనులూ ముగించుకొని అందరూ డ్రాయింగ్‌రూంలో కూర్చున్నారు. అతిథుల రాకకోసం యెదురుచూస్తూ.

భవంతి ముందు కారు ఆగ్గానే అందరూ సంభ్రమంగా లేచేరు. ముందుగా శేఖర్ తండ్రీ, ఆ వెనుక వాసంతీ-శేఖర్‌లు మేడ అరుగు ఎక్కేరు. 'రండి అంటూ వారిని ఆహ్వానించింది అన్నపూర్ణమ్మ. అందరూ సోఫాల్లో కూర్చున్నారు.

'బహుశః మీరు నన్ను మర్చిపోయేరనుకుంటాను.... అన్నాడు శేఖర్‌బాబు తండ్రి, అన్నపూర్ణమ్మను చూస్తూ.

"ఎక్కడో చూసినట్టు అన్పిస్తూంది. గాని ఎక్కడో ఏమిటో సరిగ్గా గుర్తుకి రావటం లేదు.' అంది అన్నపూర్ణమ్మ.

"మీరన్నది నిజమే. ఎప్పటి మాట! ఆ రోజులు మారిపోయేయి ...ఆ పరిస్థితులూ మారిపోయేయి....రూపురేఖల సంగతి సరేసరి!

"నాన్నా, నువు అమ్మగార్ని చూస్తూనే పోల్చగలిగేవే!'

"అవున్నాయనా, నా కింత బ్రతుకుతెరువు చూపించిన యజమానురాల్ని నేను మర్చిపోగలనా?

"అంటే....?"

"ఈనాటి మాటా అది? శ్రీకాంత్....అప్పటికి నువ్వు ఆరేళ్ళవాడివి. ఈ పూల తోటలో లాగూ అయినా వేసుకోకుండా ఆడుకునేవాడివి గాదూ....!'

"అంటే—మీకు ఇక్కడి విషయాలన్నీ బాగా తెలుసన్నమాట!'

"తెలియకపోవడమేం? ఇప్పుడిక్కడ మీ అందరి మధ్యా కూర్చొని మిమ్మల్ని చూస్తూవుంటే కాలం ఓ పాతికేళ్ళు వెనక్కి తిరిగిందా అన్పిస్తూంది ..' అంటూ డబ్బీలోంచి ముక్కుపొడుం తీసి పీల్చేడు. కాస్సేపు నిశితంగా వాసంతిని చూసి— "ఈ అమ్మాయి దివాను విశ్వనాథంగారి కూతురే గదూ?" అన్నాడు.

"అవును. నిజమే. మీకు ఆయన బాగా తెలుసా?' అంది అన్నపూర్ణమ్మ ఆశ్చర్యంతో.

''ఎందుకు తెలీదమ్మా? ఒకేచోట ఒకే ప్రభువు ఉప్పుని తిన్నాంగా. ..అన్నట్టు మీకు జగ్గూ....అదే తోటమాలి జగ్గూ గుర్తున్నాడా అమ్మా?''

''ఆ చండాలుడి పేరెత్తకండి బాబూ! ఆ పేరెత్తితేనే మహాపాపం!'

అదేమమ్మా, ఏం చేశాడతను?''

ఈ యింటిలో గల విలువైన వస్తువుల్నీ, డబ్బునీ దొంగిలించి పారిపోయేడు... మళ్లీ కనబడలేదు ...ఎంత నమ్మకంగా వుండేవాడనీ....వట్టి నమ్మకద్రోహి!'' అంది అన్నపూర్ణమ్మగారు.

సరే. పద బాబూ, మనింటికి పోదాం.' అంటూ శేఖర్‌వేపు చూస్తూ లేచి నిలబడ్డాడు.

అదేం? భోజనానికి పచ్చి—భోజనం చేయకుండా వెళ్ళిపోతారా?'' అంది అన్నపూర్ణమ్మ ఆందోళనగా.

క్షమించమ్మా, ఈ ఇంట్లో మీ సహపంక్తిని కూర్చుని భోజనంచేసే అర్హత నాకు లేదు!' అంటూ అడుగు వేయబోయేడు.

అదేమిటి బాబూ, అలా....'' అన్నాడు శ్రీకాంత్.

నిజం బాబూ! ఇలా నావేపు చూడండమ్మా. ఇప్పటికైనా 'జగ్గూని' గుర్తు పట్టగలిగేరా?' అన్నాడు.

జగ్గూ....''

'అవునమ్మా, ఆనాడు మీ తోటమాలి—జగ్గూని! ఈనాడు లక్షాధికారి జగన్నాధరావుని!! ఈ ఇంటి ధనాన్నపహరించిన చండాలుడిని నేనే!' అన్నాడు జగన్నాధరావు అన్నపూర్ణమ్మ కళ్లలోకి సూటిగా చూస్తూ.

అన్నపూర్ణమ్మ ధ్యానపూర్వకంగా జగన్నాధరావుని చూసింది. తోటమాలి జగ్గూ రూపం అస్పష్టంగా ఆమె కళ్ళముందు మెదిలింది. అప్పటికీ యిప్పటికీ కేవలం వయస్సులోనూ—బట్టల్లోనూ తప్ప ఇంకెందులోనూ తేడా లేదనిపించింది ..చిన్నగా నవ్వుతూ నిలబడి వున్నాడు జగన్నాధరావు. రేణూ, వాసంతీ, శ్రీకాంత్‌లు విస్మితంగా అతన్నే చూస్తున్నారు. శేఖర్ మాత్రం ఏదో ఆలోచిస్తూ దీక్షగా వీధిగుమ్మం వేపు చూస్తున్నాడు.

మీరేం గాభరా పడకండి అమ్మగారూ.... ఈసారి నేను మళ్ళీ దొంగిలించడానికి రాలేదు. మీ దగ్గరనుంచి నేను అపహరించిన వస్తువుల్ని మళ్ళీ మీకు తిరిగి అప్పగించడానికే వచ్చేను. ..అదుగో. ..శేఖర్‌ని జాగ్రత్తగా చూడండి....

అంటే —శేఖర్....'' మాటలు దొరక్క ఆగిపోయింది అన్నపూర్ణమ్మ.




''మీ దగ్గర్నుంచి అపహరించిన... అమూల్య రత్నం అతనే...!''

''అంటే....నా రాజా....రాజాయేనా?'' అంటూ సంభ్రమాశ్చర్యాల్తో శేఖర్ వేపు చూసింది అన్నపూర్ణమ్మ.

''అవును. మీ అబ్బాయి రాజాయే!''

అంతవరకూ మౌనంగా కూర్చొని ఈ సంభాషణ అంతా వింటున్న శేఖర్ లేచి నిలబడ్డాడు. ''ఏమిటి నాన్నా ఇది? రాజా ఏమిటి? ఈ నాటకం ఏమిటి?' అన్నాడు చిరాగ్గా.

'నాటకం కాదు బాబూ, నిజమే! అన్నపూర్ణమ్మగారు నిన్ను కన్న తల్లి....''
అన్నాడు జగన్నాధరావు.

''మీరో?''

''నేనీ ఇంటి తోటమాలిని. నువ్వు రెండేళ్ళ పసివాడిగా వున్నప్పుడు నేను నిన్నెత్తుకుని పారిపోయాను....'

''ఎంచేత?''

''పగ ప్రతీకారం నన్నాపని చేయించేయి...చెప్తా విను. ఓనాడు ఉరుముల్తో మెరుపుల్తో వర్షం కురుస్తోంది. ఏదో అర్జంటు పనిమీద నా కొడుకుని బయటికి

పంపేరు పెదబాబు. పనిమీద వెళ్ళినవాడు మరి తిరిగిరాలేదు. చనిపోయాడు. ఆ అక్కసు మనసులో పెట్టుకుని—అదే బాధ పెదబాబు కూడా అనుభవించాలన్న అభిప్రాయంతో నిన్ను తీసుకుని పారిపోయేను. ఈ సంగతి ఈ అమ్మగారికి తప్ప ఇంకెవరికీ తెలీదు." అన్నాడు జగన్నాధరావు నిర్వికారంగా శూన్యంలోకి చూస్తూ.

ఇదంతా నిజమేనా అమ్మా?" అంటూ ప్రశ్నించేడు శ్రీకాంత్.

నిజమే. శేఖర్ నా పెద్దకొడుకు!"

' మరి నేనో?'

' నువ్వాను.... అంటూ ఆందోళనగా జగన్నాధరావుని చూసిందామె.

' నిన్నామె పెంచుకున్నారు. '

' అంటే....? ' శ్రీకాంత్‌కేమీ అర్థం కాలేదు.

' నువ్వు దివాన్ విశ్వనాధంగారి పెద్దబ్బాయివి. నిన్ను వీరికి పెంపకానికి ఇచ్చేరు. ఈ సంగతి కూడా యెవరికీ తెలీదు.

' మరి ఆమె? అన్నాడు శ్రీకాంత్ వాసంతిని చూస్తూ.

స్వయానా నీ చెల్లెలు. అన్నట్టు మీ యిద్దరికీ మధ్య ఇంకో అబ్బాయి వుండాలే, అతనేడీ? అన్నాడు జగన్నాధరావు.

కంఠస్వరం తగ్గించి రాజు మరణం గురించి చెప్పింది రేణుక. శ్రీకాంత్—వాసంతి ఒకరి ముఖంలోకి ఒకరు ఆశ్చర్యంగా చూసుకున్నారు. ఆనక అన్నపూర్ణమ్మ వేపు చూశారు. ఆమె కళ్లలో అనంతమైన అభిమానం—నిలిచివుంది. కళ్ళలో ఓ మూల చెమ్మ చిప్పిలుతూవుంది.

శ్రీకాంత్‌కి పరిస్థితి అంతా అర్థమైంది. హఠాత్తుగా అన్నపూర్ణమ్మగారి పాదాలను స్పృశించాడు. కన్నీటితో ఆమెను అభిషేకించేడు. అంతలో శేఖర్ కూడా తటాలున వంగి ఆమె పాదాలను తాకేడు. ఇద్దర్నీ లేవనెత్తింది అన్నపూర్ణమ్మ. కళ్ళతోనే దగ్గరికి రమ్మని వాసంతికి సైగ చేసింది. ముగ్గుర్నీ చేతుల్తో చుట్టి కాసేపు కళ్ళు మూసుకుంది.

'శ్రీకాంత్ బాబూ.... ' అంటూ ఏదో చెప్పబోయేడు శేఖర్ ఆవేదనగా. కాని అతను నోటిని మూస్తూ ఇప్పుడేం మాట్లాడొద్దు. ఆనందంతో నా గుండె నిండిపోయింది. అన్నాడు శ్రీకాంత్.

వాసంతి మనసు ఆనందంతో మూగవోయింది.

దూరంగా తోటలో, వసంతాగమనాన్ని సూచిస్తూ కోయిల ఒకటి 'కుహూ' అంది.

—









ద్విభాష్యం రాజేశ్వరరావు ఽ శివల జగన్నాథరావు

"రేపు సాయంత్రం 312 నెం. రూమ్ లోని పేషంటును డిశ్చార్జి చేశేస్తాం! ఎల్లుండి ఉదయం వస్తే మీకు ఆ రూము ఇస్తాను అంది డాక్టరు, కళ్ళద్దాలు తీసి రుమాలుతో తుడుచుకుంటూ !

'థేంక్యూ డాక్టర్ ! ఎల్లుండి ఉదయం వస్తాను। ఈ ఎడ్వాన్సు ఉంచండి!' అంటూ యాభై రూపాయలు తీసి టేబిలు మీద ఉంచాను.

డాక్టర్ టేబిలు మీదున్న బుక్ తీసి నా పేరు, చిరునామా నోట్ చేసుకుని ఇక వెళ్ళవచ్చునన్నట్లు చూసింది.

ఆవిడకు నమస్కరించి బయటకు వచ్చాను। ఎర్రటి ఎండలో అమెరికన్

హాస్పిటల్ గోడలు తళతళలాడుతున్నాయి! మధ్య ఆవరణలో వుంచిన మేరీమాత తెల్లని పాలరాతి విగ్రహం ఎండలో మెరుస్తోంది! విగ్రహం వెనుకనున్న అరటి ఆకులు ఆర్చిలా వంగి విలాసంగా కదులుతున్నాయి.

మెట్లు దిగి కారిడార్‌లోకి వచ్చి టాక్సీలో కూర్చున్నాను. 'అలంకార్ లాడ్జికి పోనియ్!' అన్నాను.

డ్రైవరు మౌనంగా స్టార్ట్ చేసాడు! టాక్సీ మెల్లిగా కదిలి కృష్ణనగర్ రోడ్డు వైపు వెళ్తోంది!

ఆరునెలల క్రితం నుండి—నాకు ఊపిరితిత్తుల్లో అప్పుడప్పుడు నెప్పివస్తోంది మొదట్లో వారానికో మాటు వచ్చేది. తరువాత రోజులో ఏదో టైములో ఒక్కసారైనా రావటం మామూలయిపోయింది. నొప్పి ముదిరేలోగా నాన్నగారు గృహ వైద్యం చేసేరు. కషాయాలు, కాపడాలు పెట్టారు! ఏమాత్రం గుణం కన్పించలేదు! నాకు నొప్పి వచ్చినప్పుడల్లా అమ్మ బెంగ బెట్టుకొని తల్లడిల్లిపోయేది. పుట్టిన నలుగురిలోనూ మిగిలింది నేనొక్కణ్ణే! మిగిలిన వాళ్లందరూ ఏదో బాలారిష్టాలతోనే పోయేరట!

ఇక నొన్న సంగతి చెప్పనక్కర లేదు!

మాటిమాటికీ నొప్పివస్తూంటే ఒక్కోసారి చచ్చిపోతే బాగుండు ననిపించేది!

ఈ ఆరు నెలల్లోనూ మూడు నెలల పైగానే ఆఫీసుకి శలవు పెట్టేను. ఎంత మేనేజరునయినా పదేపదే శలవు పెట్టడం ఏం బాగుంటుంది? ఈ అనారోగ్యంవలన క్రింది ఉద్యోగస్థుల దృష్టిలో కూడా కొంత చులకన అయిపోయాను! ఆఫీసు మేనేజరు అంటే బాధ్యతతో కూడిన ఉద్యోగం. బాధ్యతని సక్రమంగా నిర్వర్తించక పోతే పదవిలో వుండి ప్రయోజనం లేదన్నది నా పాలసీ.

నొప్పివచ్చినపుడు ఏదో మందు వెయ్యటం, తాత్కాలికంగా తగ్గి మళ్ళీ రావటం! ఇలా వూరుకుంటే లాభంలేదు. ఒకసారి విశాఖపట్నం వెళ్ళి మాధవరావు గార్కి చూపించుకుని రాకూడదూ! అన్నారు నాన్న!

ఆయన పోరు పడలేక విశాఖపట్నం వచ్చేను! నాన్నకూడా నాతో బయల్దేర బోయేరు గాని నేనే వద్దన్నాను. ఆయనది పెద్ద వయస్సు, అదీగాక 'డయాబిటీసు, బ్లెడ్‌ప్రెషరు, ఆయాసం వస్తే మనిషి కారు! అమ్మ ఎట్లాగూ ఆయన్ని కని పెట్టుకుని వుండకపోతే జరగదు!

అమ్మ నేను బయలుదేరి వస్తుంటే కళ్ళనీళ్ళు పెట్టుకుంది. ఇరవైనాలుగేళ్లు వచ్చినా అమ్మ కంటికి నేను ఇంకా పసిపాపలాగే కనిపిస్తాను కాబోలు!

ఏమిటో ఈ జీవితాలు!

లేనివాడికి లేని బాధ, ఉన్నవాడికి మరో బాధ! లంకంత ఇల్లు, బోలెడంత ఆస్తి, ఆర్థికంగా ఏ ఇబ్బందులూ లేవు, లేనిదల్లా

ఒక్కచే, ఆరోగ్యం!

డాక్టర్ మాధవరావుగారు నాన్నగార్కి స్నేహితులు. విశాఖపట్నంలో ప్రాక్టీసు చేస్తూ బాగా పేరూ, డబ్బూ గడించేరు! ఆయన్ని కలిస్తే నన్ను పరీక్షచేసి అమెరికన్ హాస్పిటల్లో జాయిన్ అయిపొమ్మన్నారు! రోజూ తనే అక్కడికి వచ్చి చూస్తానన్నారు! ఈ జబ్బుకి విశ్రాంతి చాలా అవసరమని చెప్పేరు!

ఇరవై దినాలకు సరిపడిన బట్టలు పంపించమని, నా ఆరోగ్యం గురించి బెంగపెట్టుకోవద్దనీ నాన్నగార్కి ఉత్తరం వ్రాసి పడేసాను. బ్రేక్ పడిన కుదుపుతో ఆలోచనలనుండి విడివడ్డాను. లాడ్జి అలంకార్ ముందు టాక్సీ ఆగి ఉంది! టాక్సీకి బిల్లు చెల్లించి అలంకార్‌లో ఒక రూమ్ తీసుకున్నాను, ఈ రెండు దినాలు గడపటానికి!

* *

"ఇదిగో, ఇదే మీ గది! మీకు ఏం కావాలన్నా నన్ను పిలవండి! ఈ వరండా చివర గదిలో నేను వుంటాను!" అంది నర్స్.

"థేంక్స్!" అంటూ గదిలోకి వెళ్లాను.

డబ్బుకి సంబంధించిన హాస్పిటల్ కనుక గదికి అన్ని సౌకర్యాలు ఉన్నాయి! మధ్యలో స్ప్రింగ్‌కాట్, ఫోమ్ పరుపు, పైన సీలింగ్‌ఫేను, బట్టలస్టాండ్ అన్ని హంగులతో గది బాగానేవుంది. గదిని అనుకుని మరో చిన్నగది, దానిప్రక్కనే ఎటాచడ్ లావెట్రీ, బాత్‌రూమ్! గదికి అవలివైపు తలుపు తెరిస్తే చిన్న బాల్కనీ! బాల్కనీలో నిలబడితే ఉరకలు వేస్తున్న సముద్రం ఎదురుగా కనిపిస్తూంది! దిక్చక్రం దగ్గర నలుసుల్లా రెండు ఓడలు! కుడిప్రక్కగా లైట్‌హౌస్‌కొండ! సముద్రపు ఒడ్డున ఎత్తులో యూనివర్శిటీ లేడీస్‌హాస్టలు! ఇంకేవో రెండు పచ్చని భవంతులు! అక్కడ నిలబడి చూస్తుంటే ఆ దృశ్యం ఎంతో మనోహరంగా అనిపించింది! చల్లని ఆ వాతావరణానికి సగం రోగం తగ్గినట్లనిపించింది!

బ్యాగులోని ఫ్లాస్కు, రెండు జతల బట్టలు తీసి అలమారులో సర్దాను! మాగజైన్లు తీసి టేబిలుమీద పడేశాను! తలుపు దగ్గరగావేసి, మంచంమీద వాలి సిగరెట్టు తీసి ముట్టించాను!

తలుపు తెరుచుకుని నీళ్ళ కూజాతో వచ్చిన నర్స్ నావంక ఆశ్చర్యంగా చూస్తూ తలుపు దగ్గరే ఆగిపోయింది!

"ఈ హాస్పిటల్లో ఎవరూ సిగరెట్టు కాల్చకూడదు! ఈ సంగతి మీకు తెలీదా! ముందు ఆ సిగరెట్టు అవతల పారెయ్యండి! డాక్టర్ చూస్తే నా ఉద్యోగం ఊడుతుంది" అంది మందలింపుగా.

"సారీ!" అంటూ సిగరెట్టు నలిపి అవతల పడేశాను.

నీళ్లకూజా గదిలోపెట్టి "రెస్ట్ తీసుకోండి" అంటూ నర్స్ వెళ్ళిపోయింది.

హతోస్మి! అసలే కాలం గడవక పిచ్చెత్తినట్లుంది! సిగరెట్లుకూడా లేక పోతే నేను బ్రతకలేను!

టేబిలుమీద మాగజైను చేతిలోకి తీసు కున్నాను.

మధ్యాహ్నం వరకు అదిచూస్తూ గడి పాను. మధ్యాహ్నం నర్స్ భోజనం తీసుకువచ్చింది. ఈ లోగా రెండుమూడు సార్లు వచ్చి కుశల ప్రశ్నలు వేసి ధైర్యం చెప్పి వెళ్ళింది.

అసలు చిన్నతనంనుండీ నాకు హాస్పి టల్ అంటే ఒక విధమైన భయంవుంది! మృత్యువుకి చేరువవుతున్నవాళ్ళే హాస్పి టల్‌లో చేరుతారని, ఒక అపప్రథ నా మనసులో తిరుగాడుతూ ఉండేది. ఆ భయాలూ, నమ్మకాలూ చిన్నతనం నుండీ నాలో కదలాడుతూ ఉండడం వలన జబ్బు ప్రవేశించగానే నేను భయంతో పిడచ కట్టుకు పోయేను. హాస్పిటల్‌కి సాధ్య మయినంత దూరంగా ఉండి నా జబ్బు నయం చేసుకుందామనుకున్నాను. కాని— నా కోరిక నెరవేరలేదు! నేనిక్కడ—— ఇన్‌పేషెంటుగా చేరక తప్పలేదు—కాని! ఇక్కడ వాతావరణం, ట్రీట్‌మెంటు, నర్సింగూ, నాలోని భయాన్నీ, సంకోచా లనూ కొంతవరకు పారద్రోలాయి.

భోజనం ముగించి మంచంమీద కూర్చున్నాను.

తలుపు టకటకమని మెల్లిగా ఎవరో తట్టారు! నేను లేచి తలుపు తీసేందుకు వేళ్ళేలోపున తలుపుసందునుండి రెండు కవర్లు లోపల పడ్డాయి. ఆత్రంగా అవి తీసాను! రెండింటి మీద చిరునామా నాది కాదు! వి. భారతీదేవి అని వుంది! కొంచెం ఇంచుమించుగా రెండింటి మీద చిరునామాలు ఒకేలా వున్నాయి. రెండు కవర్లమీద ఫ్రమ్ ఎడ్రసులులేవు, కాని స్పష్టంగా అవి రెండూ, 312 రూమ్‌కు వచ్చినవే!

బహుశా ఈ భారతీదేవి ఇంతకు ముందు ఈ రూమ్‌లో ఉండే ఆవిడ కాబోలు!

నా ఆలోచనలకు స్వస్తిచెప్పి తలుపు తీసాను! పోస్ట్‌మెన్ అప్పుడే మేడ దిగి పోయినట్టున్నాడు. వరండామీద ఎవ్వరూ కనిపించలేదు! తిరిగి రూమ్‌లోకి వచ్చి తలుపు గడియపెట్టి మంచంమీద కూల బడ్డాను.

చేతిలో రెండు ఉత్తరాలూ కదులాడు తున్నాయి. వాటిలో ఏముందో?

పనిలేకుండా కూర్చున్న నాకు కోతికి కొబ్బరికాయ దొరికినట్లు ఈ ఉత్తరాలు దొరికేయి.

మనిషి మనసు కోతిబుద్ధికి ఏమాత్రం తీసిపోదనుకుంటా. పరాయివాళ్ళ ఉత్త రాలు చదవటం తప్పని తెలియనంత అసభ్యతకు, సంస్కారం నాలో లేవు! కాని ఈ సమయంలో ఆ ఉత్తరాల విషయం తేలుసుకోవాలన్న కౌతుకం, వుత్సుకత నన్ను అవి తెరిచేదాకా నిలవ



యున




వియ్యలేదు!

ఒక కవరు విప్పాను. ముత్యాల కోవ లాటి దస్తూరీ! తెల్లని బాండ్ పేపరుమీద నల్లని అక్షరాలు మిలమిల్లాడుతున్నాయి.

"భారతీ!

ఈ సంబోధన చూచి, "ఇంత చనువుగా రాసేది ఎవరా?' అని ఆశ్చర్య పోతున్నావు కదూ? నేను, భారతీ! కృష్ణని! నీ కృష్ణని! నీ హృదయకవాటాల్ని తెరిచి, ఒక్కమారు జ్ఞాపకాల పీడల్ని తడుముకో! మన వూరు—బాల్యంలో మనం కలిసి తిరిగిన ప్రదేశాలు—చెరువు ఒడ్డున ఆడిన ఆటలు—ఈశ్వరునిగుడి మంటపంలో కబుర్లు—ఆకాశంలో, అందాల చందమామ పొందుగోరి నువ్వు వెల్లడిచేసే ధర్మసందేహాలు—నా పరిజ్ఞానాన్ని వుపయోగించి చెప్పే జవాబులు—తిరునాళ్ళలో వేడుకలు—బాల్యం! అదో తియ్యని అనుభవం! ఆ తరువాత....వయసు మనిద్దరిపైన వేసిన కొత్త ముసుగులు! వలపుల వలలు! వాటిని తొలగించీ, తొలగించలేని అశక్తతలు—కొన్ని బంధాలు—విడదీయలేని అనుబంధాలు! .... నీకు గుర్తున్నదా? ఆ రోజు—మబ్బుపట్టి ఆకాశం మసకబారినవేళ—మీ చిన్న తమ్ముడిని తీసుకుని, పువ్వులు పట్టుకుని నువ్వు గుడికి వస్తున్నట్లు తెలిసి, నేను అక్కడ నీకోసం వేచివున్నాను. ఆవేళ—ఆకాశ నీలం పట్టుచీరెలో, ప్రకృతి అందాలన్నీ

కాలబోసుకుని ఈ రూపు ధరించివచ్చిందా? అన్నట్టున్న నిన్ను చూచి—' ఈ అసమాన సౌందర్యం ఎవరి స్వంత మౌతు దో?'' అని భయపడుతున్నానని నేను అన్నాను. నువ్వు—''భయం దేనికి? ఈ సౌందర్యం నా స్వామి సొత్తే'' అన్నావు. ''ఎవరా స్వామి ' అని నేను అడిగితే, ''నేను చెప్పను బాబూ' అని సిగ్గుల దొంతరలో మునుచుకుపోతూ పలికావు !

''భారతీ ! నీమాట — నీ వాగ్దానం ఏమయింది? నేను పై చదువుల నిమిత్తం అమెరికా వెళ్ళి, వచ్చేసరికి, నీకు వివాహం అయిపోయిందని తెలిసింది. అమెరికా వెళ్ళేముందు కూడ—నన్ను తప్ప మరొక పురుషుణ్ణి నీ జీవితంలోకి ఆహ్వానించనని చేసిన ప్రమాణం ఏమైంది?— ఈ వార్త తెలిసి హతాశుణ్ణి అయ్యాను.

ఆలోచనల్తో మెదడు బద్దలవుతూంటే, తిండికీ, నిద్రకూ దూరమై పరితాపంతో ఒకవంక, నీమీది ఆగ్రహంతో ఒకవంక, దహించుకుపోతూ రెండు దినాలు గడిపాను.... భారతీ! కాని, ఇప్పుడు.... ఇప్పుడు నాకు నీమీద ఆగ్రహం లేదు. భారతీ, కేవలం నిన్ను చూడాలన్న ఆకాంక్ష తప్ప ! ఒక్కమారు నీ విగ్రహాన్ని దర్శించుకుని వెళ్ళిపోతాను. ఆఖరుసారిగా చూసిన నీ ఆకారాన్ని నా హృదయంలో ప్రతిష్టించుకుని, శేషజీవితాన్ని తృప్తితో పింపుకోటానికి ప్రయత్నిస్తాను.

ఈ మధ్య నీ శరీరంలో అస్వస్థత ఏర్పడిందని, విశాఖపట్నంలో హాస్పటల్లో వున్నావని వివరాలు తెలుసుకున్నాను. అడ్రసు కనుక్కుని వుత్తరం రాస్తున్నాను. వస్తున్నాను, భారతీ ! రేపే వస్తున్నాను. నీ భర్త హాస్పిటల్లో నీవద్ద లేరని తెలిసి, ధైర్యంగా ఈ లేఖ వ్రాస్తున్నాను.

—నీ (వాడు కాలేని) కృష్ణ.''

ఉత్తరం మడిచాను.

నా మనసంతా వికారం పేరుకుపోయింది. సహజంగా నా గుండె ప్రతి చిన్న విషయానికి స్పందిస్తుంది. ఏ వుద్రేకం పుట్టించినా, నేను విపరీతంగా తల్లడిల్లిపోతాను. ఒక కథ చదివితే నే చాలాసేపు ఆ కథగురించి ఆలోచిస్తూ వుండిపోతాను. అట్లాంటిది ...ఇది — ఈ వుత్తరం నాతో చాలా సంరంభాన్ని లేపింది. ''భారతిలాంటి ఆడవాళ్ళు వుంటారా ? ' అని చకితుణ్ణి అయ్యాను. ''భారతీదేవి కృష్ణపట్ల ఎంత నిర్దయగా ప్రవర్తించింది!'' అని బాధపడ్డాను. కృష్ణకి జరిగిన అన్యాయానికి విచారించాను. కృష్ణని తల్చుకుంటే జాలి, సానుభూతి వెల్లువయి వుబుకుతున్నాయి. భారతీదేవి ఎదురుగావుంటే — ''నిన్ను ప్రాణప్రదంగా ప్రేమించే కృష్ణని ఎట్లా వదులుకున్నావు ? అతను అమెరికానించి వచ్చేవరకు ఆగలేకపోయావా ?'' అని నిలదీసి అడుగుదామనిపించింది. ఏదీ? భారతీదేవి?

నిన్ననే వెళ్ళిపోయింది! కృష్ణ రాసిన ఉత్తరంలో తేదీ చూసాను. 16 వ తేదీన వస్తున్నానని రాసాడు. అంటే ఇవాళ వస్తాడన్నమాట! కల్సుకోలేక పోయినందుకు విచారిస్తూ వెళ్ళిపోతాడు!! ప్చ్!

రెండవ వుత్తరం తీసాను.

అది భారతీదేవి భర్త రాసినది. పూర్తిగా సంసారపక్షంగా నడిచింది వ్రాత.

"భారతికి,

నేను కులాసాగా వున్నట్లు తలుస్తాను. నిన్ను హాస్పిటల్లో చేర్చి ఇక్కడకు వచ్చిన మర్నాడే తమ్ముడివద్దనుండి టెలిగ్రాం వచ్చింది. నాన్నకి సీరియస్‌గా వుందని, తక్షణం రమ్మనమని! వెంటనే అక్కడకు వెళ్లాను. ఇప్పుడు కొంచెం జ్వరం తగ్గింది. నేను అక్కడకు మూడు రోజుల్లో వస్తున్నాను. అప్పటికి నీ ఆరోగ్యం బాగవుతే, త్వరగా డిశ్చార్జి చేయించుకొని వెళ్ళిపోవచ్చు.

అమ్మ, తమ్ముళ్ళు, చెల్లాయిలు అంతా ఇక్కడ కులాసాగా ఉన్నారు.

అమ్మ నా వెంట వస్తానంటూంది. నీకు వంట్లో బాగులేదని, హాస్పిటల్లో వున్నావని తెలిసి ఆవిడ పడిన ఆందోళన ఇంతింతకాదు. నిన్ను తీసుకుని మన వూరు వెళ్ళేముందు మా వాళ్ళింటికి వెళ్ళి అక్కడ రెండురోజులు అయినా వుంచక పోతే వాళ్లు వూరుకునేట్టు లేరు. ఆ ప్రకారం చేద్దాం!

ఇంతకంటె రాయాల్సినవేం లేవు. వుంటాను.

—శ్రీధరరావు."

నివ్వెరపోయాను. భారతీదేవి భర్త ఈ ఉత్తరంలో మూడురోజుల్లో ఇక్కడికి వస్తున్నట్టు రాసేడు. వుత్తరంలో నాలుగు రోజుల క్రిందటి తేదీ వేసి వుంది. అంటే నిన్ననే శ్రీధర్‌రావు వచ్చి భార్యని తీసుకువెళ్లిపోయాడన్నమాట! ఈ ఈ ఉత్తరం ఈ రోజున ఇక్కడికి చేరింది! మైగాడ్! పోస్టల్ డిపార్ట్‌మెంటిని తల్చుకుంటే కోపం, నవ్వూ రెండూ.... వచ్చాయి!

కృష్ణ ఎంత ఆత్రంగా వస్తాడో! భారతీదేవి డిశ్చార్జి అయి భర్తతో కలిసి వెళ్లిపోయిందని తెల్సి చాలా విచారిస్తాడు. కృష్ణని తల్చుకుని మరోమారు నిట్టూర్చాను. భారతీదేవి వెళ్ళిపోయిన తర్వాత కృష్ణ రాసిన ఉత్తరం రావటం వలన అతను వస్తున్నట్లు ఆమెకు తెలియదు. ఈ వుత్తరం ముందుగా రాకపోవటాన కృష్ణ భారతీదేవి దర్శనం చేసుకునే అవకాశం తప్పిపోయింది! అతడు దురదృష్టవంతుడు.

కృష్ణవస్తున్నట్టు తెలిస్తేమట్టుకు భారతీదేవి అతను వచ్చేవరకు నిరీక్షిస్తుందా? ఉహు, నాకు నమ్మకంలేదు. ఆడది పెళ్లయిన వరకు ఒక రకపు మనస్థత్వంతో వుంటుంది. పెళ్లి అయ్యాక మరొక రకంగా మారిపోతుంది. కన్యగా వుండే

వరకు ఏ పురుషుణ్ణయినా, ఎంత ఘాటుగా నయినా ప్రేమించవచ్చు. వివాహం అయిన మరుక్షణం తన మనసు, తనువు, కలలు, కోరికలు సర్వం భర్త సన్నిధిని అర్పిస్తుంది. భర్త సమక్షంలో దేవుడుకూడా పరిత్యజింపదగిన వాడిగానే తోస్తాడు.

నాకు మళ్ళీ ఊపిరితిత్తుల్లో కొంచెం నొప్పి ప్రారంభమయింది. ఒక చేత్తో కడుపు పట్టుకుని, మరోచేత్తో ఆ కవర్లు పట్టుకుని కూచుండిపోయాను. నిజానికి నాకూ, ఈ భాగోతానికీ ఏమీ సంబంధం లేదు! కాని, ఎంత చిన్న విషయమైనా ఉద్రేకం కలిగిస్తే అంత త్వరగా దాన్ని విడిచిపెట్టి, మరిచిపోలేను! ఈ వుత్తరాల కథమీద నా వుత్సుకత ఇంకా తగ్గలేదు, ఈ భారతీదేవిపైన నా కోపం ఇంకా తరగలేదు.

నర్సుని పిల్చి ఆ వుత్తరాలు ఇచ్చెయ్యా లనుకున్నాను! నా కెందుకు అవి? వాటితో సంబంధం వున్న ఇద్దరు వ్యక్తులు లేనే లేరు. మూడోవ్యక్తి రాబోతున్నా—అత నికీ వుత్తరం చూపించి అతనిలో విషాదాన్ని నాకళ్ళతో నేనింకా చూడలేను.

నర్సుని పిల్చి, ఉత్తరాల సంగతిచెప్పి "భారతీదేవి అనే ఆమె ఈ గదిలో వుండేవారా?" అని యథాలాపంగా ప్రశ్నించాను.

నర్సు ముఖంలో మార్పు వచ్చింది. నిట్టూర్చింది!

నేను మామూలుగా నవ్వుతూ "చూడండి...." అని ఏదో చెబుతున్నాను.

నర్సు గబగబా "మీకు తెలియదా, ఈ విషయం? భారతీదేవి పోయారు" అంది.

నాకేం బోధపడలేదు. నోరు తెరిచి చూసాను.

"నిన్న ఈ రూమ్‌లోనే చనిపోయారు. ఆవిడ....ఓహ్! మీరు ఇవాళ కదూ, వచ్చారు. మీకు తెలీదు! ఔను!" అంది నర్సు.

"చాలా మంచావిడండీ, పాపం.... ఈ మంచం మీదనే కూచుని నాతో ఎన్ని కబుర్లు చెప్పేవారో! చాలా సరదాగా మాట్లాడేవారు కాని అంతరంగంలో ఏదో దిగులుతో వున్నట్లు మాత్రం ఆవిడ తీరుచూస్తే నాకు అనిపించేది. అరె! అదేం! మీరలా అయిపోయారేవిటీ! నొప్పివస్తోందా? అన్నట్టు — ఇంజక్షన్ ఇవ్వాలి కదూ? సిరెంజి తెస్తాను. పడుకోండి. తిరగకండి. బలహీనంగా వున్నారు...." అంటూ వెళ్ళిపోయింది.

భారతీదేవి చనిపోయింది!....చని....పోయింది....

నా చెవుల్లో నర్సుమాట సముద్రం హోరులా ధ్వనిస్తూంది!

భారతీదేవి మరణించిందన్న నగ్న సత్యం నన్ను నిలువునా కంపింపజేస్తూంది. సృష్టిలో ఈ జీవితాలు ఎంత చిత్రమైనవి!




"ఎన్ని కబుర్లు చెప్పేవారండీ. ఆవిడ, ఈ గదిలో, ఈ మంచం మీదే... ' తృళ్ళి పడ్డాను. గదిలో మంచం వేపు చూసాను. తెల్లటి నాజూకైన, ఆకర్షణీయమైన విగ్రహం పడుకుని వున్నట్టు—కన్పించింది.

ఒళ్లు జలదరించింది.

కళ్లు నులుముకుని చూసాను. మంచం మామూలుగానే వుంది. తల తిప్పాను.... ఎవరు? ఎవరక్కడ? తెల్లని వాయిలు చీరె....పిరుదులు దాటిన వాల్జడ....కిటికీ దగ్గర....వూచలు పట్టుకుని, అవతలికి చూస్తోంది?

చెమట పట్టి చొక్కా తడిపింది.

ఈ క్షణంలో—నాకు భారతీదేవి చనిపోయింది అన్న విచారంకన్నా, దిగులు కన్నా, ఆమె ప్రేతాత్మ ఈ గదిని ఆవరించుకుని వుందన్న భయమే ఎక్కువగా వుంది, అదేమిటో!!? గది నలుమూలలూ బితుకూ బితుకూ చూస్తూ తలుపులికి అంటుకు వుండిపోయాను.

"ఏమండీ...." సన్నని కంఠస్వరం! నాజూగ్గా! నా వెనగ్గా!!

త్రుళ్ళిపడి వెనక్కి తిరిగాను! నర్స్! ఇంజక్షన్ చెయ్యటానికి సిరంజి పట్టుకునించుంది! "పిలిస్తే అలా తృళ్లిపడతారేమండీ? గలగల నవ్వింది. మరొకప్పుడైతే నర్స్ సౌందర్యానికి, ఆ హొయలుకి, ఆ నవ్వులోని మాధుర్యానికి కులాసా చెందేవాణ్ణేమో గాని, ఇప్పుడు కేవలం భయం ఒంట్లో స్వైరవిహారం చేస్తూ మిగతావాటికి చోటివ్వటం లేదు.

ఇంజక్షన్ చేసి వెళ్లిపోతున్న నర్స్‌ని పిలిచాను.

"సిస్టర్! చూడండి....మరో రూం ఏదైనా ఖాళీగా ఉందేమో, చూసి చెప్పండి" అన్నాను.

ఆమె ఏదో చెప్పబోతూంటే అడ్డు పడుతూ, "నా కీ రూం సౌకర్యంగాలేదు. దయచేసి మరో రూంలోకి మారేలా ఏర్పాటు చెయ్యండి" అన్నాను.

'ఊ....అలాగే....చూస్తాము" అని నర్స్ వెళ్ళిపోయింది.

"లాభం లేదు! నర్స్ నా మాటలు సీరియస్‌గా తీసుకోటం లేదు! డాక్టరుతో చెప్పి రూం మార్పించుకోవాలి!' అనుకొని తలుపు గడియపెట్టి మెట్లు దిగి తిన్నగా ఆఫీస్‌రూంకి వెళ్ళేను!

"మూడువందల పన్నెండో నెంబరు రూము, భారతీదేవి అనే ఆవిడ వుంటోంది. ఆ రూము ఎక్కడ వుందో చెప్తావా?' అని అడుగుతున్నాడు అక్కడున్న బంట్రోతుని ఎవరో!

గబగబా దగ్గరకెళ్ళాను.

అతడు తెల్లగా, పొడుగ్గా, పల్చగ వున్నాడు. కళ్ళలో విజ్ఞానం, శరీరంలో ఆరోగ్యం, వేషధారణలో ఆడంబరం ప్రస్ఫుటమవుతున్నాయి. ఖరీదయినవిగా కన్పిస్తున్న కళ్ళద్దాలు తీసి తెల్లని చేతి రుమాలుతో తుడిచి మళ్ళీ పెట్టుకున్నాడు. ఇంతలో నాకు ఇంజక్షన్ చేసిన నర్స్ అక్కడికి వచ్చి, నన్ను చూసి "రెస్టు తీసుకొమ్మంటే ఇలా తిరుగుతున్నారా:" అంటూ మందలించింది.

"చూడండి నర్స్! భారతీదేవి అనే ఆమె 312 రూమ్‌లో ఉంది! ఆ రూముకి దారి చెప్తారా?" అంటూ అతను మళ్ళీ ఆ నర్స్‌ని ప్రశ్నించాడు.

అతని ముఖం అలసటను చెబుతోంది! మాటలు ఆతృతను ప్రకటిస్తున్నాయి. నా మెదడు చకచక పనిచేస్తోంది. ఇతను....ఇతను ఎవరు? ఇతడు శ్రీధరరావు మాత్రం కాడు! ఇదివరకే ఇక్కడికి వచ్చిన శ్రీధరరావు భారతీదేవి రూం గురించి కొత్తగా ఎందు కడుగుతాడు? అతనికి ఈ సరికే ఆమె మరణవార్త తెలిసివుండాలి! మరి ఇతను ఎవరు! ఇతను కృష్ణ! అవును కృష్ణే!

నా ఒళ్ళు ఝల్లుమంది. నర్స్ అంటోంది 'భారతీదేవిగారు 312 రూమ్‌లో వుండేవారండీ! కాని—ఇప్పుడు లేరు!"

"డిశ్చార్జి అయి వెళ్ళిపోయారా?" ఆత్రంగా ఆమెను అడుగుతున్నాడు.

నర్స్ "ఎలా చెప్పను?' అన్నట్లు ముఖంపెట్టి "మీరు వారికి బంధువులా?" అంది.

కృష్ణ ఊపిరి గట్టిగా పీల్చుకుని "చెప్పండి....వెళ్ళిపోయారా ఆవిడ?" అని అడిగేడు.

"సారీ! 'హార్ట్ ఎటాక్' వచ్చి నిన్ననే మరణించారు! ఆవిడ భర్త వచ్చి నిన్న సాయంకాలం శవాన్ని తీసుకుని వెళ్ళిపోయారు!" అని మాట్లాడటం ఆపి గబగబ నడిచి మేడమీదికి వెళ్ళిపోయింది నర్స్!

షాక్ తిన్నవాడిలా గోడకు జారగిలపోయాడు ఆ వ్యక్తి!




"మీరు ప్రేమించిన భారతీదేవి, మీరు సర్వస్వంగా భావించిన భారతీదేవి, మిమ్మల్ని మోసంచేసి పరలోకానికి వెళ్లిపోయింది కృష్ణగారు! మీరు హృదయం విప్పి వ్రాసిన మీ ముత్యాల్లాటి పంక్తులు, హృదయాన్ని కదిలించే అక్షరాలు నా జేబులోనే ఉన్నాయి.' అని అతనితో గట్టిగ అరిచి చెప్పాలనిపించింది. దగ్గరకు తీసుకుని అనునయించా లనిపించింది! కాని అతను నాకు అపరిచితుడు! నేనెవర్నో అతనికి తెలీదు! నాకూ అతనికీ ఏ సంబంధమూ లేదు మరి ఎలా చెప్పను? నీరసంగా అడుగులేస్తూ ఆఫీసు రూంలోకి వెళ్ళాను. నేను వెళ్ళేసరికి డాక్టరు లోపల ఇంకెవరితోనో మాట్లాడుతోంది!

నలిగిన బట్టలు, చామనచాయ. మనిషి బలంగా వున్నా, ముఖం వాడిపోయి వుంది!

"చూడండి! భారతీదేవి ఎకౌంటులో యింకా కొంత డబ్బు కట్టాలనుకుంటాను! ఎంతో చెప్తే 'పే' చేస్తాను" అంటున్నాడు.

అతని మాటలు బరువుగా వున్నాయి. మరోసారి షాక్ తిన్నట్టయ్యాను. డాక్టర్ నన్ను కూర్చోమన్నట్టు సంజ్ఞచేసి, పుస్తకం తీసి లెక్కలు కడుతోంది, నేను అతనువైపే తీక్షణంగా చూశాను: అతను శ్రీధరరావయి వుండాలి! భారతీదేవి 'ఎకౌంట్' క్లియర్ చేయటానికి వచ్చా

దన్న మాట! నాకు ఈ సంఘటలన్నీ చూస్తుంటే మతిపోయేటట్లుంది! తలను రెండు చేతులతో పట్టుకుని కుర్చీలో కూల బడ్డాను! డాక్టరు భారతీదేవి 'ఎక్కౌంటు'లో ఎంత డబ్బు కట్టాలో చెప్పింది. అతను ఆ డబ్బు కట్టేసి బరువుగా నడుస్తూ బయటకు వెళ్ళిపోయాడు!

''డాక్టర్! నేను ఆ రూమ్‌లో వుండ లేను. 'సెంటిమెంటల్'గా ఏదో భయం నన్ను వెంటాడుతోంది. దయచేసి మరో రూమ్ యివ్వగలరా?'' అన్నాను.

డాక్టర్ నాకేసి అదోలా చూసి చిన్నగా నవ్వింది.

'ఆల్‌రైట్. 309 ఖాళీ అయింది. మీ సామానులు అందులో పెట్టమని నర్స్‌కి చెప్తాను. మీరు వెళ్ళండి!''

''థేంక్యు డాక్టర్!'' అంటూ బయటకు వచ్చాను.

బయట వరండాలో శ్రీధరరావు, కృష్ణ మాట్లాడుకుంటున్నారు.

''........'' నన్ను అన్యాయం చేసి వెళ్ళిపోయింది కృష్ణా! అంతా బాగయి పోయిందని డాక్టర్లు అన్నారు! తీరా డిశ్చార్జి చేసేసాడు. ఈ గుండె జబ్బు యింతపని చేస్తుందనుకోలేదు.' శ్రీధర రావు గొంతు బొంగురు పోయింది! ఏడుపును బలవంతంగా ఆరికట్టుకుంటు న్నట్లు స్పష్టంగా తెలుస్తోంది.

కృష్ణ ఏమీ మాట్లాడలేదు

''ఆ మధ్య అమెరికా వెళ్లావని విన్నాను. ఎప్పుడొచ్చావ్?'' అన్నాడు శ్రీధరరావు కన్నీళ్లొత్తుకుంటూ!

''వారం దినాలయింది'' పొడిగా అన్నాడు కృష్ణ.

''ఇలా హాస్పిటల్‌కు వచ్చావేం?'' శ్రీధరరావు అన్నాడు.

''ఏం లేదు! ఒక స్నేహితురాలు హాస్పిటల్లోవుందంటే చూడాలని వచ్చేను! కాని ఆవిడ నిన్ననే డిశ్చార్జి అయి వెళ్ళి పోయిందట!'

''మరి నే వస్తాను! ఎప్పుడయినా కనిపిస్తూవుండు!'' అంటూ శ్రీ ధరరావు వెళ్ళిపోయాడు

కృష్ణ భారంగా అడుగులేస్తూ రామ కృష్ణా మిషన్ బీచ్‌వైపు కదిలిపోయాడు. చెరోవంకా వెళ్లిపోతున్న యిద్దర్నీ చూస్తూ. నేను మేడ ఎక్కి రూమ్‌లోకి వెళ్లాను. ఆ రూమ్‌లో ఒక్కక్షణమైనా ఉండటానికి మనస్కరించలేదు. అల మారులోని ఫ్లాస్క్, కాగితాలు తీస్తు న్నాను. ఒక వారగవున్న బైబిల్ క్రింద ఒక పుస్తకం దొరికింది. ఆత్రంగా దాన్ని తీసి విప్పాను. అది భారతి రాసుకున్న డైరీ! ఆమె జ్ఞాపకాల దొంతరలోని కొన్ని ముఖ్య ఘట్టాలను ముక్కలు ముక్కలు ముక్కలుగా త్రుంచి పదిల పరచుకున్నట్టుంది. ఆత్రంగా పేజీలు తిరగేశాను.

''బ్రతుకులెంత చిత్రమైనవి! ఒక్కొక్కళ్ళ జీవితం సాఫీగ లోటులేకుండా




సాగిపోతుంది. నాకు బ్రతుకుముళ్ళబాటే అయింది! అడుగు తీసి అడుగు వేయటమే కష్టంగావుంది! కలలు కలలుగానే మిగిలిపోతాయి కాబోలు! ఒక్క కోరికా నెరవేరదు.... '!

"....కృష్ణ విదేశాలకి వెళ్ళి ఈ వేళకి సరిగ్గా సంవత్సరమయింది! అతను తిరిగి వచ్చేంతవరకు ఈ వూహల పల్లకిని అలంకరించి నిలిపివుంచనా? అనుకున్నాను... ఆ ఆశతోనే, ఆ ధైర్యంతోనే అతనికి మాట యిచ్చాను.

"నాన్నగారు సంబంధం వెతికారు. వరుడిని పెళ్ళి చూపులికి తీసుకువస్తామని నన్ను సిద్ధంగా వుండమని చెప్పారు. కృష్ణ విషయం చెప్పాను. అతనితోకలిసి నేను అల్లుకొన్న ఆశల పందిరిని కూలదోయవద్దన్నాను. నాన్నగారు వుగ్రులయ్యారు. కృష్ణ కులం ఏమిటి? మన కులం ఏమిటని గర్జించారు. చిన్నతనంలో కలిసి తిరిగితే, ఆ చనువు, స్నేహం వేరు! వయసు పైబడి, వివాహం విషయంలో జీవితాల్ని ముడిపెట్టుకుందామనుకోవడం చాలా వెర్రి వూహ అని కొట్టి పారేసేరు, నా మాటని! ఆయనకి ఎదురు చెప్పటం నావల్ల కాకపోయింది. కృష్ణ దగ్గర్నించి వుత్తరాలు కూడా రావటం లేదు. ఏ ధైర్యంతో నాన్న నెదిరించను? ఆడదాన్ని! వంటరిగా ఎక్కడికి పారిపోను?'

'ఆయన నన్ను మనస్ఫూర్తిగా ఇష్టపడినట్టు హావభావాలే చెబుతున్నాయి! కాని చాలా విషయాల్లో ఆయనకీ నాకు ఆమడదూరంవుంది! ఆయన వ్యవహారికంగా వుంటాడు! తినటం, నిద్రిం

చటం, కోరికలు తీర్చుకోటం. అంతే! ఆ మనసులో ప్రేమ, ఆరాధన, అను రాగం ఇలాంటి రసాలికి చోటే లేదు!'

ఏ ఆడదయినా జీవితంలో ఒక్క పురుషుడినే ప్రేమించగలదేమో! నేను మాత్రం ఇంకా కృష్ణనే ఆరాధిస్తున్నాను. నా మనసులో కృష్ణకి తప్ప వేరొక పురుషుడికి స్థానంలేదు, వుండదు! మనసుని ఆయనపట్ల కేంద్రీకరించలేక, ఆయనకి మల్లే యంత్రంలా గడపలేక రెండు విధాలా ఈ ప్రాణం వాగ్లోపడిన గింజకి మల్లే గిజగిజ కొట్టుకుంటూంది భగవాన్! యీ జీవికి విముక్తి ఎప్పుడు?

ఈ మధ్య గుండెనొప్పి తరచూ వస్తూంది.........నా వైఖరికి ఆయనలో విసుగు, అసహనం మొదలయింది. ఫలితంగా పదేపదే కీచులాటలు! ప్రేమని వ్యక్తపరిచే శక్తిలేకపోయినా, తనని నేను ప్రేమించటంలేదని మాత్రం తెలుసుకున్నారు. అందుకే ఎముక ఏరి గారు. అప్పుడప్పుడు చెయ్యి చేసుకునే వారు కూడా.. శారీరకంగా, మానసికం కూడా అలిసిపోతున్నాను."

"ఇప్పటికైనా నేను ఆయన్ని ప్రేమిస్తే ఆయనలో రాక్షసత్వం తొలగుతుంది. కాని....ఆ పని నావల్ల కాదు....యింక....ఈ సంఘర్షణని నేను భరించలేను. ఎవరికీ తెలియకుండా యీ మాత్రలు నాతో తెచ్చుకున్నాను .. ఇవి ఒక్కటే నాకు శాశ్వత విశ్రాంతి, సుఖం, శాంతి యిస్తాయి''

చదవటం పూర్తయింది. మనసు మళ్ళీ బరువెక్కింది, కళ్ళనుంచి టపటప రెండు వెచ్చని నీటిబిందువులు రాలాయి. మనసును ఎవరో పిండుతున్నట్లుంది! భారంగా అడుగులేస్తూ కిటికీవద్దకు వెళ్లాను. మౌనంగా సముద్ర పొడ్డున కృష్ణ నడిచి వెళ్లిపోతున్నాడు, శూన్యంలోకి పోతున్నవాడికి మల్లే!

ఒకవైపున 'చైతన్య మందిరం' దగ్గర నిలబడి బస్సుకోసం ఎదురు చూస్తున్నాడు శ్రీధరరావు!

వారిద్దరికీ తెలియని నిజం నాకు తెలుసు! వారిద్దరికేకాదు. యీ హాస్పిటల్ స్టాఫ్‌కి కూడా యీ నిజం తెలీదు! మనసిచ్చినవాణ్ణి మనువాడలేక, మనువాడిన వాడికి మనసివ్వలేక సంఘర్షణలో నలిగి నలిగి తనను తానే ఆహుతి చేసుకుంది భారతీదేవి!

జేబులోంచి అగ్గిపెట్టె తీసి చేతిలోని డైరీకి నిప్పంటించాను.





# ప్రఖ్యాతుని భార్య

### గోపీచంద్

నా భర్త రచయిత, మంచి ప్రఖ్యాతి గడించిన వారిలో ఒకరు. అందులో ముఖ్యంగా స్త్రీల కష్టసుఖాలను బాగా అర్థంచేసుకొని, వాటి నివారణకై కృషి చేస్తున్న రచయితగా ఆయనకు మంచి పేరు వుంది. ఆయన రచనలంటే పురుషులకన్న స్త్రీలకే ఎక్కువ మక్కువ.

ఇటువంటి వ్యక్తి భార్యనైనందుకు నన్ను చూచి చాలామంది అసూయపడటం కూడా నేను ఎరుగుదును. వాళ్లకేం తెలుసు, నాబోటివాళ్ల అగచాట్లు? ఈ మధ్య వారికి పెద్ద సన్మానం జరపాలని ప్రయత్నాలు జరిగినై. వారి రచనలను గురించి, వారి ప్రతిభను గురించి ఒక 'సావెనీర్' వెయ్యాలనికూడా వారి అభిమానులు సంకల్పించారు

ఈ సందర్భంలో చాలామంది స్త్రీలు మా యింటికి వొస్తుండేవారు. వారి అలవాట్లను గురించి, అభిమానాలను గురించీ నన్ను రకరకాలుగా అడుగుతుండేవారు.

అందులో ఒకమ్మాయి "వారి భార్య అయినందుకు మీకు ఎలా వుందో చెప్పండి" అని అడిగింది.

"అసహ్యంగా వుంది, ఆముదం తాగినట్లుగా వుంది" అని చెబుదామని నోటి దాకా వచ్చింది. మెదలకుండా వూరుకున్నాను. ఊరుకున్నాను అంటే వారాయన్ని గురించి అంత గొప్పగా అనుకుంటూ వుంటే నేను ఏమి చెప్పి ఏం ప్రయోజనం? అప్పటికే ఆయన అభిమానులు చాలామంది నేను ఆయనకు తగ్గ భార్యను కాదని చెప్పుకోవటం నేను ఎరుగుదును. అలా చెప్పుకోటానికి ఆయనకూడా కొంత కారణం.

స్త్రీలలో కొంతమందికి ఆయనంటే అభిమానం అని చెప్పానుగదూ. ఆయనకు స్త్రీలతో స్నేహం చేయటం సరదా। తను వ్రాసినవి వారికి చదివి వినిపించి, వారిచేత చదివించుకొని విని సంతోషిస్తూ వుండేవారు. మొదట్లో తాము వ్రాసినవి నన్ను చదివి వినిపించమనేవారు. వినిపించేదాన్ని. కాని నాకు చాలా విసుగ్గా వుండేది.

"నువ్వు మనస్సు పెట్టి చదవటం లేదు" అనేవారు.

"ఇంకెలా?" అని అడిగేదాన్ని.

"ఆ రచనలోవున్న అందం నీవు గ్రహించినట్టు లేవు" అనేవారు; అని అందులో వున్న అందాన్ని వ్యాఖ్యానించి, వ్యాఖ్యానించి చెప్తుండేవారు.

'అర్థం అయిందా?.' అని అడిగేవారు.

ఎందుకు వచ్చిన గొడవ "అయింది" అనేదాన్ని.

"ఏమయింది—చెప్పుచూతాం" అనేవారు,

ఏమి అన్యాయం ఇది? నా కసలే ఆ రచన బాగుండేవి కాదు. పైగా చదువుతున్నంతసేపూ బాధగా వుండేది. బాధ ఎందుకంటారా? ప్రతి రచనలోనూ ఆయన వొక స్త్రీని ఆరాధించటం, పువ్వులతో పూజించటం, ఆ స్త్రీకూడా తనపట్ల ప్రేమను చూపించటం, చివరికి ఎడబాటు కలగటం, ఆమెగడపలో నిలబడి రెండు కన్నీటిబొట్లు రాల్చటం, తాను గడపమెట్లక్రింద నిలబడి మరి రెండు కన్నీటిబొట్లు రాల్చటం, జరుగుతూ వుండేది. తరువాత ఆమె నేత్రాల వర్ణనా, జడలో తురిమిన పువ్వుల వర్ణనా, శరీరం వొంపుల వర్ణనా వుంటూవుండేవి. ఇక నేను బాధపడకుండా ఎట్లా వుండేటట్లు? నేను ఆయన భార్యను, కష్టసుఖాలలో భాగస్వామిని. ఆయన సుఖంకోరి, రాత్రింబగళ్ళు కష్టపడుతున్నాను. నేనూ చదువుకున్న దాన్నే; కావాలంటే ఉద్యోగంలో జేరి హాయిగా, కాలం గడపగలిగినదాన్ని. ఆయనకోసం అన్నీ మానుకొని, ఇంటిని అంటిపెట్టుకుని వున్నదాన్ని. ఆయనకు యెక్కడ యే లోటు వస్తుందో అని వెయ్యి కన్నులతో కనిపెడుతూ, అన్ని పనులూ నేనే చేసి పెట్టేదాన్ని. ఇటువంటి నాకు, ఆయన మరొక స్త్రీని గురించి అలా తపనపడుతున్నట్లు వ్రాస్తుంటే బాధగావుండక ఏమవుతుంది?

ఒకరోజు అడిగాను—"ఎవ్వరా స్త్రీ?" అని.

ఆయన వొక్కక్షణం ఆశ్చర్యంగా చూచి, "నువ్వే అనుకోరాదూ?" అన్నారు.

నేనే అనుకోవాలట! నేను కాదని నాకు తెలుసాయె. ఇక నేను అని అనుకోవటం ఎలా? నేనే అయితే ఈ విరహం దేనికి? ఈ కన్నీటిబొట్లు దేనికి? ఎప్పుడూ ఇంట్లోనే ఆయనను కనిపెట్టుకొని వుం

టూనే వుంటినిగదా!

"ఎందుకండి ఈ అబద్ధాలు?" అన్నాను.

ఈ మాటకు ఆయన నన్ను రెండు క్షణాలు తదేక ధ్యానంతో చూశారు. ఏమీ అనలేదు. అక్కడనుంచి నెమ్మదిగా వెళ్లిపోయారు. రెండు రోజులు నాతో ఎక్కువ మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తూ వున్నట్లు వున్నారు. నాతో అబద్ధం చెప్పినందుకు నొచ్చుకుంటున్నారనీ, ఇక నాతో ఎటువంటి అబద్ధాలు చెప్పరనీ సంతోషించాను. మూడో రోజు ఆయనంత ఆయనే నన్ను మాట్లాడించి, "నీతో నిజం చెప్పటానికి వొచ్చాను ' అన్నారు.

ఒక్కసారిగా నా మనస్సు సంతోషంతో నిండిపోయింది ఏ విషయమో తెలుసుండికూడా, ఆయనచే చెప్పించుకొని వినాలని, "ఏ విషయమండీ? ' అని అడిగాను.

మొన్న నీవు అడిగిన విషయం?'

"పో నిద్దురా, ఇప్పుడెందుకు ఆ గొడవ ' అన్నాను. నిజంగా వొకరు చేసిన పనికి పశ్చాత్తాప పడుతుంటే వినటం కష్టంగా వుంటుంది. అందులో దగ్గరివాళ్ళ పశ్చాత్తాపం వినటం మరీ కష్టం. అందుకని అలా అన్నాను.

కాదు. నువ్వు వినాలి అన్నారు.

"అయితే చెప్పండి

' ఎవ్వరో వొక స్త్రీని మనస్సులో పెట్టుకొని నేను రచనలు చేస్తున్నానని నీవు అనుకోవటం అన్యాయం...."అని మొదలు పెట్టారు.

నాకు మళ్ళీ కోపం వచ్చింది. "మరి నన్ను గురించి వ్రాస్తున్నాను అంటిరిగా" అన్నాను.

"అందులో అబద్ధంలేదు. నిన్ను గురించి వ్రాస్తున్నాను ఇంకా అనేక మంది స్త్రీలను గురించి వ్రాస్తున్నాను. స్త్రీలలో వున్న అందాలనూ, సౌకుమార్యాన్నీ, వెలుగులనూ, వొకరాశిగా పోసి, ఒక దివ్యమంగళ విగ్రహాన్ని సృష్టించుకొని ఆ విగ్రహాన్ని ఆరాధిస్తున్నాను..." అన్నారు.

"కాబట్టి మీ ఆరాధనలో నేను లేనట్లేగా!"

"ఇతరులు వున్నంతవరకూ నీవూ వున్నావు."

"మీకు అనేకమంది స్నేహితురాండ్రు వున్నారు గదా, వాళ్ళతో ఈ విషయం చెప్పారా?"

"మీరు ఆరాధించేది ఎవ్వరిని—అని వారెప్పుడూ నన్ను అడగలేదు.... '

' వారు అడిగి వుండరు. నిజమే, ఎందుకంటే వారిలోని ప్రతి వొక్కరికీ, ఆ దివ్యమంగళ విగ్రహం నీవే అనే భ్రాంతిని మీరు కలిగిస్తున్నారు. ఎవ్వరికి వారు మీరు వ్రాస్తున్నది తమని గురించే అని ఉబ్బి తబ్బిబ్బు అవుతున్నారు." అన్నాను.

వారింకేదో చెప్పబోయారు. నేను విన

లేదు. ఆ రోజునుంచీ మా ఇద్దరిమధ్యా నిజంగానే పెద్ద అగడ్త ఏర్పడింది. అప్పటినుంచీ ఆయన తన స్నేహితురాండ్రతో నన్ను గురించి చెప్పటం ప్రారంభించారు. చెప్పటం అంటే నేనేదో దోషం చేసినట్లుగా కాదు. స్త్రీలపట్ల అత్యంత సానుభూతి వున్న ఆయన, స్త్రీని ఆరాధ్యదైవంగా కొలిచే ఆయన నన్నుగురించి మాత్రం పెద్ద దోషంగా యెలా చెప్పగలుగుతారు? 'ఆమె అంటే నాకు అపరిమితమైన యిష్టం. కాని ఆమె నన్ను అర్థం చేసుకోలేదు' అని మాత్రమే చెప్పేవారు: చెప్పి రెండు కన్నీటిబొట్లు రాల్చేవారు.

వారి అభిమానులకు నన్నుగురించి ఊహించటానికి అంతవరకు చాలు. నన్ను గురించి యేవేవో ఊహించటమే కాక, అందరికీ చెప్పేవారు. చివరికి వారు మా యింటికి రావటం మానివేశారు. నేను ఎక్కడన్నా కనుపించినా నన్ను పలకరించేవారు కాదు. నన్ను చూచి వారిలోనే వారు గుసగుసలాడుకునేవారు. నాకు చాలా కష్టం వేసేది. నా భర్త వాళ్ళకు స్నేహితుడా? నేను వాళ్ళకి విరోధినా? ఎందుకు?

"ఇదేమీ బాగాలేదు' అన్నాను నా భర్తతో.

'ఏది?

చెప్పాను. చెప్పి, "నేనంటే వాళ్లకి గిట్టనప్పుడు మీరు వాళ్లతో ఎందుకు స్నేహం చెయ్యాలి?" అని అడిగాను.

'స్నేహంచేస్తే తప్పేముంది?'

"నేను మీకు సరిపడని మగవాళ్ళతో స్నేహం చేస్తే మీ కెట్లా వుంటుంది చెప్పండి?' అన్నాను.

'ఎవ్వరికి వుంటే స్నేహితులు వారికి వుంటారు. అందులో తప్పేమి వుంది" అన్నారు. "నీ ఇష్టం వచ్చినవారితో నువ్వు స్నేహంగా వుండు. నిన్నెవరన్నా అడిగితే అప్పుడు అడుగు" అన్నారు.

ఆయన మాటల ధోరణిబట్టి చూస్తే ఆయనకు నేను ఇతరులతో స్నేహాలు చెయ్యాలనే ఆతురత వున్నట్లు నాకు అనిపించింది. వారికి మల్లే నేను స్నేహాలు చేస్తే ఇంట్లో సణుగుడు ఉండదని ఆయన భావించినట్లున్నారు. అప్పటికే నన సాక్షాత్తే అప్పటినుంచీ నాకు ఆయనమీద వున్న గౌరవం కాస్తాపోయింది.

ఇక ఆయన్నిగురించి యెక్కువ పట్టించుకోగూడదు—అనుకున్నాను. ఏదో వొకపని కల్పించుకొని అందులో నిమగ్నురాలనయి వుండేదాన్ని. ఆయన కూడా నా సంగతి పట్టించుకోకుండా తిరుగుతుండేవాడు. కాని ఎంత ప్రయత్నించినా నా జీవితాన్ని గురించి నేను ఆలోచించకుండా వుండలేక పోయేదాన్ని. వివాహానికి పూర్వం రోజులు జ్ఞాపకం వస్తూవుండేవి. అంతకుముందు వారి పుస్తకాలు కొన్ని నేను చదివాను. ప్రతి పుస్తకంలో వారేదో బాధపడుతున్నట్టు




కనుపించేది. తనకు అందని దేనికోసమో ఆరాటపడుతున్నట్టూ, అన్వేషిస్తున్నట్టూ కనుపించేది. ఆ పుస్తకాలు చదువుతుంటే వారిమీద నా కెంతో జాలి కలిగేది. వారి బాధను నేను నివారించగలను అనిపించేది. ఏవో మాటామాట మీద, ఆయన రచనా వైదగ్ధ్యాన్ని గురించి ఒక సమయంలో నా స్నేహితురాలు ఇంద్రతో ప్రస్తావించాను. ఈ సంగతి వారి చెవులకు ఎట్లా జేరిందో తెలియదు.

ఆ రోజునుంచీ వారు మా యింటికి వస్తుండేవారు. తెల్లవారి, మల్లి మల్లి కలువలు పట్టుకొనివచ్చి ఇచ్చి పోతుండేవారు. ఎక్కువగా మాట్లాడేవారు కాదు.

'మీ కోసం తెచ్చాను' అనేవారు 'పోసిలిపట్టండి' అని చెప్పి పోసిలినిండా పోసి పోయేవారు.

"ఎందుకే అట్లా పువ్వులు తెచ్చి పోసి పోతుంటారు" అని అడిగేది మా అక్క.

'ఏమోలేవే, ఆయనది పిచ్చిఆనందం' అనేదాన్ని.

కాని మావాళ్ళెవ్వరికీ ఆయన రాకపోకలు ఇష్టంగా వుండేవికావు. ఆ సంగతి ఆయనకు తెలుసు. అయినా రాకుండా మానుకునేవారు కాదు. వచ్చి, ఆయన ఇంతకుముందు ప్రేమించిన యువతులను గురించీ, వారికోసం తాను చేసిన త్యాగాలను గురించీ చెప్పి, చివరికి వారు తన ఆశలనన్నీ ఏ విధంగా అడియాసలను చేసిందీ చెపుతుండేవారు. ఆ సంగతులన్నీ చూస్తే నాకు చాలా జాలివేసేది. నన్ను గొప్పచేసి తన కష్టసుఖాలను చెప్పుకుంటూ ఉంటే, ఆ రోజుల్లో నాకు బాగానే వుండేది. ఆ వయస్సు అటువంటిది అనుకుంటాను.

చివరికి ఆయన తనను వివాహం

చేసుకోమని అడిగారు. మా వాళ్ళకి ఎవ్వరికి యిష్టంలేకపోయినా నేను అంగీకరించాను.

'ఏం సుఖపడదామనే?' ని అడిగింది. అక్క.

నే నేమీ సమాధానం చెప్పలేదు. చెప్పినా వాళ్ళకి అర్థంకాదని ఆ రోజుల్లో నేను అభిప్రాయపడుతూ వుండేదాన్ని.

మా వివాహం జరిగింది.

ఇవన్నీ జ్ఞాపకంవచ్చి, ఆ టికీ ఈ నాటికీ వున్న తేడా స్ఫురణకువచ్చి, కళ్ళవెంట నీళ్ళు జలజలారాలినై. జీవితం అంధకార బంధురంగా కనుపించింది. "నా కడుపున ఒక కాయకాచినా బాగుండేది" అనిపించింది. ఆ ప్రాప్తం కూడా లేదు. ఇక యిప్పుడు చేసేవి యేముంది? రోజులు జరగనీ, ఎన్నాళ్ళు జరుగుతవో అనుకొని వూరుకున్నాను.

ఒకరోజు నేను, నా చేతి మిషన్‌మీద పొరుగింటి వీధ పిల్ల లంగా కుట్టిపెట్టమని అడిగితే కుట్టిపెడుతున్నాను. వారు హఠా విడిగానే, పేరుపెట్టి పిలుస్తూ నా గదిలోకి వచ్చారు. నాకు ఆశ్చర్యంవేసింది. ఈ మధ్య వారు నన్ను పేరుపెట్టి పిలిచి ఎరుగరు. అందులో ఆ కంఠధ్వని అతి వివారకరంగా వుంది. తల పైకెత్తి చూశాను. ఏమిటది? ఆయన జుట్టు రేగి వుంది. చొక్కా చేతిమీద చిరిగివుంది. పైజామా మట్టికొట్టుకొనివుంది. క్షణంలో పదేళ్ళ వయస్సు పెరిగినట్లు కనుపించారు.

"నువ్వు నా కొక సహాయం చెయ్యాలి" అన్నారు.

"ఏమిటండీ?"

"నువ్వు రామచంద్రరావుగారిని ఎరుగుదువా—' అని ప్రారంభించారు.

ఎవ్వరు? ఈ మధ్యనే సబ్‌ఇన్‌స్పెక్టరుగా వచ్చారు'

'అవును. నేను ఇవ్వాళ, అంటే ఇంతకుముందే వారింటికి వెళ్ళాను...."

'ఎందుకు వెళ్ళారు?"

'చూద్దామని వెళ్ళాను"

'ఎవ్వరిని?'

"వారినే....'

"కాదు. వారి అమ్మాయిని చూద్దామని వెళ్ళివుంటారు ......." అన్నాను. వారి అమ్మాయిని కొద్దిరోజులకు పూర్వమే నేను ఒక మీటింగులో చూశాను.

ఈ మాటలకు "నువ్వు కూడా నన్ను అపార్థం చేసుకుంటే ఎలా చెప్పు." అని కన్నీరు పెట్టుకున్నారు వారు.

"పోనీలెండి. ఎందుకు వెళితేనేం. వెళ్ళారు. ఏం జరిగిందో చెప్పండి" అన్నాను.

"నేను వెళ్ళేటప్పటికి రామచంద్రరావుగారు వాకిట్లోకి వెళ్ళటానికి వీల్లేదని బయటకునెట్టి వేశారు ..." అన్నాడు.

రేగినజుట్టూ, చినిగినచొక్కా, మట్టికొట్టుకున్న పైజామా చూచి, వారు చెప్పిందానికంటే పెద్ద గ్రంథమే జరిగి వుంటుందని నేను ఊహించాను.

చూట్టానికి వొచ్చినవారిని నెట్టి వెయ్యటం యేమిటండి?" అన్నాను.

వారు వొక్క నిట్టూర్పు విడిచి, "నువ్వనుకున్నట్లే ఆయనా తన కూతుర్ని చూట్టానికి వొచ్చాననుకొన్నాడు.... '

ఇక మిగిలిన సంగతి ఊహించటం యే మంతకష్టం కాదు. వారు కొద్దిరోజుల నుంచి పువ్వులు పట్టుకొని వారింటికి వెళుతూ వుండి వుండాలి. వారి అమ్మాయితో కబుర్లు పెట్టుకొని వుండాలి. అది వారికి యిష్టం వుండి వుండదు, ఇంకేం? జరగ వలసింది కాస్తా జరిగి వుంటుంది,

నాకు చీదరవేసి, ''ఇప్పుడు యేం చెయ్యమంటారు నన్ను?' అని అడిగాను.

"నువ్వు వాళ్ళ యింటికి వొకసారివెళ్ళి రావాలి? '

''దేనికి?''

"ఆ సబ్ఇన్‌స్పెక్టరు తన కూతుర్ని హింసిస్తూ వుంటాడు—అతడు నన్నేం చేసినా నేను సహించగలను గాని, ఆ అమ్మాయిని నా మూలంగా కష్టపెట్టడం సహించలేను...."

"అంతవరదాకా యెందుకు వస్తుం దండీ! మీరు అమ్మాయిని చూడనేలేదు అంటిరిగదా!''

''చూశాను. వొకటి రెండుసార్లు చూశాను.''

నేనిక తరచదలచలేదు. అమాయ కత్వంవల్ల నిజంగానే ఆ అమ్మాయి చిక్కుల్లో బాధల్లో పడ్డదేమో అని అనిపించింది, చేతనైతే వారు చేసిన తప్పులను సరిదిద్దాలనిపించింది.




సరే, నేను వెళ్ళవస్తాను. వీలైతే రామచంద్రావుగారు మీ జోలికి రాకుండా చేస్తాను. అయితే మీరు నా కొక వాగ్దానం చెయ్యాలి. ' అన్నాను.

' నువ్వు ఏం చెయ్యమంటే అది చేస్తాను.

''ఇక ఇటువంటి పనులు చెయ్యనని వాగ్దానం చెయ్యండి."

'అలాగే, ' అని వాగ్దానం చేశారు.

నే నారోజు సాయంకాలం ఏదోపని మీద వెళ్ళినట్లు రామచంద్రావుగారి యింటికి వెళ్ళాను. రామచంద్రావుగారు

ఇంకా ఆఫీసునుంచి రాలేదు. వారి అమ్మాయి ముందు గదిలో కూర్చొని ఏదో చదువుకుంటూవుంది.

ఆ అమ్మాయికి పదిహేడు పదహారు ఏళ్ళుంటాయి. జీవితంలోని కృత్రిమం, మోసం ఏమాత్రం దగ్గరకు రానిచ్చిన అమ్మాయికాదు. అమాయకురాలు.

నన్నుచూచి ఆ అమ్మాయి మొదట్లో ఆశ్చర్యపడింది. నేను అవీ ఇవీ మాట్లాడి ఆ అమ్మాయి పసిగట్టకుండానే అసలు విషయంలోకి దించాను. అమ్మాయి వున్న సంగతి వున్నట్టు చెప్పివేసింది. ఏమీ కృత్రిమం లేదు. దాచుకోటానికి ప్రయత్నించలేదు. అతి సహజంగా చెప్పివేసింది,

నేను ఊహించింది నిజమే. మావారు వారంరోజుల నుంచి వారి యింటికి వెళ్ళి వస్తున్నారట, మొదట్లో ఆ అమ్మాయితో యేవేవో సాహిత్యం గొడవలు మాట్లాడే వారట, తరువాత తాను వ్రాసినవి విని పించేవారట. తరువాత తాను వ్రాసినవి చదివించుకునేవారట. మొదటినుంచి వాళ్ళ నాన్నకి ఆయన యింటికి రావటం యిష్టంగా వుండేది కాదట. రెండు మూడ్రోజులు గడిచిన తరువాత తనకి కూడా కష్టంగా ఉండేదట.

ఒకరోజు, "మీరు రావటం మా వాళ్ళకు యిష్టం లేదండీ" అని చెప్పిందట,

"మీ వాళ్ళసంగతి నా కెందుకు? నీ సంగతి చెప్పు?" అన్నారుట.

"నా సంగేతేముందండీ? మా వాళ్ళ ఇష్టాయిష్టాలనుబట్టి పోయేదాన్నే నేను" అన్నదట.

అది తప్పు. ఎవ్వరి ఇష్టప్రకారం వాళ్ళం పోవడం ధర్మం. భగవంతుడు మెచ్చుతాడు. నీవు రావొద్దంటే ఈ క్షణంనుంచి రాను. లేకపోతే నన్నెవ్వరూ ఆపలేరు' అన్నారట మా వారు.

'నాకుకూడా మీ రిలా రాకుండా వుండడమే మంచిదని అనిపిస్తూ వుందండీ అన్నదట ఆ అమ్మాయి.

ఇది నీ ఉద్దేశంకాదు, నువ్వు మీ వాళ్ళకు భయపడి ఇలా అంటున్నావు. నీ ఉద్దేశం నాకు తెలుసు అన్నారుట మా వారు.

ఇంతవరకూ చెప్పి 'నేను అంత స్పష్టంగా చెపితే, అలా అంటారేమిటి అక్కా? ఇంకా అంతకంటే యేం చెప్పను?" అని అడిగింది. 'ఇక నాకేమీ తోచక నాన్నగారికి చెప్పివేశాను' అన్నది.

ఆ అమ్మాయి మాటలకూ అమాయకత్వానికీ ఆ పరిస్థితుల్లో కూడా నాకు నవ్వు వొచ్చింది. వివాహానికి ముందు ఈ అమ్మాయికి వున్న ధైర్యం నాకు లేక పోయెనే—అని అనిపించింది. అప్రయత్నంగా కళ్ళు చెమ్మగిల్లినై.

'ఇక వారు మీ యింటికి రారులే అమ్మాయ్. మీ నాన్నగారితోకూడా నేను చెప్పానని చెప్పు?" అని చెప్పి, కానేపు

సమ్మె హండ్రెడ్ పర్సెంట్ సక్సెస్!
- డిమాండ్స్ మాత్రం పరిష్కారం కాలేదు!!




ఇమేదో లోకాభిరామాయణం మాట్లాడి యింటికి బయలుదేరాను.

ఇంటిదగ్గర మావారు నాకోసం ఎదురు చూస్తూ కూచున్నారు. నన్ను చూడగానే ఎదురుగా వచ్చి, "ఏమయింది?' అని అడిగారు.

'వాళ్ళజోలికి మీరు వెళ్ళకుండావుంటే మీ జోలికి వాళ్ళురారు అన్నాను.

'ఆ అమ్మాయి ఎలావుంది?'

'సలక్షణంగా వుంది

'ఎమన్నది?'

'తన జోలికి రావద్దన్నది

'నువ్వు పొరపాటు పడుతున్నావు. అది ఆమె అభిప్రాయంకాదు. ఆమె తండ్రి వున్నాడే—సబ్ఇన్‌స్పెక్టరు, అతనికి భయపడి అలా అన్నది. ఆమెకు నేనంటే...." అని ప్రారంభించారు.

అంతలో నా ముఖంలో వచ్చిన మార్పును గమనించినట్లున్నారు; ఆపేశారు. నాకు సంభాషణ పెంచటం ఇష్టం లేక "మీ వాగ్దానం మరచిపోకండి" అని చెప్పి యింట్లోకి వెళ్ళాను.

కాని యేం లాభం? వారు వారి పద్ధతులను మరచిపోలేదు, మార్చుకోలేదు. సబ్ఇన్‌స్పెక్టరుకి భయపడి, ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళటం అయితే మానివేశారు గాని, ఇతర పోకడలు మానలేదు.

ఒకరోజు వారు చేసిన వాగ్దానం జ్ఞాపకం చేశాను

"ఇందులో తప్పేమివుంది? మొగాళ్ళలో, ఆడవాళ్ళల్లో స్నేహితులు వున్నట్లుగానే, మొగా ఆడవాళ్ళకు స్నేహం

ఎందుకు వుండగూడదు? ఒక స్త్రీకి ఒక పురుషుడికీ, వొకరంటే వొకరికి ఇష్టం వుండవచ్చు. వారు స్నేహితులుగా వుంటారు. ఇందులో తప్పేమివుంది? ఆ మాటకివస్తే ఆంధ్రదేశంలో ఇటువంటి వుద్యమం వొకటి లేవనెత్తాలని ఆలోచిస్తున్నాను' అన్నారు.

"అప్పుడు గాని ఆంధ్రదేశంలోవున్న మకిలి ప్రక్షాళన కాదు" అని ముగించారు.

నాకు వొళ్ళు మండింది. "ఈ సిద్ధాంతం మీవరకు బాగానేవుంది. తిని నలుగురి ఆడవాళ్ళతో తిరగవచ్చు. కాని ఆ ఆడపిల్లల గతేం కావాలి" అని అడిగాను.

"వాళ్ళకేం?" అన్నారు.

"వాళ్ళల్లో పెళ్ళిఅయిన పిల్లలు వుండవచ్చు; కాని పిల్లలు వుండవచ్చు. ఏ నెపంతో మీతో తిరిగినా, పెళ్ళి అయిన పిల్లల భర్తలు ఊరుకుంటారా? పెళ్ళికాని పిల్లలకు పెళ్ళిళ్ళు అవుతాయా?" అని అడిగాను.

'ఇటువంటి స్నేహాలు నిష్కల్మష బుద్ధితో చూసే స్థితికి సంఘం రావాలి. అందుకే నేను కృషి చెయ్యదలిచాను" అన్నారు.

"సంఘం ఆ స్థితికి వస్తుందో రాదో మీకూ తెలుసు, నాకూ తెలుసు. సంఘం ఆ స్థితికి రావాలని మీరు ఎందుకు కోరుతున్నారోకూడా మీకూ తెలుసు, నాకూ తెలుసు. ఒకవేళ కారణాంతరాలచేత యెప్పటికైనా సంఘం ఆ స్థితికి రానున్నా ఈలోగా యెంతమంది అమాయకపు పిల్లల జీవితాలు బజారు కెక్కవలసి వస్తాయో ఆలోచించారా? ఎన్ని కుటుంబాల్లో చిచ్చు రేగుతుందో ఊహించారా?"

దీనికి సమాధానంగా వారు, ఒక పెద్ద పోజుపెట్టి, "ఒక ఘనకార్యం సాధించదలచినప్పుడు కొంతమంది ఆత్మార్పణం చేసుకోవలసి వుంటుంది మరి" అన్నారు.

విన్నారా! ఇదొక సిద్ధాంతమట. దీనివల్ల సంఘంలో వున్న మలినం క్షాళనం కాబోతున్నదట. ఇందుకు అమాయకపు పిల్లలు కొంతమంది ఆత్మార్పణం చేసుకోవాలట! నలుగురు ఆడవాళ్లతో, కలిసి తిరగటానికి ఎంత చక్కని మాటలు! ఆయన సంగతి పూర్తిగా తెలిసిన నాకే వొక్కొక్కప్పుడు పాపం, ఇవన్నీ నమ్మే చేస్తున్నారు కాబోలు—అని అనిపిస్తూ వుండేది. లోకాన్ని వంచన చేస్తున్నారో, తన్ను తాను వంచన చేసుకుంటున్నారో తెలిసేది కాదు. నా సంగతి ఇలావుంటే, అశుభం శుభం తెలియని అమాయకపు పిల్లల సంగతి వేరే చెప్పాలా?

ఆయనకు ఏం చెప్పి ఏం ప్రయోజనం! ఏ విషయమైనా వింటారుగాని, ఈ విషయం దేవుడు చెప్పినా వినరు. ఈ విషయంలో ఎటువంటి స్నేహితులైనా, ఎంత డబ్బయినా వొదులుకోటానికి సిద్ధమే. పైగా వొకటీ నిజం చెప్పరు. ఆయన ఒకప్పుడు చెప్పారు—"స్త్రీ శరీరం






వంషలు చూస్తే ! ఇక తరువాత ఏం చేస్తానో నాకే తెలియదు'' అని. ఆయన చెప్పిన ఏ కొద్ది నిజాలలోనో ఇదొకటి. అదొక జబ్బేమో అనిపిస్తుంది నాకు అప్పుడప్పుడూ.

అలా గడిచిపోయినై రోజులు. ఎప్పటికైనా వారికి జ్ఞానం కలుగకపోతుందా—అనే ఆశ ఈ నాటికీ। నన్ను వొదలకుండా వుంది. అటువంటి సమయంలో ఈ సన్మానం వొకటి వచ్చిపడింది. తన పనులను ఆంధ్రదేశం అంగీకరించి, ఆమోదించింది—అనే భావంతో ఈ సన్మానం సంగతి తెలిసినప్పటినుంచీ ఆయన ప్రవర్తించటం మొదలుపెట్టారు—యిక విముక్తి లేదు.

ఇంకా సన్మానం నాలుగైదురోజు లుండనగా వారు నా దగ్గరకు వచ్చి, ''సన్మానంనాడు నువ్వుకూడా మీటింగుకు రావాలి ' అన్నారు.

''నేను రాను'' అన్నాను.

''నువ్వు రాకపోతే ఎట్లా? లోకులు ఏమనుకుంటారు'' అన్నారు.

చూశారా? నేను రావాలని కాదు, నేను వచ్చి ఆయనకు జరుగుతున్న గౌరవంలో పాల్గొనాలనీ కాదు. నేను రాకపోతే లోకులు ఏమనుకుంటారో అని భయం.

''లోకులు అనుకునేది ఏముంది

లెండీ!" అన్నాను.

"లోకాన్నంతా సర్దగలుగుతాడు గాని ఇంట్లోవాళ్ళని సర్దుకోలేకపోతున్నాడు— అనుకోరూ? లోకాన్నంతా మార్చగలుగుతున్నాడు గాని ఇంట్లోవాళ్ళని మార్చలేకపోతున్నాడు అనుకోరూ! నువ్వు తప్పకుండా రావాలి" అన్నారు.

నేను సన్మానానికి వెళ్లలేదు. పైగా అక్కడే వుంటే ఎవ్వరు వచ్చి బలవంతం పెడతారో అని ఆనాడు సాయంకాలమే మా కన్నవారింటికి వెళ్ళిపోయాను.

సన్మానం అతి వైభవంగా జరిగిందట. మా తమ్ముడు వెళ్ళివచ్చి చెప్పాడు. వొస్తూ వొస్తూ, ఆయన ప్రతిభను ఉగ్గడించటానికిగాను వెలువడిన 'సోవెనీరు' వొక కాపీ పట్టుకొని వచ్చాడు. "నువ్వు రాలేదని చాలామంది అనుకున్నారు అక్కా" అన్నాడు. "ఒకరిద్దరు తమ ఉపన్యాసాలలోకూడా ఉదాహరించారు" అన్నాడు.

"ఏమన్నా రేమిటి?"

వాడు చాలాసేపు చెప్పలేదు. అడగ్గా అడగ్గా, "సోక్రటీస్ అనే వొక ప్రముఖ తత్వవేత్త వుండేవాడట; అతని భార్య మహాగయ్యాళి అట, ఎప్పుడూ భర్తను వేపుకు తింటూవుండేదట. అటువంటి భార్యలను బెస్ట్‌కేసెస్ క్రింద మేధావులైన భర్తలకోసం భగవంతుడు సృష్టిస్తూ వుంటాడట అని, అనుకున్నారు" అన్నాడు.

మిగిలింది నేను ఊహించుకోగలను. నేను గయ్యాళి భార్యనా! ఆయన లోకానికి సేవ చేస్తూవుంటే నేను సహాయం చెయ్యక పోగా అసూయాద్వేషాలతో వేధిస్తూవుంటాను! ఆయన కాబట్టి ఎంతో వోర్పుతో ఇంటిగుట్టు రచ్చకు కాకుండా నన్ను సాకుకు వస్తున్నారు! ఏమి అన్యాయం!

ఏమీ తోచక తమ్ముడు తెచ్చిన 'సోవెనీర్' తిరగవేస్తూ కూర్చున్నాను. మంత్రులు, జడ్జీలు, ప్రముఖ రచయితలు ఎంతోమంది స్త్రీలపట్ల మావారు చేసిన సేవను ప్రశంసిస్తూ అందులో వ్యాసాలు వ్రాశారు. నేను యేం చెప్పను? నేను ఏం చెప్పితే ఎవ్వరు వింటారు? వీరంతా తెలిసి వ్రాశారా? తెలియక వ్రాశారా? తెలియక వ్రాశారు అనుకోటానికి కారణం కనుపించదు. అంతా మోసం. సంఘానిది నిలువెల్లా మోసమే! పుస్తకం మూసి ఆలోచించాను. ఎక్కడికి వెళ్తావుం డీ సంఘం?






మధ్యాహ్నం మూడు గంటలయింది.

సూర్యకిరణాలు పడి మొక్కల ఆకులు మెరుస్తున్నాయి.

అశ్వని గది కిటికీ దగ్గర నిలబడి చూస్తోంది.

కళ్ళు అన్నింటినీ చూస్తున్నా ఏదీ మనసుమీద ముద్రితం కావటం లేదు. అందుకని ఆందోళన! అర్థంలేని ఆరాటం! ఏమవుతుందో!

క్షణాలు గంటల్లా గడుస్తున్నాయి.

హాల్లో చెప్పుల చప్పుడు! అశ్వని గుండెలు, దబ్ దబ్ లు కొట్టింది గబగబా!

"మజ్జిగ తాగుతారా?" తల్లి అడుగుతోంది. సమాధానం వినిపించలేదు

అశ్వనికి.

"వెళ్ళినపని ఏమయింది?"

"చాలా బాగా అయింది!" గొంతులో వెటకారం.

"అబ్బ, చెప్పండీ."

"వాళ్ళు మెత్తగానే మాట్లాడారు. అతనే ఆరు వేలకు పైసా తగ్గటానికి వీల్లేదని పట్టుపట్టి కూర్చున్నాడు."

"అదేమిటీ?"

"ఏవో అప్పులున్నాయిట అవి తీర్చుకోవాలిట. తీరాచూస్తే అతనికి ఒక్క పైసా షేసే ఆస్తిలేదు. చదివింది యింజనీరింగ్! ఇప్పట్లో వుద్యోగం దొరికే ఆశలేదు. ఇప్పుడు ఉన్నది యేదో టెంపరరీ వుద్యోగం. ఏమిటో....ప్రేమ....ప్రేమ అంటుంది. అలాంటి వాడికి పిల్లనెలా యివ్వటం!" తండ్రి కంఠంలో ఆవేదనకి అశ్వని మనసు కెలికినట్లయింది.

ఖచ్చితంగా ఆరువేలు కట్నం కావాలన్నాడు గోపాల్! ఇన్నాళ్ళూ కంటున్న కలలన్నీ గాల్లో కలిశాయి! ఇంక అతనికీ మిగతా పురుషులకూ ఏమిటి తేడా? ఏమీ లేదు! వాళ్ళకు మనసు—ప్రేమా వీటితో పనిలేదు. స్త్రీ భావించినంత సున్నితంగా దేన్నీ చూడరు.

అశ్వని కళ్ళనిండా నీళ్లు వచ్చాయి.

హాల్లో తండ్రి చెబుతున్న మాటలు వినిపించుకోలేదు. ఇంకెందుకీ అనవసరపు ఆశలు! ఆరువేలు కాదుగదా యీ సమయంలో ఆరువందలైనా తండ్రి పుట్టించలేడు. ఎవరైనా ఏం చూసి అప్పు యిస్తారు.

బడి పంతులికి వేలు అప్పు యిచ్చే ధర్మాత్ములెవరు?

అశ్వని తడికళ్ళతో కిటికీలోంచి ఆకాశంపైపు చూసింది.

* *

చీకటి చుట్టూ వీరవిహారం చేస్తూంది. అశ్వని పిచ్చిగా తలగడకి మొహం రుద్దుకుంటోంది. తండ్రి వంటింట్లో అన్నం తింటున్నాడు.

గిన్నెల చప్పుడు వినిపిస్తోంది.

"అశ్వని అన్నం తిన్నదా?" తండ్రి అడుగుతున్నాడు.

"లేదు. ఆకలి లేదంటే ఎంత బతిమాలినా, విసుగొచ్చి వూరుకున్నాను. మధ్యాహ్నంనుంచీ గదిలోంచి బయటికే రాలేదు, కామాక్షి విచారంగా అంటోంది.

"ఒక్కగానొక్క ఆడపిల్ల. దాని పెళ్ళి సమస్యకావటం ఎంత విచారకరం! పిచ్చిపిల్ల. దాన్ని చూస్తుంటే గుండె తరుక్కుపోతూంది!

ఒక్కనిమిషం నిశ్శబ్దం.

హఠాత్తుగా తండ్రి అంటున్నాడు, కామాక్షి! ఇల్లు తాకట్టుపెడితే?"

"ఇల్లా?" తల్లి గొంతులో ఆవేదనా, ఆరాటం.

పరోక్షంగావింటున్న అశ్వని ఉలిక్కిపడింది.

"అవును. ఇల్లు తాకట్టు పెడతాను.




తర్వాత నెమ్మదిగా తీర్చుకోవచ్చు.'

''తర్వాత నెమ్మదిగా ఎలా తీరుస్తారు? మీకు వెనక ఏముందీ? వచ్చే జీతంతో యిల్లు జరగటమే కష్టంగా వుంది. ఉన్న ఒక్క యీ నీడా పోతే మన గతి ఏమిటి? ఇద్దరు పసివాళ్ళు వున్నారే, వాళ్ళసంగతి మర్చిపోయారా? ఇల్లు కూడా పోతే అనాధల్లా గోచీలతో వీధిలో చెట్టుకింద మమ్మల్ని నిలబడమంటారా?'

కామాక్షీ! ఎందుకంతదూరం ఆలోచించి కొండంత చేస్తావు? ఒక్కగానొక్క ఆడపిల్ల. ఇంటికి దీపం! అది సుఖంగా, సంతోషంగా వుండటంకంటే మనకేం కావాలి!

''అవును. కాదనను. కాని తర్వాతిది ఆలోచించండి.''

''నాకు ప్రమోషన్ రావచ్చు హెడ్ మాస్టర్‌గా. అప్పుడు మన స్థితి ఇంకొంచెం బాగుకావచ్చు.'' తండ్రి నవ్విన శబ్దం.

ఆం! ఈ మాటలు నా పెళ్లి అయినప్పటినుంచీ వింటూనే వున్నాను." తల్లి మూతి విరుపు.

అశ్వనిగుండె బాధతో నిండిపోయింది. పెళ్లికోసం తనవారందరినీ అనాధలుచేసే స్వార్థపరురాలా తను? ఎన్నటికీ కాదు. పోనివ్వు. గోపాల్ చేసుకోకపోతే తనకేం జీవితం జరగదా! నిజంగానా? గోపాల్ లేకపోతే జీవింతం సుఖంగా గడపగలదా తను! అతనిమీద పెంచుకున్న ఆశల మాటేమిటి? అతనికి అంత తనూ, తన ప్రేమా అవసరం లేకపోతే తనెందుకు పట్టుకు వేల్లాడాలి! తనుమాత్రం అతనిలా ఎందుకు చంపుకోకూడదు! రేపొకసారి గోపాల్‌ని కలవాలి అనుకుంది అశ్వని.

* *

"అశ్వనీ!"

ఇసుకలో కాళ్లు యీడుస్తూ నడుస్తున్న అశ్వని వెనక్కి తిరిగి చూసింది.

గోపాల్ చకచకా నడుస్తూవచ్చి కలిశాడు. "ఎన్నిసార్లు పిలిచినా పలకవేం?"

"సారీ. విన్పించలేదు." బలవంతాన నవ్వి అంది. "నీతో కొంచెం మాట్లాడాలి. అలా కూర్చుందామా?"

"పద" అంటూ అశ్వని చెయ్యి పట్టుకున్నాడు.

అతనివంక చూసి వూరుకుంది అశ్వని.

ఇద్దరూ పున్నాగ చెట్టుకింద కూర్చున్నారు తెల్లని యిసుకలో.

దూరంగా పిల్లలు బండ జారుతూ కోలాహలంగా అరుస్తున్నారు.

పడమటన ఆకాశం, కొత్త పెళ్ళి కూతురి జడమీద కుట్టిన కనకాంబరాల దండలా వుంది.

"ఏమిటి మాట్లాడాలన్నావు?" ఎటో పరధ్యానగా చూస్తూన్న అశ్వన్ని అడిగాడు గోపాల్.

అశ్వని తలతిప్పి అతనివంక సూటిగా చూసింది. "నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా? మన మధ్య వున్నది ప్రేమేనా?"

"ఇప్పుడు సందేహం ఎందుకు వచ్చిందో, అంతా అయిపోయి పెళ్లి మాటలు మాట్లాడుకుంటూంటే! అయినా అడిగావు గాబట్టి చెబుతున్నా, నా గుండె చీల్చి చూడు రుజువు కావాలంటే.' నవ్వాడు గోపాల్.

"పరిహాసం కాదు, గోపాల్! నువ్వు నన్ను అంతగా ప్రేమించేటట్లయితే.... మా నాన్నగారితో. కట్నం విషయంలో అంత ఖచ్చితంగా మాట్లాడగలిగావంటే.. ఆరువేలకు ఒక్క పైసా తగ్గించనన్నావని తెలిశాక నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా అని అనుమానం వచ్చింది."

"అదా?" గోపాల్ మొహం ఎర్ర నయింది. 'అశ్వనీ! కట్నం అడిగాను. నిజమే కానీ, అందులో ఒక పైసాఅన్నా నా స్వార్థంకోసం కాదు. నా అప్పులు తీర్చుకోడానికి అంతే. అశ్వనీ! మాకు వుండే ఒకటి అరా ఎకరం నేను పెద్ద వాడిని అయ్యేసరికే ఖాళీ అయింది. నేను అడుగుతున్న కట్నండబ్బు అంతా నా చదువుకోసం అయింది. నేను పెళ్లికి కట్నం తీసుకుంటాననీ అప్పు తీర్చగల ననే ఆశతోనే నాకు అప్పులు యిచ్చారు; అంతా వెనక చిల్లికానీ ఆస్తిలేనివాణ్ణి. గవర్నమెంటువారి ధర్మమా అని నా యింజనీరింగ్ పూర్తి అయ్యేసరికి వుద్యోగాలు లేవు. ఇప్పుడు నేను చేసే వుద్యోగమా టెంపరరీ! ఇంక అప్పులు తీర్చే దారి ఏది?"

అశ్వని మాట్లాడలేదు.

"నాకూ ఆదర్శాలు వున్నాయి. కాలేజీ జీవితంలో నేనూ లెక్చర్లు దంచినవాడినే. కానీ యీనాడు నేను దగాకోరుగా, అప్పు ఎగవేసే అవినీతిగాడిగా వుండకుండా వుండాలంటే ...'

అశ్వని మధ్యలో అందుకుంది.



"కానీ మా నాన్న అంత డబ్బు తేలేడన్న సంగతి నీకూ తెలుసు. నా తర్వాత యింకా పిల్లలు వున్నారు. మా నాన్న నాకు అంత కట్నం ఇవ్వాలంటే అప్పుల్లో మునగాల్సిందేగా!"

"అదే నేను చెప్పేది, అశ్వనీ! మీకు కనీసం మీ యిల్లు చూసి అయినా అప్పు యిచ్చే నాథుడు వున్నాడు. నాకు స్వంత యిల్లుగానీ, భూమిగానీ లేవు. ఉద్యోగంలో స్థిరపడగలననే ఆశ లేదు. పెళ్ళి, కొడుకుగా ఏనాటికయినా నాకో అర్హత సంపాదించి పెట్టేది యీ నా డిగ్రీనే! అందుకే నేను పెళ్ళి అనేది చేసుకుంటే, నా అప్పులు తీర్చగల కట్నంతెచ్చే అమ్మాయినే చేసుకుంటాను."

అశ్వని విసురుగా తల ఎత్తింది.

'నీ ప్రశ్న నాకు తెలుసు, అశ్వనీ! మరి నన్ను ప్రేమించానని ఎందుకు మభ్య

పెట్టావు అంటావు, అంతేగా? మొన్న మీ నాన్న వచ్చి మాట్లాడేవరకూ నేను నీతో ఏవయినా ప్రేమకబుర్లు చెప్పానా? పొరపాటున ఎనా యింకో విషయం నేను ఎత్తానా? లేనిపోని ఆశలు కల్పించుకోటం నాకు నచ్చదు.'

అశ్విని తల వంచుకుని గుప్పిళ్ళతో యిసుక ఎత్తి పాదాలమీద పోసుకుంటోంది. మొహం తెల్లగా పాలిపోయి వుంది. కళ్ళు వాల్చుకోడంవల్ల ఎలాంటి భావాలూ వ్యక్తం చేయడంలేదు.

గోపాల్‌కి జాలి వేసింది. మృదువుగా అన్నాడు: 'సారీ, అశ్వనీ! నిజం ఎప్పుడూ నిష్ఠూరంగానే వుంటుంది. నా లాంటి డిగ్రీతప్ప ఏ అర్హతా లేనివాడు అంతంత కట్నం అడగటం తప్పే. కాని వేరే దారి ఏది? ఇంతకీ నాన్నగారు ఏమంటారు?'

"ఇంకా ఏమీ అనలేదు," అశ్విని నిస్పృహగా అంది.

అతనికి తన బాధ ఏమీ పట్టదు. తన హృదయం ర్థం చేసుకోడు. తన చుట్టూ గీసుకున్న పరిధి దాటి ఒక్కడుగయినా యివతలికి రాడు.

"చీకటి పడింది. ఇంక వెళ్దామా?" గోపాల్ లేస్తూ అన్నాడు.

అశ్విని నిట్టూర్చి లేచింది.

లాభం లేదు. వున్న ఒక్క ఆశా పోయింది. కట్నం తీసుకోకుండా అతను పెళ్లిచేసుకోడు. అంత కట్నం తన తండ్రి యివ్వలేడు. తను యింకా పట్టుపట్టితే యిల్లు అమ్ముతాడు. అప్పుడేమవుతుంది! వున్న ఒక్క ఆధారమూ పోతుంది. మిగిలిన జీవితం అంతా ఏమవుతుందో? అభివృద్ధిలోకి రావల్సిన పిల్లలు అక్క ధర్మమా అంటూ బికారుల్లాగ వీధుల్లో తిరిగే పరిస్థితి వస్తుంది. ఇంతమందిని బాధపెట్టే యీ పెళ్లి చేసుకోకపోతేనేం? గోపాల్ అయినా కనీసం నువ్వులేంది బతకలేను అనటం లేదుగదా? తను కాక పోతే మరో అమ్మాయి! ఎవరో ఒకరు. అతని అప్పుతీర్చే కట్నం తెచ్చేఅమ్మాయి! అతనికి పెళ్లికన్నా, ప్రేమకన్నా కట్నం, అప్పు ముఖ్యం. కానివ్వు. నిజానికి అతని పక్షంగా ఆలోచిస్తే అంతా కరక్టే! అతను మాత్రం ఎక్కడ్నుంచి తెస్తాడు! ఛీ! ఛీ! వెధవ డబ్బు సమస్యలు! వున్నవాళ్ళ దగ్గర కోట్లుకోట్లు వుండటం, లేనివాళ్ళ దగ్గర ఏమీ లేకపోటం; యిలా వుంది పరిస్థితి.

రాత్రి చాలాసేపు నిద్రకు దూరమయి అశ్విని ఆలోచించింది. ఎందుకు తనింతగా బాధపడాలి! పెళ్ళిలేకుండా మొగోడు వుండ టంలేదా, అలాగే తనూను! అతను కట్నం అడిగినప్పుడే అశ్విని మనసు విరిగిపోయింది. మనసులో ముల్లు విరి గింది. ప్రేమదారి ప్రేమదీ, కట్నాలదారి కట్నాలదీ.

రెండు రోజుల తర్వాత అశ్విని ఓ కాగితం పట్టుకుని యింటికి వచ్చింది.



వుత్సాహంగా.

తండ్రి మంచంమీద పడుకున్నాడు అప్పుడే భోజనంచేసి.

"నాన్నా!" అంది అశ్వని. ఎంత దాచుకున్నా గొంతులో ఆనందం పెల్లుబికి మాటలో కలుస్తూనే వుంది.

కప్పుకేసి చూస్తున్న తండ్రీ, పాత చీరకు అతుకులు వేస్తున్న తల్లీ ఒక్కసారే తలలు ఎత్తి చూశారు.

"ఉద్యోగం, నాన్నా! బాలానంద కేంద్రంలో.' అశ్వని తండ్రి మంచం మీద కూర్చుంది.

గణపతి ఒక్కక్షణం కాగితంకేసీ, అశ్వనీ మొహం కేసీ మార్చిమార్చి చూశాడు. "ఎవరికమ్మా ఉద్యోగం?"

"నాకే నాన్నా, రేపు ఫస్టునుంచి చేర

మేన్నాడు వచ్చి టీచర్‌గా।''

''అశ్వనీ। నీకు .... మతిపోయిందా? మీ నాన్నగారు పెళ్లి లగ్నం పెట్టుకు రావాలనుకుంటూంటే? కామాక్షి అంది.

''ఇల్లు అమ్మేశారా?' అశ్వని అనుమానంగా అంది తండ్రివంక చూస్తూ.

''ఇల్లా। ఇల్లు అమ్ముతారని ఎవరు చెప్పారు? బాంకులో వుందిగా ...గణపతి మాటలకోసం తడుముకున్నాడు.

''నాకు తెలీని బాంకు అకౌంట్ మనకేం వుంది, నాన్నా! ఇల్లు అమ్మి ఎలాగో అలాగ నా బాధ తీర్చుకుందామనుకున్నారు గదూ?'

గణపతి లేచికూర్చున్నాడు. ''నువ్వు నాకు బాధా?। నువ్వు యీ యింటి దీపానివి, అశ్వనీ। నీ తర్వాతే నాకు మిగిలిన పిల్లలు. నీ సుఖమే నాకు కావలసింది''

అదే నిజమయితే నాకు యీ పెళ్లి యిష్టం లేదు. నాన్నా వున్న ఒక్క ఆధారమూ పోయి మీరు వీధిలో ఉంటే నేను సుఖంగా ఎలా వుంటాను నాన్నా! నన్ను అంత స్వార్థపరురాలిగా వూహించావన్నమాట!'' నిష్ఠూరంగా అంది.

''అదికాదు, అశ్వనీ! గోపాల్ అన్నదీ నిజమేగద. అతని అప్పులు మాత్రం తీరాలా?''

అశ్వనికోపం వచ్చింది. ''అవును నాన్నా! అతని అప్పులు తీరాలంటే మనం అప్పులపాలు కావాలి. నే నోమాట చెబుతాను విను. నన్ను నీ మొదటి మగపిల్లవాడనుకో నేనూ వుద్యోగం చేస్తాను. నీకు తోడుగా వుంటాను, ఇది మంచి వుద్యోగం నాన్నా! మన పరిస్థితి యింకొంచెం మెరుగవుతుంది, కాదనక.'' అర్థింపుగా అంది,

గణపతి నిట్టూర్చాడు. ''చివరికి ఆడపిల్ల సంపాదన తినేగతి పట్టిందన్నమాట ఎప్పటికయినా ఓ యింటికి పోవాల్సిన దానివి. ఆ మాట అంటేనే నాకు వొళ్ళు మండుకొస్తూంది. ఆడపిల్ల సంపాదన తినకూడదా? మరి వేలు గుమ్మరించి నాకు ఎందుకు చదువు చెప్పించావు? ఊరికే కూర్చుంటే ఏం వొరుగుతుంది? ఒకడు సంపాదించినదానిమీద పదిమంది బతుకు గాబట్టే మనదేశం ఇంత దరిద్రమయింగా వుంది. అడపిల్ల సంపాదన మొగుడివైపు వాళ్ళే తినాలా? ఎంత అన్యాయంగా మాట్లాడతారు! ఈ మాట మనసులో ఉన్నంతకాలం మన సంఘం ముందుకు నడవదు.''

ఎంతయినా పిల్లా పాపలతో కళకళ....'' కామాక్షి అందుకుంది.

''అబ్బ. నువ్వు మరి చాదస్తం!' అశ్వని। అంది. ''ఏం, నాన్నా? వాళ్ళకు కబురుపెట్టు ఆ సంబంధం అక్కర్లేదని.''

''అదికాదు అశ్వనీ. అతన్ని ప్రేమించానన్నావు?'

''అదిపోస్తు నాన్నా! నేను ఇప్పట్లో పెళ్ళి చేసుకోదలుచుకోలేదు.'

గణపతి అశ్వనికేసి చూశాడు. కళ్ళు మెరుస్తున్నాయి. అది తడి మెరుపో, ఆనందం మెరుపో అర్థంకాలేదు.

చిన్నగా నిట్టూర్చి వూరుకున్నాడు.

# అడుగు జాడలు




తాత ముసలి వృద్ధు. శరీరం ముడతలు వడిపోతుంది. అడుగులు తడబడతాయి. అది కీకారణ్యం. నలుదిక్కులా చీకటి. కాని తాతకు భయంలేదు. మనుమడితో అంటాడు తాత, 'మా ముత్తాతల కాలం నాడు ఏర్పడింది ఈ దారి. అంతకుముందు యీ అడవిచుట్టూ ఆరుమైళ్ళు నడిచిపోయే వారు జనం. మా ముత్తాత సాహసించి యీ అరణ్యానికి అడ్డుపడ్డాడు. మళ్ళీ అతన్ని చూడమనుకున్నారు మావాళ్ళంతా. కాని అతడు నిర్భయంగా అరణ్యందాటి ఆ వూరికి చేరుకున్నాడు. క్రూర జంతువులు అతన్నిచూసి భయపడి పారిపోయాయని అనుకునేవారు అందరూ. మహానుభావుడు. అతని అడుగుజాడల్లో తరవాత తరవాత ఎందరో నడిచారు.''

మనమడు బలశాలి. యౌవనంతో కలకల్లాడుతూ ఉంటాడు. గట్టి కండల మీద చర్మం బిగించి లాగినట్టు పరుచుకుంటుంది. తాత మాటలకు అతని కళ్ళు కొంటెగా నవ్వుతాయి. ఈ చిట్టడివిలో అంత భయపడవలసింది ఏముందో అతనికి బోధపడదు. తాతతో అంటాడు, ''తాతా నీకో కొత్తదారి చూపిస్తాను రా.' తాత ముసలి ముఖంమీది ముడతల్లో అనుమానం, భయం తొంగిచూస్తాయి. అందరూ నడిచేవారి ఉండగా, కొత్తదారి ఎందుకురా మనకి.... అంటాడు. మనుమడు నవ్వుతూ పెడదారి తొక్కుతాడు. దారి వదలి రావడానికి భయపడతాడు. ఆపక్క

యేరుంది. ఆ యేట్లో మొసళ్లుంటాయని అందరూ అనుకుంటారు. కాని మనుమడికి మొసళ్ళంటే భయంలేదు. తాత రానంటాడు. మనుమడు....యేరుదాటితే అవతలే వూరు; మైలన్నా ఉండదు....అంటాడు. తాతంటాడు, యేరుదాటినా అవతల పెద్ద పుట్టలో పాముందట, ఎందరినో కరిచి చంపింది...మనుమడంటాడు, పుట్టదగ్గరగా పోవద్దులే. దూరంగాచుట్టి పోదాం. మొసళ్ళంటే భయంలేని మనుమడికి పామంటే భయం. అంచేత తాతచెయ్యి పట్టుకుని మెల్లగా యేరుదాటిస్తాడు. ఒక్క మొసలీ కనబడదు. పాము పుట్టకుమాత్రం దూరంగా చుట్టి తాతమనుమడు ఊరుచేరుకుంటాడు. మనమడు యేరుదాటిన సంగతి ఊరందరికీ తెలుస్తుంది. మొదట్లో కొందరు అనుమానిస్తారు. కొందరు ఈ కొత్తదారి చాలా ప్రమాదమయినదంటారు. కాని కొందరు సాహసించి మనమడు పోయిన దారిని యేరు దాటుతారు. క్రమంగా పాతదారి మాయమయిపోతుంది. కొత్తదారి పాతబడుతుంది.

* *

హరిశాస్త్రి పెద్ద విద్వాంసుడు. షట్ఛాస్త్రాలూ ఆయనకి కంఠస్థం. శ్రోత్రీయ కుటుంబంలో పుట్టినవాడు. ఆయన తండ్రి ధర్మశాస్త్రంలో అధికారి. ఏవన్నా ధర్మ సందేహాలొస్తే ఆయన తీర్చవలసిందే. కొడుకుని తనంతవాణ్ణిచేశాడు. కాని హరిశాస్త్రి విచిత్రంగా మారిపోయాడు. చివర రోజుల్లో హరిశాస్త్రి పితృగృహం చివిడి దూరంగా పోవలసివచ్చింది. తండ్రి బెంగతో మంచమెక్కాడు. కాని చనిపోయేముందు ఆయన ఆఖరుకోరిక ఇది. "నా శవాన్ని తాకడానికిగాని, నాకు అపరకర్మలు చేయడానికిగాని నా కొడుక్కి అధికారంలేదు. వాడు కులభ్రష్టుడు. వాడీఇంట్లో అడుగుపెడితే అంతా అపవిత్రమయిపోతుంది." తండ్రి కోరికను మన్నించి హరిశాస్త్రి ఆ యింటికి పోలేదు. తండ్రి శవాన్ని చూడలేదు.

హరిశాస్త్రికి పిత్రార్జితం బాగా ఉంది ఒకప్పుడు. కాని క్రమంగా ఆ ఆస్తంతా సన్నగిలిపోయింది. అయినా ఆయనంటే అందరికీ అపరిమితమయిన గౌరవం. ఎందుకంటే ఆ ఆస్తంతా ఒక ఆదర్శం కోసం వినియోగపడింది. ఆయన ఇప్పుడు పెద్దవాడయిపోయాడు. ఊరిపెద్దలు ఇంటి అరుగుమీద చేరుతుంటారు. ఆయన వారితో ముచ్చటిస్తూ కాలక్షేపం చేస్తుంటాడు.

మా తండ్రిగారికీ నాకూ మధ్యవచ్చిన వివాదం ఏమంటే పంచములు అస్పృశ్యులని స్మృతిశాస్త్రాదులు ఘోషిస్తున్నాయంటా రాయన. అస్పృశ్యత మానవ ధర్మం కాదని నా వాదన. అయితే నాకు కనువిప్పు కలిగించిన మహానుభావుడు మహాత్మా గాంధీగారు. ఎంత అసహజమయిన సంప్రదాయం వచ్చిపడిందో చూడండి మనకి. నేను తరవాత వెతికి

చూచాను. మూలగ్రంథాలలో ఎక్కడా అస్పృశ్యతా దోషమనేది లేనేలేదు. అవతారపురుషుడాయన. మామూలు మాటల్లో అందరికీ తెలిసేటట్టు, అఖండమయిన జ్ఞానమార్గాన్ని బోధించాడు. అస్పృశ్యత హైందవ సంప్రదాయానికి అవమానమన్నాడు. అహా! హా! ఎంత అమృత హృదయం, ఎంత ప్రగాఢమయిన జ్ఞాన సంపత్తి!

ఇలా రోజులు రోజులు ఆయన చెపుతూనే ఉంటాడు. పెద్దలు వింటూనే ఉంటారు. బంధువులు, తోడి బ్రాహ్మణులు ఆయన్ను మొదట్లో వెలివేశారు. చాకలి మంగళ్లు ఇంటికి రావడం మానేశారు. కొద్దిరోజులు అష్టకష్టాలూ పడ్డారాయన. అయినా ఆయన హరిజనవాడలో తన కార్యకలాపాలు విరమించలేదు. అదొక వీరగాథ.

రామ్మూర్తి ఆయన ఏకైకపుత్రుడు. అతడు ఆంగ్లవిద్య అభ్యసించడానికి హరిశాస్త్రి మొదట్లో ఒప్పుకోలేదు. కాని భార్య బలవంతంవల్ల, కాలధర్మాన్నిబట్టి చివరికి ఆయన ఒప్పుకోవలసి వచ్చింది. రామ్మూర్తి బి. ఏ. పాసయాడు.

తండ్రి కొడుకుల మధ్య సంబంధం చిత్రమయినది. రామ్మూర్తి చిన్ననాటి నుంచీ తండ్రితోకూడా తిరిగాడు. నిద్రలో లేపి అడిగినాసరే, గాంధీగారు ఎప్పుడెప్పుడు ఏమేమన్నారో చెప్పగలిగేవాడు. హరిశాస్త్రికి కొడుకంటే ఎంతో గారం. కాని ఆయన అతన్ని ఎత్తుకుని ఎప్పుడూ ముద్దాడి యెరగడు. ఎవరూ లేనప్పుడు కొడుకు కంటబడితే, ఆయన చూపులో ఎంతో ఆశ, ఆదుర్దా, ఏదో ఎరగరాని ఆవేదన ప్రతిఫలించేవి. అంతకుమించి ఎన్నడూ ఆయన కొడుక్కి చనువిచ్చి ఎరగడు.

రామ్మూర్తికి తండ్రిమీద ఉన్నది భయమో భక్తో చెప్పడం కష్టం. అతనెప్పుడూ తండ్రి ముఖంలోకి తిన్నగా కళ్ళెత్తి చూడలేదు. ఎన్నడూ తండ్రి మాటకు ఎదురుచెప్పి ఎరగడు. అతనికి ఇంగ్లీషు చదువు చదువుకోవాలని ఉన్నా, అతనుమాత్రం తండ్రినెప్పుడూ అడగలేదు. ఆ విషయమయి తల్లీ తండ్రీ వాదోపవాదాల్లో పడ్డప్పుడు తనకేమీ సంబంధం లేనట్టుగానే ఉన్నాడు. అతను పెద్దవాడయి ప్రయోజకుడయాకకూడా తండ్రి చెప్పినట్టు తన సొంతచేత్తో వడికిన ఖద్దరుదుస్తులు తప్ప కట్టుకుని ఎరగడు.

కాని రామ్మూర్తి హృదయం లోతుపాతులు అతనికి తప్ప ఎవరికీ తెలియవు. సలాంజంగ్ అతని స్నేహితుడు, సహాధ్యాయి. వాళ్ళ ఇంటికి అతను తరుచు వస్తూపోతూ ఉండేవాడు. గుమ్మంతెరల వెనక కనిపించీ కనిపించకుండా ఒక మూర్తి అతని దృష్టిని ఆకర్షించేది. రెండు కళ్ళవో తన్ని చూసి నవ్వుతున్నట్టు అతనికి అనిపించేది. ఆ ఇంట్లో అంత

ప్రోషా లేకపోయినా మొదటిరోజుల్లో ఆ అమ్మాయి ఇవతలికి వచ్చి అతనికంట పడలేదు.

ఒకనాడొక చిత్రమయిన సంఘటన జరిగింది. అతను తన ఊరినించి బయలు దేరి పట్నం పోవడానికి రైలెక్కాడు. బండి కిక్కిరిసి ఉంది. ఒక స్టేషనులో ఒక యువతి రైల్లోకి ఎక్కలేక కంగారు పడుతూ ప్లాట్‌ఫారంమీద నిలబడి పోయింది. రామ్మూర్తి చూసి బండిదిగి ఆమెను జాగ్రత్తగా పెట్టిలోకి ఎక్కించాడు. బెజవాడ జంక్షనులో దిగేవరకు అతను ఆమెకు తనచోటిచ్చి నిలబడ్డాడు. బెజవాడలో అతను తన సామానులు దింపుకుని వెళ్ళిపోబోతూ ఆగాడు. ఆ యువతి ముఖంలో అసహాయత్వం తన వేపు ఆశగా చూస్తున్నట్టు అనిపించిందతనికి. ఎక్కడికి వెడతారు? అని అడిగాడు. గుంటూరు. ఇక్కడ రైలుమారాలి అంది ఆమె. నేనూ గుంటూరే, రండి, ఫరవాలేదు, అన్నాడు. వహీదా అని తరవాత తెలిసిందతనికి, ఆమె సలార్‌జంగ్ చెల్లెలు. ఆ తరవాత అతను ఆ ఇంటికి వెళ్ళినప్పుడల్లా ఆమె నవ్వుతూ వచ్చి అతనితో కబుర్లు చెప్పేది. క్రమంగా కొత్తపోయి, చనువేర్పడింది. మొదట్లో అతను వాళ్ళింటో మంచినీళ్లు కూడా ముట్టలేదు. కాని క్రమంగా ఫలహారాలు కూడా సేవించేవాడు. ఆమె చేత్తో ఇచ్చినప్పుడు నిరాకరించడం పెద్ద అపచారమనిపించే దశనికి. అయితే అతని మార్పుకి వెనక పెద్ద సూత్రాలూ, సిద్ధాంతాలూ ఏవీ లేవు. అసలు లోలోపల అతనికి సూత్రాలమీదా సిద్ధాంతాలమీద కొంత అసహనంకూడా ఉంది. కాని మనసులో ఉన్నది పైకి చెప్పడం అతనికి ఎన్నడూ అలవాటు లేదు. అంచేత చాల రోజులు అతని మనసులో రహస్యం రహస్యంగానే ఉండిపోయింది.

వహీదా చాలా చలాకీ అయినది. ఆమె ఎప్పుడూ ఏదో అంటూనే ఉంటుంది. ఆ ఛలోక్తులు రామ్మూర్తిని గిలిగింతలు పెట్టినా, అతను నవ్వి ఊరుకునేవాడు.

ఈ పరిచయానికి పర్యవసానం రామ్మూర్తి మనస్సులో అస్పష్టంగానే ఉంది. వహీదా మూర్తి అతని నిద్రలో కూడా అతన్ని కలతపెట్టేది. ఒకపక్క ప్యారీ, ఒకపక్క తన తండ్రి హరిశాస్త్రి తన్ని చెరోచెయ్యి పట్టుకొని లాగుతున్నట్టు కలలు వచ్చేవి. ఈ మధనంలో నుంచి అతన్ని చివరికి బయటపడేసింది వహీదాయే. ఒకనాడు ఏకాంతంగా ఉన్నప్పుడు వహీదా చటుకుని అంది, ఎన్నాళ్ళీ దాగుడుమూతలు? రామ్మూర్తికి వెంటనే ఏం చెప్పాలో తోచలేదు. తనకేమీ తెలియనట్టు నటించడం రామ్మూర్తికి చేతకాదు. కొంతసేపు మౌనంగా కూర్చుని తరవాత నిట్టూర్చి మెల్లగా అన్నాడు. మా నాన్నని నువ్వెరగవు. వహీదా అంది, ఆ మాటకొస్తే మావాళ్ళూ ఒప్పుకోరు:




వాళ్ళకి భయపడి మనం మన సుఖాల్ని, ఆశల్ని ఎందుకు వదులుకోవాలి?

తరవాత ఎన్నోసార్లు అతని మనస్సులో ఈ ప్రశ్న తలెత్తింది. దానికి సమాధానం ప్యారీ ప్రశ్నలోనే ఉంది. అది ఆతని మనస్సుకి పట్టిన తరవాత ఒక రోజున వహీదాతో అన్నాడు ... ఈ వేళ మా ఊరు వెడుతున్నాను. నాలుగు రోజుల్లో తిరిగొస్తాను. వచ్చిన తరవాత యిద్దరం పెళ్ళిచేసుకుంటాం,

కాని తన ఇంటికివచ్చిన తరవాత తండ్రితో యీ సంగతి చెప్పడం అనుకున్నంత సులభంగా అతనికి కనిపించ లేదు. క్షణక్షణం వాయిదాలు వేస్తూగడి పాడు. కాని మామూలుగానే అతను ముభావంగా ఉంటాడు. అంచేత అతనిలో యింతమధనం జరుగుతోందని తల్లికీ తండ్రికీ కూడా తెలియలేదు.

చివరికి నాలుగవరోజున అతను తండ్రికి చెప్పడానికి అతను మనస్సు దిట్ట పరుచుకున్నాడు. తండ్రి ఏమంటాడో అన్నభయంకంటే, ఈ వార్త తండ్రికి ఎంత గొడ్డలిపెట్టుగా ఉంటుందోనన్న ఆదుర్దా అతన్ని ఎక్కువ కలతపెట్టింది.

తండ్రి మామూలుగా ఊరిపెద్దలతో కూర్చుని తన చిన్ననాటి హరిజనోద్యమాన్ని గురించి ఉత్సాహంగా చెప్తున్నాడు. రామ్మూర్తి అరుగుమీదికివెళ్ళి, నాన్నా....నీతో కొంచెం మాట్లాడాలి, అన్నాడు. ఇంతవరకు యిల్లాంటి మాట కొడుకు నోటివెంట హరిశాస్త్రి ఎన్నడూ వినలేదు. హరిశాస్త్రికిదొక కొత్తసంగతే. ఏంనాయనా అంటూ లేచివచ్చాడు. ఒక క్షణంపాటు రామ్మూర్తి తన మనస్సులో విషయం ఏమయినా సరే తండ్రికి చెప్ప కూడదనుకున్నాడు. కాని మరుక్షణం

సర్దుకుని అన్నాడు. నేను పెళ్లిచేసుకో దలుచుకున్నాను. హరిశాస్త్రికి దీని అర్థం ఏమీ అంతుపట్టలేదు, అన్నాడు. మెల్లగా. సరే. అయితే....ఏదన్నా సంబంధం చూద్దాం రామ్మూర్తి కొంచెం ఆగి అన్నాడు.....అదికాదు అన్నా....నేనొక అమ్మాయికి మాటిచ్చాను. హరిశాస్త్రి అన్నాడు, నా కిదివరకు ఏమీ చెప్పలేదేం. రామ్మూర్తి సాహసించి అనేశాడు, ఆ అమ్మాయి మహమ్మదీయులపిల్ల. హరిశాస్త్రి ఆ అన్నాడు. కొంచెం ఆగి బొంగురు పోయిన గొంతుకతో అన్నాడు. మతేమన్నా పోయిందా? అందులో కోపం గాని, అసహ్యంగాని లేదు. పట్టిబాధ. రామ్మూర్తి గబగబా సంగతంతా చెప్పే శాడు, తన నిశ్చయాన్నికూడా తెలియ పరిచాడు. హరిశాస్త్రి ఏమీ మాట్టాడలేదు. కొడుకు చెప్పినదంతా విన్నాడు. చివరికి అన్నాడు, నీ మనస్సు మైలపడిపోయింది. అంతకంటే గొప్పతనం యింకొకటి లేదు. రామ్మూర్తి ఆదుర్దాగా అన్నాడు, మాలవాళ్ళు మనుషులయితే మహమ్మ దీయులుమాత్రం కారా? గాంధీగారయితే యిటువంటి వివాహాలకి అభ్యంతరం చెప్పరని నా నమ్మకం. కాని ఆ వాదంలో రామ్మూర్తికే నమ్మకం లేదు. హరిశాస్త్రి అన్నాడు. తక్షణం నువ్వీ ఇంట్లోంచి అవతలికిపో. నాకు కొడుకే పుట్టలేదను కుంటాను.

రామ్మూర్తి ఊరువదలి పట్నం వచ్చే శాడు. అతని మనస్సెందుకో చాలా తేలిక పడింది. ఏదో బరువు చటుక్కున తీసేసి నట్టు. తిన్నగా వహీదా యింటికివచ్చాడు. ఎవరో మహమ్మదీయుల్లో పెద్దలు సావడిలో ఉన్నారు. అందరి ముఖాలు తీవ్రంగా ఉన్నాయి. రామ్మూర్తి రావడం తోటే అందరూ వెళ్లిపోయారు.

సలార్‌జంగ్ రామ్మూర్తితో అన్నాడు, నువ్వు మా ఇంటికి రావడం మానేస్తే అందరికీ మంచిది? రామ్మూర్తి అడిగాడు, వహీదా అభిప్రాయంకూడా అదేనా? సలార్‌జంగ్ అన్నాడు, వహీదా ఎంత పట్టుదలమనిషో నీకు తెలియదు. రామ్మూర్తి, ఆమెకూ నాకూ ఇష్టమయితే మా పెళ్ళి ఆపగలిగేవాళ్లెవరు? సలార్ జంగ్ నిట్టూర్చి అన్నాడు, మా మహమ్మ దీయులకి ఉద్రేకాలు చాలా ఎక్కువ. ఏం ప్రమాదం జరుగుతుందో అని నాభయం. రామ్మూర్తి అడిగాడు. వాళ్ళు ఏమన్నా బెదిరించారా? సలార్‌జంగ్ మరే.

రామ్మూర్తి మనస్సులో సమస్య స్పష్టంగా విడిపోయింది. అతనికి అను మానాలు లేవు. బలమయిన ఆవేశం అతన్ని పట్టుకుంది. తనుచేస్తున్నపని చాలా సహజమయినది. అందరూ చెయ్య వలసిందీని. ఈ బెదిరింపులు విన్న తరవాత అతనిలో దాగున్న శౌర్యం, సాహసం విజృంభించాయి. ఎందరు ఎన్నివిధాల చెప్పినావినక రిజిష్ట్రారు ఆఫీసులో వహీదాను పెళ్లాడాడు. వహీదా నవ్వుతూ అతనిపక్కన నిలబడింది.

మరునాడుదయం రెండు శవాలను ఇంట్లోంచి యివతలికి తీశారు. వాళ్ళ కోసం కన్నీళ్ళు కార్చినవాళ్లు తక్కువ. ఈ దారుణం ఎందుకు జరిగిందో అందరికీ తెలిసినా, హంతకులెవరో ఎవరికీ తెలియనట్టుగానే అందరూ నటించారు. పంచాయితీ అయిన తరవాత కొందరు యువకులు ఆ శవాలకు దహనసంస్కారం చేశారు. రెండు చితులూ మండుతుండగా ఎందరో యువకులు శ్మశానంలోమూగారు. చితులు కాలిపోయిన తరవాత ఎంతోసేపు మౌనంగా అల్లాగే నిలబడ్డారు.

కొడుకు హత్యసంగతి విన్నప్పుడు హరిశాస్త్రి ముఖంలో ఏచలనమూ కనబడలేదు. మామూలుగానే ఆయన హరిజనోద్యమాన్ని గురించి మధ్యాహ్నం నలుగురికీ చెపుతుండేవాడు. కాని ప్రతి రాత్రి యేటిగట్టున ఒంటరిగా ఎవరో ముసలివాడు గుండెలమీద కుడిచేత్తో రాసుకుంటూ రాముడూ అని అరుస్తూ తిరుగుతుంటాడని విన్నవాళ్ళు చెపుతుంటారు.

*                    *

మనమడు తాతవుతాడు. తాతకి మళ్లీ మనమడు తయారవుతాడు. తాత మనుమడు అరణ్యంలో దారివెంట ఊరికి బయలుదేరుతారు. ఏటిలో నిర్భయంగా దిగి అవతలి ఒడ్డుకి చేరుకుంటారు. తాత చెపుతాడు, ఒకప్పుడు యీ యేట్లో మొసళ్లుంటాయని అందరూ భయపడేవారు. ఈ యేరుచుట్టి మూడుమైళ్ళునడిచి ఊరుచేరుకునేవారు. మొదట్లో నేనే సాహసించి యేరు దాటాను. మొసళ్ళూ లేవు. ఏవీలేవు. తరవాత అందరికీ ఈ దారే అలవాటయిపోయింది. తాత గొంతులో ధ్వనించిన గర్వానికి మనమడు నవ్వుకున్నాడు. ఈ యేట్లో మొసళ్లుంటాయని భయపడ్డవాళ్లు వెర్రివాళ్లని అతనినమ్మకం. తాత నడవబోతున్నాడు. మనమడన్నాడు, తాతా ఈ దారినిపోదాం రా వందగజాల్లో ఉంది ఊరు. ఎందుకల్లా చుట్టు తిరిగిపోవడం? తాతన్నాడు. అక్కడో పెద్ద పుట్ట ఉంది. అందులో బ్రహ్మాండమయిన తాచుపాముంది. మనమడు నవ్వి కొత్తదారి తొక్కాడు. తాతనయాన్ని భయాన్ని చెప్పి చూశాడు. చివరికి విసుగెత్తి నీ కర్మం పో, నేను రాను, అన్నాడు. మనమడు కొత్తదారి తొక్కాడు. పుట్టలో పాము బుస్సంది. మనమడు ఒడుపుగా కాసుకు నిలబడ్డాడు. పాము అతని మీదికురికింది. మనమడు పాము తల చేత్తోపట్టాడు. పాము చేతికి చుట్టుకుంది. చేతినరాలు పట్టుతప్పాయి. పాము కాటు వేసింది. అతను ఉన్నబలమంతా తెచ్చుకుని పాము తల పిడికిలితో నొక్కాడు. మనమడు బతకలేదు. కాని పాముకూడా చచ్చిపోయింది.

తరవాత ఆ దారిని ఎంతోమంది నిర్భయంగా వెళ్లారు. దారి పాతబడింది. కాని అడుగున మరుగుపడిపోయిన, ఆ దారిలో ఎక్కడో ఉన్నాయి అతని అడుగుజాడలు.

—

# తెలుసుకున్న నిజం



ఎమ్. హేమలత

"అమ్మా! నన్ను తీసికెళ్ళవూ.... అల్లరి చేయకుండా నువ్వు చెప్పినట్లు వింటాను—మరి గౌను తొడిగేసుకోనా?'' ఆరేండ్ల అరుణ, జానకిని ప్రాధేయపడుతూ, వెనకే వెనకే తిరుగుతూంది. దాని చిట్టి చిట్టి కళ్ళనిండా ఎంతో ఆసక్తి! ఆ పసిదాన్ని అపరిమితంగా ఆకర్షించినది. వాకిట్లో నిలబడి వున్న 'విమానం' లాంటి కారు. అమ్మ ముస్తాబు చేసుకుంటూంది....అందులో వెడుతుంది....తనని కూడా తీసికెళ్ళాలి.. అదే దాని చిన్నారి కోరిక!

ముడిచుట్టూ పువ్వులు చుట్టుకుంటున్న జానకి తన కుచ్చెళ్ళు పట్టుకొని లేవటానికి ప్రయత్నిస్తున్న బాబిగాడిని లాగి, (కుచ్చెళ్ళు ఎక్కువా.... కుర్రకుంక ఎక్కువా?....) కింద కూలేసి "అరుణా! నీకెన్నిమార్లు చెప్పాను, కాస్త తమ్ముడిని ఎత్తుకోమని పెద్దదానివి నువ్వే వస్తానని వెంటబడితే. నీకన్న చిన్నది— క్షణమాత్రం వూరకుంటుందా? అయినా నేను వెళ్ళేది....సంత కనుకున్నారా.... మిమ్మల్నందర్నీ నానెత్తి నెక్కించుకొని వూరేగడానికి? ... అబ్బబ్బ.... ప్రాణానికి సుఖం లేదుకదా! ఇంట్లో ఎలాగు వేగి చస్తున్నాను. ఇక బయటకు కూడా ఎక్కడ వెంటబెట్టుకపోను, ఈ దరిద్రపు మూకని''

అంతవరకు ఈ నాటకాన్ని చిద్విలాసంతో వీక్షిస్తున్న మోహనరావుకి ఒళ్ళు మండుకొచ్చింది.

''జానకీ! నీకసలు బుద్ధుందా? పిల్లల్ని పట్టుకొని దరిద్రపుమూక అంటావేంటీ? అరుణా బాబిగాడిని ఇలా తీసుకరామ్మా. మీ అమ్మ కలెక్టరు గారింటికి కదూ వెళ్ళ. మిమ్మల్నందరిని తీసికెళ్తే ఎలాగా?'

"అనండి....మీరు అలా అనక ఇంక ఎలా అంటారు. పట్టుమని పాతికేళ్ళు లేవు....ముగ్గురు పిల్లల తల్లిని. తగుదునమ్మా అని పెత్తనాలకి బయల్దేరడం... నాదే బుద్ధి తక్కువ"

జానకి ఉద్రేకం తెచ్చుకొనడం చూసి.

మోహనరావు మెత్తబడ్డాడు.

"చూడు జానకీ! అనవసరంగా ఆవేశ పడకు. తయారయ్యావుగా.... వెళ్ళిరా, నేను వుంటానుకదా, పిల్లల్ని చూసుకుంటానులే" అంటూ జానకిని సాగనంపాడు.

అరుణని, శశిని దగ్గరికి పిలచి కూచోబెట్టుకున్నాడు మోహనరావు. బాబిగాడు వీపుమీద చేరగిలబడి నాన్నగారి జుట్టుతో ఆడుకోవడం మొదలెట్టాడు. కూతుళ్ళద్దరికి తను ఎప్పుడో చదివిన "రాజకుమార్తె" కథ చెప్పి వాళ్ళని సంతోషపెట్టేసరికి బాబిగాడు నిద్రపోయాడు. వాడిని తీసి పక్కమీద పడుకోపెట్టాడు. అరుణ హోమ్‌వర్క్ చేసుకోడానికి టేబిల్ దగ్గర చేరింది. శశి బొమ్మల పుస్తకం తిరగేస్తూ నాన్న దగ్గరే కూచుంది.

మోహన్‌రావు జానకిని తలచుకొని నిజమే...పాపం పెండ్లయి ఎనిమిది సంవత్సరాలు కూడా కాలేదు. అప్పుడే ముగ్గురు పిల్లలు. ఇంకా నయం, ఈ కుటుంబనియంత్రణ ఒకటి వచ్చి, ఇప్పటికయినా కాస్త తెరపిన బడ్డారు. పెండ్లయినప్పటినుండి పిల్లలు..సంసారం ఎంతో చలాకిగ వున్న జానకి ఎలా తయారయింది! ఏ సరదాలు.... వేడుకలు లేవని పిల్లలమీద విసుక్కుంటూంది, తను మొగవాడు. అలా బయట తిరిగొస్తాడు. కాని, ఆడది అలా కాదుగా! అందుకే ఈరోజు తనే బలవంతం చేసి పంపాడు, స్నేహితురాలు దగ్గరికి వెళ్ళిరమ్మని. ఈనాటి కలెక్టరుగారి సతీమణి అమల, జానకి చిన్ననాటి స్నేహితురాలు.

జానకి పిల్లల్ని కసురుకుంటుందని, మోహనరావుకు కోపం. ఆణిముత్యాల్లాంటి పిల్లలు. ముగ్గురూ మంచి పసిమి, ఆరోగ్యంతో కలకలలాడుతూ వుంటారు బాబిగాడు మరీను. చక్రాలాంటి తన పెద్ద పెద్ద కళ్ళతో చూసేవారిని ఇట్టే ఆకర్షిస్తాడు. ప్రేమగా కొడుకు తల నిమురుతూ మోహనరావు మాగన్నుగ నిద్రలోకి జారుకున్నాడు.

కారు ఆగిన చప్పుడు, తలుపు తెరచిన శబ్దం విని, వులిక్కిపడి కళ్ళు తెరిచాడు. మోహనరావు, "అమ్మొచ్చింది. అమ్మ వచ్చింది....అంటూ అరుణ, శశి బయటకు పరుగెత్తారు. వెళ్ళేటప్పుడే కస్సు బుస్సు మంటూ వెళ్ళింది. ఇక అక్కడ కలెక్టరుగారి ఇంటి వైభవాన్ని చూసి ఇంకెంత చుర్రుబుర్రులాడుతుందో. ఈ భార్యామణి" అని అనుకుంటున్న మోహనరావు, జానకి చేష్టలకు ఆశ్చర్యపోయాడు. శశిని, అరుణని పొదివి పట్టుకొని, ముద్దులిడుతూ ఇంట్లోకి వస్తున్న జానకి మొహంలో ఏదో ఒక అనిర్వచనీయమైన ఆనందం వుట్టి పడుతోంది. క్రొత్త చీర నలిగిపోతూందని ముట్టుకోనివ్వని జానకి, పిల్లలిద్దర్ని అదిమిపట్టు

కొని ఆనందిస్తూంది.

సరాసరి భర్త దగ్గరికి వచ్చిన జానకి "బాబిగాడు చాలా ఏడ్చాడాండీ!...పాపిష్టి దాన్ని పిల్లల్ని ఏడిపించి వెళ్ళాను" అంటూ వాడి పక్కన కూచుని బాబు వీపు నిమురుతోంది. మోహనరావుకు ఇదంతా ఒక కలలాగా తోచింది. 'ఇందులో ఏదో విశేషమే వుంది!' అనుకున్నాడు. "సరే, ఎలాగూ చెపుతుందిలే" అనుకుని, "బాబిగాడు లేచేలోపల అన్నం తిందాం, రండర్రా కన్నతల్లులూ! అంటూ పిల్లల్ని పిలిచి, భార్యతో సహా లోపలికి వెళ్ళాడు, మోహనరావు.

భోజనాలయ్యాక, బాబిగాడికి పాలు పట్టి, పిల్లలకు పక్కలు సర్ది, భర్తదగ్గరికి వచ్చింది జానకి.

మోహనరావు భార్యవేపు ప్రశ్నార్థంగా చూసాడు 'విశేషాలేమిటి?'' అన్నట్లు.

"ముందు నన్ను మీరు అభినందించాలి" ఈరోజు నేను ఒక నిజం తెలుసుకున్నాను'' అంది జానకి.

"అభినందనలు తరువాతా....అసలు విషయానికి రా' అంటూ మోహనరావు, జానకి చేయిపట్టుకలాగి ప్రక్కన కూచోబెట్టుకున్నాడు.

తాను అమల వాళ్ళింటికి వెళ్ళింది మొదలు జరిగిన విషయాలన్ని పూస గ్రుచ్చినట్లు చెప్పడం మొదలెట్టింది జానకి.

* *

'అత్యంత అధునాతనంగా కట్టబడిన బంగళాలోనికి రివ్వున దూసుకుపోయి ఆగిపోయింది కారు. ఆ బంగళా సౌందర్యానికి ఆశ్చర్యపోయిన నేను ఇంటిలోని అలంకరణను చూసి మరింత విభ్రాంతురాలినయ్యాను. ఎందుకంటారా! అంత అందంగ, కళాత్మకంగ ఫర్నిచరు, కర్టెనులు, గోడలమీద పెయింటింగ్సు...



అబ్బో! ఇంత అని చెప్పలేం, ఆ సౌందర్యం''

"నువ్వు.... నీ చిన్ని పర్ణశాలను ఆ భవనంతో పోల్చుకొని బాధపడ్డావు.... అంతేనా!' జానకి చేతిగాజులను సవరిస్తూ మధ్యలో అడ్డుతగిలాడు మోహనరావు.

చిరునవ్వుతో భర్తను చూసిన జానకి

"ఆ మాట నిజమేనండి. నేను అమల ఐశ్వర్యాన్ని, అధునాతన ఆడంబర జీవితాన్ని చూచి ఈర్ష్యపడ్డాను. తర్వాత ఏమయిందనుకున్నారు? అమల నన్ను ఎంతో మర్యాద చేసింది. ఎంత కలెక్టరు భార్య అయినా, చిన్ననాటి స్నేహితురాలు కదా! ఇల్లంతా చూపించింది. తోటలోని వివిధ జాతి మొక్కలను ఎక్కడెక్కడినుంచి ఎంతెంత వెచ్చించి తెప్పించారో వింటూంటే తన అదృష్టానికి నాకు అసూయ కలిగినంత పని అయింది. కాఫీ, టిఫిన్ తీసుకొమ్మని డ్రెస్సింగురూములోకి తీసుకెళ్ళింది. ఇంతలోకి ఒక నాలుగేండ్ల పాప పరుగెత్తుకుంటూ అమల దగ్గరికి వచ్చింది. నేను ఆ పిల్లను చూసి తెల్లపోయాను. ఎందుకంటారా! నల్లగా బొద్దుగా....అసలు అమల పోలిక ఏమాత్రం లేదు కదా! ఎలాగోవుంది ఆ పిల్ల. "ఎవరీ పిల్ల" అన్నట్లు చూసాను అమలవేపు. అమల మొహం చిన్నపోయింది. 'మా పనిమనిషి కూతురు— సరేలే, రా టిఫిన్ తీసుకుందాం' అంది అమల.

నాకు అప్పుడు గుర్తుకొచ్చింది అమలకి పిల్లలు లేరని, అందుకే యిల్లు అంత శుభ్రంగా వుంది. 'మా యిల్లు చూడు— ఎన్నిమార్లు శుభ్రపరచినా పిల్లలు నానాయాగీ చేసిపెడతారు. అబ్బబ్బ వెధవ సంత అనుకో; చస్తున్నాను. ఈ పిల్లలతో అన్నాను. అమల గబగబ నన్ను వాదిస్తూ "అలా అనకు జానకీ! పిల్లలు వరప్రసాదితులు నేనుకూడా పెండ్లయిన క్రొత్తలో ఇప్పుడే ఏం పిల్లలు అనుకొన్నాను. కానీ నాలుగేండ్లు పిల్లలు కలుగక పోయేటప్పటికి పిల్లలో అని అరవాలనిపించింది. ఆ డాక్టరూ, ఈ డాక్టరు అని—తిరిగేటప్పటికి తేలింది, నాకు సంతానం కలిగే యోగం లేదని"

నాకు అమలను చూస్తే జాలేసింది. ఉండబట్టలేక "ఎవరినైనా తెచ్చి పెంచుకోకూడదా" అన్నాను.

"ఆ ముచ్చటా తీరింది జానకీ! బంధువుల పిల్లలయితే బాగుండదని అనాధ ఆశ్రమమునుండి తెచ్చి పెంచుకున్నాము. పండంటి పిల్లవాడు. నెల తిరిగేటప్పటికి, న్యూమోనియో వచ్చిపోయాడు. పాపం! కనీసం ఆ అనాధ ఆశ్రమంలో వున్నా బ్రతికేవాడేమో." కండ్లనీరు పెట్టుకుంటున్న అమలను చూస్తే, నాకు కడుపులో దేవినట్లయింది. బాహ్యరూపాన్ని చూసి నేను ఎంత మోసపోయాను. అమల నిజంగ ఎంత దురదృష్టవంతురాలు, పొరుగింటిపిల్లనో, పనిపిల్లలనో చేరదీస్తుందట. కాని అమల భర్త కిది ఇష్టం లేదట.

అమలను చూచి ఎంతో ఈర్ష్యపడ్డాను ముందుగా. కానీ, అమలకన్న నేను ఎంత అదృష్టవంతురాలనో తెలిసివచ్చింది. ముత్యాల్లాంటి పిల్లలు. భగవంతుడిచ్చిన వరాలు. చేతిలోవున్న మాణిక్యాలను నేను ఇన్నాళ్ళు నిరసించాను.'

జానకికి ఏమొచ్చినా పట్టలేం. ఆ విషయం తెలిసిన మోహనరావు, 'అయితే నీవు అదృష్టవంతురాలివి. నీ పిల్లలు మాణిక్యాలు. మరి నేనో!!" అన్నాడు చిలిపిగా జానకి కళ్లలోకి చూస్తూ.

"మీరా? మీరే నా సర్వస్వం. ఠీవిగా అంది జానకి, వయ్యారం ఒలకపోస్తూ.

—



# మొండి వాడు



కొడవటిగంటి కుటుంబరావు



ఆ సాయంకాలం మూడు గంటలకు. డ్రాయింగు పరీక్షతో, ఆ సంవత్సరానికి స్కూలు మూయబడుతుంది. డిసెంబరు శలవులు ప్రారంభ మవుతై. ఇది స్కూలువారి లెక్కప్రకారం.

సరిగా రెండుగంటలా పదిహేను నిమిషాలకు పరీక్షలు జరుగుతూన్న హాలులో ఒక పన్నెండేళ్ళ విద్యార్థి లేచి నిలుచున్నాడు.

"ఏం కావాలి?" అన్నాడు వాచరు ఆవలిస్తూ, డ్రాయింగు పరీక్షలంటే వాచర్లకు నిద్రవస్తుంది.

"నేను బొమ్మ వెయ్యటం అయిందండి" అన్నాడు విద్యార్థి.

"అప్పుడే! పదిహేను నిముషాలన్నా కాలేదింకా?"

"నేను బొమ్మ వెయ్యటం అయిందండి."

వాచరుగారు మళ్ళీ ఆవలించి, కుర్చీ లోనించి లేచి, విద్యార్థి దగ్గరికి వచ్చి "ఏదీ? చూడనీ!" అని కాగితం తీసు తీసుకున్నాడు ఆయనకు నవ్వు ఆగలేదు, "ఇదేమిటో నీకైనా తెలుసునా? '

'నాకూ తెలియదండీ. పెట్టె బొమ్మ గీయబోతే నవారు మంచం మాదిరిగా తయారయిందండీ. బాగుచెయ్యబోయిన కొద్దీ ఇంకానవారు అల్లినట్టయిందిగాని పెట్టెమాదిరిగా కానేలేదండీ.'

"నువ్వు కొంచెం అతిగా మాట్లాడు తావు కాదూ?" అన్నాడు వాచరుగారు నవ్వటం మానేసి.

'అవునండీ.'

వాచరునోట మాటరాలేదు. చివరకు ఆయన ఉగ్రంగా "అరగంట దాకా నువ్వు హాలులోనించి కదలకూడదు, కూచో. '

"నేనెవరికి కాపీ అందివ్వనండీ." అంటూ విద్యార్థి పెనసలు జేబులో పెట్టు కుని ప్రయాణమైనాడు,

మళ్ళీ కుర్చీలో కూర్చొని దవడలు పడిపోయేటట్టు ఆవలించే సంకల్పంతో వెనక్కుతిరిగిన వాచరుగారు "ఏయ్!" అని అరిచాడు. హాలంతా మారుపలకింది,

విద్యార్థి ఆగి, "నన్నేనండీ?" అన్నాడు,

"కూర్చో, అట్లా."

"నేను పోతున్నానండీ,"

"నేను వద్దని చెప్పలేదూ?"

"నేను పోతున్నానండీ!.... నన్ను ఆబ్సెంటు రాసుకోండి."

వాచరుగారికి ఎటూ పాలుపోలేదు. వెళ్ళి కుర్చీలో కూర్చొని ఆవలించటమో, వచ్చి పిల్లవాడిగూబ మెలివెయ్యటమో! ఆయన్ను ఈ సమస్య బాధిస్తూండగానే విద్యార్థి హాలుదాటి బయటికి వెళ్ళిపోయి నాడు.

బయట వరండాలో ఒక బెంచీమీద కూర్చొని ఒక మాసపత్రికలో పద్యాలు చదువుకుంటున్నాడు డ్రాయింగు మేష్టరు గారు. చకా చకా వెళుతున్న విద్యార్థివంక ఆయన కళ్ళజోడు మీదుగాచూసి "ఏంరా, రాముడూ? అప్పుడే అయిందీ?" అన్నాడు.

విద్యార్థి ఆయన ఎదురుగా ఆగి 'కాలేదండీ' అన్నాడు.

"ఎక్కడికి పోతున్నావు?"

"ఇంటికండి."

డ్రాయింగు మేష్టరుగారు నవ్వాడు.

"ఓరివెధవా! నేను సంతోషించే టందు కయినా ఇంకాస్సేపు బొమ్మ వేస్తు న్నట్టు నటించకూడదూ? అప్పుడే ఇంటికి పోయి ఏం చేస్తావు?"

"ఇవాళ కాలవకుపోయి ఈత నేర్చు కోవాలండి!"

'ఈతా? జానెడు వెధవ్వి నీకీత ఏమిట్రా? పోబోకు కాలవకు."

"కాలవకు పోతానండి."

"మొండివెధవా!....ఎవరినన్నా పెద్ద వాళ్లను వెంట తీసుకుపో సుమా! కాలవ

లోతుగా ఉంటుంది! భద్రం!''

ఠీవిగా తలఎత్తుకుని పోతూన్న రాముడి వంక డ్రాయింగు మేష్టరుగారు ఆశతో చూశాడు. ఆయనకూతురు సావిత్రి ఆరే ళ్లది. ఇద్దరూ ఎంత ఈడుజోడుగా ఉంటారు!

* *

రాముడు కాలవకట్టకు వెళ్ళి, అక్కడ ఒక ఎత్తయిన గానుగుచెట్టు చివారు కొమ్మకు ఎక్కి, ఒక పంగలో కూర్చొని ఉయ్యాల ఊగటం మొదలుపెట్టాడు. ఇంకా కుర్రాళ్లు ఎవరూ రాలేదు. రాముడు గొంతెత్తి పాడటం మొదలుపెట్టాడు.

" అబలా-యిటులా-వసులా-వెడలా-అతిసుల-భంబని-యెంచితి-వా''

బాగుంది, మైలవరంవాళ్ల "సావిత్రి"! ఆ యముడు!

"పో, బాల-పొమ్మిక-ఒహో బాల-పొమ్మిక!" దీనికి తాళప్రకారం ఊపు రావటంలేదు, అబలా - ఇటులా - అంటే వచ్చినట్టు.

"ఈ యుగ్రా-రణ్యమున-రా, వలదు-రా, తగదు-(రా, చనదు ?) - నీకుగలదు-రాశ పీడి-పో, బాల-పో, బాల-పో, బాల-ఒహో బాల-ఒహో బాల!——''

సావిత్రి అంత పిరికిదనా, యముడి నమ్మకం! మొత్తానికి సావిత్రి భలే మొండిది! దేవతలు మెచ్చారు సావిత్రి మొండితనానికి!....తన్నుకూడా అంతా మొండివాడనే అంట్లారు——తన మొండి తనానిక్కూడా దేవతలు మెచ్చుకుంటా రేమో!....

"ఓ చెట్టుమీది యమధర్మరాజా! పాట అపావేం?'

రాముడు కొమ్మల సందునించి కింద నుంచుని ఉన్న సుబ్బారావును చూశాడు.

"సుబ్బారావు!''

"ఏంరా, రామనాథం!''

"ఇంకా ఎవరూ రాలా?''

"వచ్చారు, వాళ్లంతా వెనకపడి బొమ్మ జెముడుపళ్లు కోసుకు తింటున్నారు.'

"ఎందుకూ?''

"ఎందుకేమిటి? నోళ్లు నెత్తురు తాగి నట్టు ఉండటానికి.''

రాముడు కాస్సేపు ఆలోచించాడు.

"చూశావా, చిత్రం?''

"ఏమిటి?''

"నెత్తురు తాగినవాడు నోరు ఎర్రగా ఉండకపోవచ్చు.''

"ఎందుచేతనో!'

'మనం పాలుతాగితే నోరంతా తెల్లగా ఉంటుందా? గోంగూర తింటే నల్లగా ఉంటుందా?''

"ఏడిచావులే, కిందికి దిగిరా.'

రాముడు లాగుజేబులోనించి గోచీగుడ్డ తీసి చూసుకుని, తృప్తిపడి, మళ్ళీ జేబులోపెట్టి, మెల్లిగా చెట్టుదిగటం మొదలుపెట్టాడు.

కొద్దిసేపట్లో కాలవకట్టన ఏడెనిమిది కుర్రాళ్లు చేరారు. ఒకరి తరవాత ఒకరు

చొక్కాలాగులు విడిచేసి గోచీలు పెట్టుకుని ఎగిరి కాలవలో దూకటం మొదలుపెట్టారు. ఈతరానివాళ్లు కొంచెం పైకి వెళ్ళి లోతులేనిచోట దిగి నడుములోతు నీటిలో నుంచుని, ఈత వచ్చినవాళ్లకంటె ఎక్కువ చప్పుడుచేస్తూ నీరంతా కెలుకులు చేస్తున్నారు.

రాముడు గోచీతో తయారై ఈత వచ్చినవాళ్లు దిగిన రేవుదగ్గిర నిలబడ్డాడు.

"నీవుకూడా పైకివెళ్ళి గడ్డపార ఈత ఈదరాదుట్రా?" అన్నాడు సుబ్బారావు.

"ఇక్కడ చాలా లోతా?"

"చాలా! నీకు రెండింతలుంటుంది మడుగు."

"ఏదీ, ఇటునుంచి అటు చెయ్యి పైకెత్తి, ఈదకుండా నడిచి చూపించు."

"ఓ!" అంటూ సుబ్బారావు ఒక చెయ్యి పైకెత్తి కాలవను ఇటునించి అటు దాటటం మొదలుపెట్టాడు. మూడో వంతు దూరం వెళ్లగానే సుబ్బారావు ముక్కు నీటి అడుక్కిపోయింది. సుబ్బారావు ముక్కు మునగగానే రాముడు చేత్తో తనముక్కు మూసుకున్నాడు. అవతలి ఒడ్డుకు సామీప్యంలో సుబ్బారావు తల మళ్ళీ నీటిపైకి వచ్చింది.

"చూశావా?" అన్నాడు సుబ్బారావు రొప్పుతూ.

"చూశాను," అన్నాడు రాముడు కూడా ముక్కును వదిలిపెట్టి రొప్పుతూ. రొప్పు తగ్గిపోగానే రాముడుకూడా మెల్లిగా కాలవలో దిగటం మొదలుపెట్టాడు.

"వాడు చస్తాడ్రా!" అని ఎవరో కేకపెట్టారు,

"రాముడూ!" "రామనాథం!" "రామాయ్!" అని అందరూ తలా ఒక పెడబొబ్బ పెట్టారు.

రాముడు మోకాలిలోతు నీళ్లలో ఆగి "ఏమిటోయ్, అట్లా ఉలిక్కిపడతారూ?" అన్నాడు.

"ఎందుకా? చస్తావు!"

"నువు చచ్చావా?"

"నే నెందుకు చస్తానూ? నా కీత వచ్చును!"

"నువు ఈదావా? నీ మాదిరిగా నీళ్లల్లో నడిచి నేను మాత్రం కాలవ దాటలేనూ?"

సుబ్బారావు నిర్ఘాంతపోయి రాముడి వంక చూస్తున్నాడు. ఈ లోపల రాముడు గబగబా కాలవలో దిగిపోతున్నాడు. అతని తల మునిగి పోయింది. అతని గుండె దడదడలాడటం మొదలుపెట్టింది. వెధవ గుండెకు ఎంత భయం! ఉత్త పిరికిగుండె! ఏముంది? ఇట్లాగే ఇంకా నాలుగడుగులు పోతే తనకు కాలవ అందుతుంది. రాముడు నాలుగడుగులు వేశాడు. అందలేదు. అయిదు, ఆరు ఇంకా అందటంలేదు. ఇక ఊపిరి ఆగదు! తల పగిలిపోతున్నది. ముక్కు వదిలి పెట్టాలిసిందే. ఇంకొక్క రెండడుగులు! ఒకటి, రెండు! రాముడి అవస్థ వర్ణనాతీతం! ఇక తన ప్రాణం




పోయిందనుకున్నాడు. చేతులూ, కాళ్లూ వణుకుతున్నై. గిలగిలా కొట్టుకోవాలని ప్రయత్నం చేస్తున్నై. అధైర్యపడితే లాభంలేదు. ఒక చెయ్యి పైకెత్తాడు. చెయ్యి నీళ్ళమీద ఎంత ఉందో తెలియలేదు, చేతిని ఊపాడు. గాలిలో ఆడినట్టే ఆడింది. చల్లగాలి చేతికి తగిలింది. అమ్మయ్య! ఒక్కసారిగా అతని ముక్కుల్లోకీ, నోట్లోకీ మానెడు నీళ్ళు పోయినట్టు పోయినై. ఇంకా పోతున్నై. అతనికి స్మృతి తప్పింది. ఎవరో వచ్చి తను పైకెత్తిన చెయ్యి పట్టుకోవటం కూడా అతనికి తెలియదు.

"ఏమండోయ్! ఇవాళ్ళ మీ వాడికి పెద్ద గండం తప్పిందండీ! మేం వద్దని కేకలు పెడుతున్నా వినిపించుకోకుండా ఈతరానివాడు కాలవలో దిగాడండీ! మేం ఎంత వెతికినా ఎక్కడా కనబడలేదు. అవతల ఎక్కడో తేలి చెయ్యి పైకెత్తాడండీ! అప్పుడు మేం వెళ్ళి వాణ్ణి బయటికిలాగి పొట్టమీద కూచుని నీళ్లు కక్కించామండీ!' అన్నారు స్నేహితులు రాముణ్ణి ఇంటిదగ్గర దిగవిడుస్తూ.

"గుండంలోనించి సరిగానే నడిచి వచ్చినవాణ్ణి, మోకాటిలోతు నీళ్లల్లో వచ్చేటంత పని అయిందమ్మా! తమాషా!... ఎటు పోతున్నానో తెలీక కాలవలో ఉత్తర దక్షిణాలుగా నడిచివుంటా. లేకపోతేనా....' అన్నాడు రాముడు తల్లితో.

ఆవిడ తెరిచిన నోరు తెరిచినట్టుగానే ఉండిపోయింది.

* *

స్కూలుఫైనలు క్లాసులో సైన్సు మేష్టరుగారు ఉత్సాహం కొద్దీ పిల్లకాయలకు అవసరమైన శాస్త్ర చర్చచేస్తున్నాడు.

'పదార్థముల యొక్క చర్య మహా

విచిత్రంగా ఉంటుంది!....రెండు అద్దపు ముక్కలు తీసుకొని అందులో ఒకదాని మీద ఒక నీటిబొట్టు వేసి రెండవది మొదటిదానిమీద పెట్టి ఒత్తి, రెంటిమధ్యా అణుమాత్రమైనా గాలిలేని నీటిపొర ఒకటి కలిగించి నట్టయితే, ఆ రెండు అద్దపు ముక్కలనూ పగలదీయటానికి అనేక ఏనుగుల బలం కావాలి; కాని ఒక దానిమీద ఒకటి సులభంగా జారిపస్తుంది!

'చిన్న పిల్లలను కొంచెం పెద్దపిల్లలు 'వీశెడు దూది ఎక్కువ బరువా? వీశెడు ఇనుము ఎక్కువ బరువా?' అని అడుగుతుంటారు. చిన్నపిల్లలు వీశెడు ఇనుమే ఎక్కువనుకుంటారు. పెద్దపిల్లలు సమానమనుకుంటారు. నిజం మీలో ఎవరికైనా తెలుసునా? .... వీశెడు దూదే ఎక్కువ బరువు. దానిలోనే ఇనుములోకంటే 'మాస్' ఎక్కువ వుంది, అయితే రెండూ సమంగా ఎందుకు తూగుతై? గాలిదూదిని ఎక్కువగా తేలిక చేస్తుంది, ఇనుమునుకంటే! ఎందువల్ల? దూది పరిమాణం ఎక్కువ కనక. మనిషి పరిమాణం ఏదో ఉపాయంచేత ఉన్న దానికి అనేక రెట్లుచేసి మనిషి బరువు మాత్రం మార్చకుండా ఉంటే, మనిషి గాలిలో తేలిపోతాడు.... ...ఇప్పుడిప్పుడు విమానాల మీదనుంచి పెద్దపెద్ద గొడుగ్గుడ్డలంటివి ఉపయోగించి గాలిలో దిగివస్తున్నారట! ఆ గొడుగుగుడ్డ తెరుచుకుని మనిషియొక్క పరిమాణం పెద్దది చేస్తుందన్నమాట!....''

రాముడు సైన్స్ మేష్టరు చెప్పే విషయాలు ఎంతో శ్రద్ధగా వింటున్నాడు. రెండు అద్దాలమధ్య సన్నని నీటిపొర ఒకటి కల్పించి కేవలం దానిపట్టుమీద అడుగు అద్దముక్కను పట్టుకుని ఆకాశంలో మూడుమైళ్ళ ఎత్తున తను వేళ్ళాడుతున్నట్టూ, క్రమేపీ ఆ నీటిపొర ఇగిరిపోతూండటంచేత తను అంత ఎత్తునించీ భూమిమీదికి పడటానికి సిద్ధంగా ఉన్నట్టూ, యింతలో తనచేతికి ఎవరో గొడుగుగుడ్డ యివ్వగా దాని సహాయంవల్ల తను నెమ్మదిగా, చిన్న ఈకమాదిరిగా దిగివచ్చినట్టూ ఆ చివర నాలుగంగుళాలు దిగటానికే నాలుగు నిమిషాలు పట్టినట్టూ!—అతను ఊహించుకొంటున్నాడు.

అనుకున్నదంతా ఆచరణలో పెట్టటం ఎవరితరమూ కాదు; కొంతవరకైనా చేసి చూతామనుకున్నాడు రాముడు.

ఇంటో తన గొడుగు ఒకటుంది. అదికాక, వాళ్ళనాన్న ఎన్నడో కొని మూలపారేసిన పాతగొడుగు మరొకటుంది. ఆరెంటి సహాయంతో తను ఇంటికప్పు మీదినుంచి నేలమీదికి అవతరించుదా మనుకున్నాడు రాముడు. ఆ రెండు గొడుగులూ చంకనపెట్టుకుని నిచ్చెనమీదిగా అతను ఇంటికప్పుకు ఎక్కాడు. రెండుగొడుగులూ తెరిచి చెరొకచేత్తోనూ పట్టుకుని వాటిని గాలిలో అటూ ఇటూ ఊపాడు. మొత్తంమీద గొడుగులు 'గాలిని పట్టుకో'

గలుగుతున్నై. కాని బరువును మోయ గలవా ?

అతను రెండోఫారం చదువుతూ వుండగా అతనికి పరీక్షలో తెనిగించ టానికి ఒక ఇంగ్లీషు పద్యం ఇచ్చారు. అందులో, ఒక కుర్రవాడు గొడుగు వేసుకుని పెద్ద గాలివానలోకి రాగానే ఆ పిల్లవాణ్ణి వాయుదేవుడు ఎక్కడికో ఎత్తుకు పోతాడు—ఆ గొడుగు సహాయంతో.

తన్ను వాయుదేవుడు ఎక్కడికీ ఎత్తుకు పోనక్కర్లేదు. పేడకడి పడ్డట్టు కాకుండా, తను ఉపాయంగా ఈ కప్పు మీదినించి ఆ నేలమీదికి గద్ద వాలినట్టు వాలితే చాలును, ఒక గొడుగుకాదు, రెండు గొడుగుల సహాయంతో !

రాముడి గుండెలు 'వద్దు, వద్దు, వద్దు' అని కొట్టుకుంటూనే ఉన్నై. కాని వెధవ గుండెలకు లెక్క చేసేదేమిటి ? ఊపిరి బిగబట్టి, రెండుగొడుగులూ రెండుచేతు ల్లోనూ గట్టిగా పట్టుకుని, ఇంటి కప్పు చివరనించి రాముడు గాలిలోకి ఒక్క ఎగురు ఎగిరాడు !

పడటానికి సంసిద్ధుడై ఉంటే అంత దెబ్బతినేవాడుకాడు రాముడు ! కాని, ఏం జరిగిందంటే, వెధవది, ఒక్కరవ్వకూడా అనుకున్నట్టు జరగలేదు. ఏం చెయ్యాలి? ....ఆ వెధవ పాతగొడుగు టప్మని విరిగి, పై భాగం గాలిలో తేలిపోయి, చేతులో కర్ర మిగిలింది. రెండోది పటుక్కున వెనక్కు మణిగింది....

"ఆచే దెబ్బతగల్లేదు. ఉత్తబెణుకే ! ఎక్కడా ఎముకలు విరగలేదు. వారం రోజులు మంచంలో కళ్ళుమూసుకు పడు కుంటే అదే సరి అవుతుంది," అన్నాడు డాక్టర్.

పాపం, డ్రాయింగు మేష్టరుగారు అకస్మాత్తుగా పోయినాడు.

"మా సావిత్రికి సంబంధం వెత కనురా, రాముడూ ! అది నీకు రాసి పెట్టి ఉంది. చేసుకుంటావా అనేవాడు ఆయన తనతో....తమాషాకు !

అందచందాల విషయం [illegible] తెలుసుగాని, సావిత్రి తన కళ్ళకు బాగానే ఉంటుంది. సావిత్రిని చూస్తే చాలా సంతోషంగా ఉంటుంది—ఏదో ఇదిగా ఉంటుంది మనస్సులో !

సావిత్రికి పదోఏడు—పెళ్ళియీడు. ఇంకా తనకు పదహారేగా ! నాలుగు సంవత్సరాలదాకా తనకు పెళ్ళిగొడవే ఉండదు....అప్పటికి సావిత్రి కాపరాని క్కూడా పోతుంది!..........సావిత్రివంటి పిల్లలకు మంచి మొగుళ్ళు దొరుకుతారు— చాలా మంచి మొగుళ్ళు !....

చిత్రంగా, ఆరాత్రే అతని తలిదం డ్రులు అతని ఎదట అతని పెళ్ళినిగురించి చాలాసేపు మాటాడారు. అతని నోటిదాకా వచ్చింది, 'పోనీ, నేనూ డ్రాయింగు మేష్టరుగారి అమ్మాయిని పెళ్ళిచేసుకోనా అమ్మా" అందామని. కాని, ఏంలాభం ? పెళ్ళికి బోలెడు గ్రంథం ఉంది ; బోలెడు.

దబ్బుకావాలి. బోలెడంత చాకిరీ. చుట్టా లందర్నీ పిలవటం, పురోహితులనీ భజం త్రీలనీ పిలవటం. అయిదురోజులూ ఎప్పు డేది చెయ్యాలో అది చేయించటం—ఓ! అది పెద్దవాళ్ళ పని. అందులో తనవంటి చిన్న పిల్లకాయలు, అజ్ఞానులు కల్పిం చుకోరాదు. ''నాకు ఆపిల్ల కావాలి!'' అంటే నరా, కష్టసుఖాలు తెలియకుండా?

రాముడి ఈ ఆలోచనల్లో ఇమిడిఉన్న "ట్రాజెడీ" అందరికీ సులభంగానే అర్థ మవుతుంది. అయితే అందులో కొంత విజంకూడా లేకపోలేదు. ఒక పిల్లకూ పిల్లవాడికీ ముడిపెట్టాలంటే ఎన్ని సంద ర్భాలు కలిసిరావాలో అతనికేం తెలు స్తుంది? అతనికి సావిత్రికంటె మంచి పిల్ల కనిపి లేదు పెళ్లాడడానికి. ఆమాట అతను తలిదండ్రులకు చెబితే వాళ్ళు పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వి ఉండేవాళ్లు. వాళ్ళు అట్లా నవ్వనినాడు మనజాతి పెద్ద సాంఘిక విప్లవానికి సిద్ధంగా ఉన్నదన్న మాటే!

చచ్చిపోయిన డ్రాయింగు మేష్టరుది పురోహితుల వంశం. ఆయన తండ్రి యాచనావృత్తితో కాలం వెళ్ళబుచ్చాడు. సావిత్రి మాతామహుడు ఇంకా తద్దినాలూ అవీ పెట్టిస్తున్నాడు. మనుష్యమాత్రుడికి తెలిసినంతవరకూ సావిత్రి తలిదండ్రుల మేష్తు వాళ్ళకు ఆస్తిపాస్తు లుండటమూ, ఏదోవిధమైన యాచనలేకుండా ఉండటమూ లేవు. రాముడు వ్యాపారిపిల్లను చేసు కుంటానంటే ఎంత హాస్యాస్పదంగా ఉండిఉండేదో'' సావిత్రిని చేసుకుంటా నన్నా అంత హాస్యాస్పదంగానే ఉండేది.

మరి రాముడి పితామహుండి ప్రపితా మహుండు రెండువేల ఎకరాల భూమి తాంబూలంతో పుచ్చుకున్నాడు, తన అస మాన పాండిత్యానికి బహుమానంగా. రాముడి పితామహుణ్ణికూడా జమీందారు గారనే పిలిచేవారు.

తరవాత కొద్దికాలానికే రాముడికి పెళ్ళి కుదిరింది. ఏటి అవతలనించి వెంక టేశ్వరశాస్త్రిగారు పిల్లనిస్తానంటూ వచ్చాడు. రాముడికి మూడుసంచులు కట్నం కురిపించి, తదితర లాంఛనాలకింద మరో రెండుసంచులు ఒలకబోసి, పెళ్ళి ఖర్చుల కింద మరి రెండుసంచులు ఖాళీచేసి తన కూతుర్ని, మహాలక్ష్మిని రాముడికి కన్యా దానంచేసి, పల్లెటూరిలో అయినప్పటికీ పెళ్ళి మహావైభవంగా చేసి ఆయన తరిం చినవా డయినాడు. ఉభయపక్షాలవారికీ పరి పూర్ణమయిన ఆనందమయింది.

పెళ్లిఅయిన కొద్దిరోజులకే కాలేజీలో ప్రవేశించడానికి రాముడు పట్నం వెళ్ళి పోయినాడు.

ఆ డిశంబరు శలవులకు అతను అత్త వారి ఊరువెళ్లి, ఆ మట్టికొంపల మధ్య, ఆ పశువులమధ్య, ఆ చొప్పా, కుడితీ, పేడా పగైరాలమధ్య తన మహాలక్ష్మిని చూసుకోగానే అతని మనోనేత్రం మొదటి సారి తెరుచుకున్నట్టయింది. తన భార్యా




సాక్షాత్తూ పశువుకాదేమో కాని, అంతకంటె ఆటే ఎక్కువస్థితిలో లేదు.... సావిత్రి ? చూడటానికి కళ్ళేకావాలి కాని, సావిత్రిలో దేవత్వం ఉంది! ఉన్నదని తెలుసుకోటానికి నిదర్శనాలూ, పరీక్షలూ అవసరంలేదు.

ఇంకా సావిత్రికి పెళ్ళికాలేదనీ, ఒక పింఛను పుచ్చుకున్న తాశీల్దారుగారు (షష్టి పూర్తికాలేదు) ఆ పిల్లను చేసుకోటానికి కుతూహల పడుతున్నాడనీ, బహుశా త్వరలోనే వివాహం జరగవచ్చుననీ తెలియవచ్చింది.

పట్నం బయలుదేరే రోజున రామనాథం డ్రాయింగు మేష్టరుగారి ఇంటివేపు వెళ్లాడు. వాకిలి తలుపు వేసివుంది. అతను కొంతదూరం పైకివెళ్లి మళ్ళీ అట్టే వచ్చాడు. వాకిట్లో అదృష్టవశాత్తూ సావిత్రే నుంచునివుంది. అతను లోపలికి వెళ్ళేవాడల్లే ఆగాడు. సావిత్రి అతన్ని పలకరించబోయే దానల్లే నోరు తెరిచింది. తీరా ఆమె నోటివెంట మాటా రాలేదు, అతను లోపలికి వెళ్లాలేదు—సాగిపోయినాడు తన ఇంటివేపు.

అదివరకు బయలుగా ఉన్నచోట ఇప్పుడు పెద్దగోడ నిర్మించినట్టయింది. ఒకప్పు డతను డ్రాయింగు మేష్టరుగారింటికి సొంత ఇంటికి పోయినట్టు పోయేవాడు. ఒకప్పుడు సావిత్రి తనతో ఎంతో స్వేచ్ఛగా మాట్లాడేది. అతని కాళ్ళకేదో అడ్డం పడ్డట్టయింది. బహుశా అదే సావిత్రి నోటికీ అడ్డం పడివుంటుంది!

అంతలో అతనికి ఎక్కడలేని ఆగ్రహమూ వచ్చింది—ఆ కనపడని గోడ మీద, తనకాళ్ళనూ సావిత్రినోటినీ కట్టే

సిన ఆ ప్రతిబంధకమ్మీద. అతను చప్పున ఆగి, చర్రున వెనక్కి తిరిగి, తిరిగివచ్చి యెకాయెకీని డ్రాయింగు మేష్టరుగారి యింట్లో ప్రవేశించి "సావిత్రీ!" అని పిలిచాడు.

అతని హృదయం తన అసమ్మతిని సూచిస్తూ గిలగిలా కొట్టుకున్నది. కాని, రామనాథం తన పిచ్చి హృదయాన్ని—పిరికిగుండెను లక్ష్యపెట్ట దలచుకోలేదు.

సావిత్రి అతను నిలబడ్డ వసారాలోకి వచ్చి అతన్నిచూసి నవ్వింది. ఆమెనవ్వు అర్థమై అతనూ నవ్వాడు.

"రా! లోపలికి రాబోయి మానేశావేం?" అన్నది సావిత్రి, అతనికి ఏ విధమైన బాధా కలగటానికి వీలులేని గొంతుతో.

అతను ఆమెను మళ్ళీ అటువంటి ప్రశ్నే వెయ్యక, "నువు పలకరిస్తే వద్దామనుకున్నాను." అన్నాడు. ఇద్దరూ మళ్ళీ నవ్వారు.

"నేను మేష్టరుగారు పోయినతరవాత ఈ ఇంటో అడుగుపెట్టలేదు. ఏదో బంధం తెగిపోయినట్టు భావించుకున్నాను. పొరపాటున....సంవత్సరం! నిండా ఒక్క సంవత్సరం!" అన్నాడతను, ఒక నులక మంచం వాల్చుకొని కూర్చొని.

"అవును! వారంరోజులయింది మా నాన్న ఏడూరి వెళ్లిపోయి, కిందటి శని వారం! .... శలవులకు వచ్చావా? .... నీ పెళ్ళి గృహప్రవేశపు ఊరేగింపు చూశాను."

రామనాథాన్ని కొరడాతో కొట్టినట్టయింది.

"నిన్నెవరూ పిలవలేదు కామూ? నేనూ మరచిపోయినాను —పెళ్లిసంబరంలో!" అన్నాడతను తన్ను తనే గాయం చేసుకుంటూ.

"ఓస్! దీనికేనా?"

"కాదూ?" అన్నాడతను, ఇంకా తన్ను తను ఏమాత్రమూ క్షమించుకోలేకుండా.

"ఒక్కత్తెనే అయిపోయినాను గాని, పిలవకుండా రాకూడదా?"

"అవును సావిత్రీ నీ పెళ్ళి ఎప్పుడో తెలియజేస్తే నేను పట్నంనించి పిలుపు అవసరం లేకుండానే వస్తాను!"

ఆమాట నోరుజారివచ్చిన మరుక్షణం అందులో హాస్యం అతనికి అర్థమై నవ్వాడు. సావిత్రి పరధ్యానంగా ఉండి నవ్వలేదు.

రెండుమూడు నిమిషాలపాటు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు.

"పోయివస్తాను, సావిత్రీ, నేను సాయంకాలం బండికి వెళ్ళిపోతున్నాను పట్నం."

అతను లేచాడు, ఆమె కూడా తన పరధ్యానం కట్టిపెట్టి లేచింది, ఇద్దరూ బయటికి వచ్చారు, అతనుముందూ ఆమె వెనకా.

ఆమె వాకిట్లో ఆగింది. అతను వీధి

లోకి వెళ్లి నుంచున్నాడు.

"వస్తాను!" అన్నాడు రామనాధం. "సావిత్రీ" అనటానికి అతని కెందుకో నోరురాలేదు. "ఇక ఈ మనిషిని నేను చూడను!" అన్న నమ్మకం ఒకటి అతని అంతరాత్మకు కలిగిపోయింది.

సావిత్రి ఏదో అనటానికి నోరు తెరిచింది ఆమె నోటివెంట ఏమీ రాలేదు. రామనాధం ఒక అడుగు ఆమెవేపు వేసి ఆమెచెయ్యి అయినా చివరిసారి పట్టుకుందా మనుకున్నాడు. అతనికి కాలు కదలలేదు.

బరువెక్కిన హృదయంతో అతను ఇంటివేపు సాగిపోయినాడు.

* *



మహాలక్ష్మి కాపరానికి వచ్చి రెండు నెలలు కాలేదింకా. ఆ పిల్లతత్వం రామనాధానికి ఒక్క రవ్వయినా బోధపడలేదు. —కొన్నాళ్ళపాటు, తన భార్యా బహు నిబ్బరమయిన మనిషి అనీ, ఆపేక్ష అంతః కరణలు పైకి కనబడనివ్వని మనిషి అనీ అతను తన భార్యను సమర్థించుకొన్నాడు. తనకూ ఆమెకూ మనస్సులు కలిసినకొద్దీ అవన్నీ వాటంతట అవే బయట పడత వనికూడా విశ్వసించాడు. కాని, రోజులు గడిచినకొద్దీ ఆమెలో ఆపేక్ష అతః కరణలు అసలు లేవనే అనుమానం అతన్ని బాధించసాగింది. ఆమె పశుతుల్య కావచ్చును. ఒక్కమాటతో, ఒక్క చూపుతో భావప్రకటన, ప్రేమప్రకటన చెయ్యటం ఆమెకు చాతకాకపోవచ్చును—మ యిన పల్లెటూరి పెంపకం కనక! కాని కేవలమూ శరీరాలకే సంబంధించిన దాంపత్య సుఖం అనుభవించటానికి పశుత్వంతో సంబంధం ఏమిటి? పశువులు సుఖించగలగటం లేదూ? తన భార్యకు అదైనా ఎందుకు చాతకాదో!

తనకు మొగుడితో ఎటువంటి అవసరమూ లేనట్టూ, అతనే పాపాత్ముడై తన్ను కోరుతున్నట్టూ, అతని పాపాన అతనే పోతాడన్న ఉద్దేశంతో తను తన శరీరం అతనివశం చేస్తున్నట్టూ కనబడేది మహాలక్ష్మి, కొత్తగా కాపరానికి వచ్చిన భార్యతో సుఖపడటానికి అతను ఘోర పాపం చెయ్యవలసినట్టుగా

ఉండటం అతను భరించలేక పోయినాడు. ఆమెకు తనతో ఎటువంటి నిమిత్తమూ లేదా? తను వంద సంవత్సరాలు కనిపించకపోయినా మహాలక్ష్మి జీవితానికి ఎటువంటి కొరవా ఉండదా? ఆరోజు కారోజు గడుస్తున్నకొద్దీ ఉండదనే అతనికి తోచసాగింది. అతని ఆట కట్టుబడిపోయింది. ముందెత్తు ఏమిటో అతనికి తోచలేదు. ఈ విధంగానే బతికివున్న నాలుగు రోజులూ వెళ్ళబుచ్చటం తప్ప!

తనలో ఏదో ఒకరకమైన ఆవేశం ఉందని రుజువుచెయ్యటానికి మహాలక్ష్మి తనతో ఒక్కసారి గట్టిగా పోట్లాడరాదూ? —ఇట్లా మంచుకుండమాదిరిగా ఉండక పోతే!

మహాలక్ష్మికి మనుష్యులయొక్క మంచితనంలో ఏమీ నమ్మకం ఉన్నట్టు కనబడలేదు. ప్రతిమనిషీ అసూయ, క్రోధం, అనృతం మొదలైనవాటితో నిండి ఉన్నట్టుగా ఆమె భావించేది.

ఒకసారి అతను ఆమెతో ఏదో చెబితే మహాలక్ష్మి నమ్మలేదు. ఆమె అనుమానానికి అతను ఆశ్చర్యపోయి "అయితే ఇంత స్వల్ప విషయానికి నీతో అబద్ధ మాడుతానా?' అన్నాడు. "ఓయబ్బో! మీరేం హరిశ్చంద్ర మహారాజులా!' అని ఆమె తిరిగి అడిగింది.

తన అత్తమామలు బాంధవ్యంచేత తనకు శత్రువులని ఆమె నమ్మకం. ఆమె ఆమాట స్పష్టంగా బయటికే అనేది. తన అత్తగారికి తన్ను కోరంటికం పెట్టటానికి మార్గాలు అన్వేషించటం తప్ప వేరే పని ఏమీలేదని! రామనాథం తల్లి అమాయకురాలు. ఆమె మొదట్లో, తన మాటల్లోనించి కోడలులేని గూఢార్థాలు లాగుతుంటే, గుడ్లుపెట్టుకుచూసి, కోడల్ని బొత్తిగా ఏమీ అనకపోతే బాగుండదని "సరేలే! ఇహ సరే!" అని గట్టిగా మందలించి తనపని తను చూసుకునేది. రామనాథం తల్లినిచూసి జాలిపడేవాడు.

రాళ్ళవంటివి అరుగుతై. నలుగురూ ఒకడిచుట్టూ చేరి 'పిచ్చి, పిచ్చి' అంటే నిజంగా మతిపోతుంది. కొంత కాలానికి రామనాథం తల్లిలో పరివర్తన వచ్చింది. కోడలు సన్నగా ఒకటి అంటే ఆవిడ పెద్దగా పది అనటం మొదలుపెట్టింది. పెళ్ళాం ఆడించినట్టు ఆడుతున్నాడనే నెపంమీద రామనాథంకూడా తిట్లుతినటం మొదలుపెట్టాడు.

కాపరానికి వచ్చిన మూడో నెలలో మహాలక్ష్మి మంచం ఎక్కింది. వారాలూ, నెలలూ గడిచినై. ఒకరి తరువాత ఒకరు ఆరుగురు వైద్యులు మారారు. ఆమె జాడ్యం ఎవరికీ అర్థంకాలేదు. మందులకు లొంగలేదు. ఆమె మంచంలో ఎండి వరుగైపోయింది, ఎవరో మనిషి పక్కన ఉండి చాకిరిచెయ్యాలి. అత్తగారు ఆపని చెయ్యటానికి సమ్మతించలేదు. నిజానికి మహాలక్ష్మి ఆమెకు అవకాశంకూడా ఇవ్వలేదు; ఒకసారి అత్తగారు మందు నోట్లో



యువ




పొయ్యబోతే "విషం కలిపావా?" అని అడిగింది!

రామనాథం అత్తవారింటికి ఉత్తరం రాశాడు. మహలక్ష్మి మంచాన పడ్డది కనక ఎవరైనా వచ్చి ఆమెకు ఉపచారం చెయ్యవలసిందని. ఆ ఉత్తరానికి జవాబుగా మహలక్ష్మితల్లి సౌభాగ్యమ్మగారు వచ్చింది, పిల్లలకోడల్లే, ముగ్గురు మనమలనూ ఇద్దరు మనమరాళ్ళనూ వెంట వేసుకొని.

సౌభాగ్యమ్మగారు ఇంట్లో అడుగుపెట్టగానే రామనాథం ఇల్లంతా తారుమారయింది. రామనాథానికి తెలియకుండా అతను కుదిర్చిన డాక్టర్లను ఆవిడ మార్చటమూ, అసలు వైద్యమే మార్చటమూ మొదలైన పనులు చెయ్యసాగింది. ఒకరిద్దరు డాక్టర్లు అతనిమీద ఎగిరిపడ్డారు కూడానూ! ఆవిడ ఈ విధంగా తన పరపతి పాడుచేస్తుంటే, ఆవిడకు మూడో తరంవాళ్లు అతని చరాస్తికి ఊహించరాని ప్రమాదాలు తెచ్చిపెట్టుతున్నారు. రామనాథానికి రెండువారాల్లో ఎవరి ఇంట్లోనో తను ఉచితంగా ఉంటున్నట్టుగా ఉండసాగింది.

ఒకనాడు సౌభాగ్యమ్మగారు అల్లుణ్ణి పిలిచి "చూడు నాయనా, నేను విన్నసోది అడిగాను. అమ్మాయి జబ్బును గురించి. అడిగితే వెంకటేశ్వర స్వామి వచ్చాడు, వచ్చి, తనకు ముడుపు కట్టుమని ఏడు ఊళ్ళు జోగి ఎత్తి, తనకొండకు వెళ్లి పిల్లనూ, నిన్నూ తలనీలాలు ఇమ్మన్నాడు." అన్నది.

"అంటే?"

"అంటే ఏముంది నాయనా! నువ్వు స్వామికి దణ్ణం పెట్టుకుని, దీపారాధన చేసుకుని ముడుపు కట్టుకోవాలి."

"వీలుపడదు."

"అయ్యో, పాపం! నువ్వు పసివాడివి.

నీకు తెలీదు. ముడుపు కట్టుకోవాలి.

"అవును. మీరామాట అన్నారు. నేను కట్టుకోనన్నాను."

"ఎందుచేతా?"

"కట్టుకోవటం ఎందుకూ?

"వెంకటేశ్వరస్వామి చెబితే తప్పుతుందా?"

"వెంకటేశ్వరస్వామి ఎక్కడ చెప్పాడు? సోది మనిషి చెప్పింది!.... నేను చెబుతున్నాను, అక్కర్లేదని! '

"దాని రోగం నయంకావటం ఎట్లా?

' మందులిస్తే నయమవుతుంది. '

"కాక పోయెగా?"

"వేరేమందు లివ్వాలన్నమాట! '

"నువ్వట్లా చెబితే నేనేం చెప్పను? .. కన్నకడుపు నీదా, నాదా?"

రామనాథం అత్తగారివంక తీక్ష్ణంగా చూశాడు. ఆమెకు అల్లుడి రెండుకళ్ళ లోనూ మూడోకన్ను జాడలు కనిపించినై.

అతనితో తనకేమిటని, సౌభాగ్యమ్మ గారు వియ్యంకుడితో చెప్పి స్వామికి ముడుపు కట్టించింది. తరవాత వారం రోజుల్లో మహాలక్ష్మి కాస్త పక్కలో లేచి కూర్చోవటం మొదలు పెట్టింది.

"ఆహా! ఏడుకొండలవాడి మహిమ!" అన్నారు ఇంటిల్లిపాదీ.

ఈ మాట వినగానే రామనాథము పాలిపోయినాడు.

"వెంకటేశ్వరస్వామి దేవుడైతే కావచ్చు. నేను మొక్కు చెల్లించబోవటం లేదు." అన్నాడతను.

ఈ మాట అతను అన్న అయిదు నిమిషాలకే మహాలక్ష్మికి ఒళ్ళు తెలియని జ్వరమూ, వణుకూ, మనిషి మంచంలో ఎగిరి ఎగిరి పడటం మొదలైనవి జరిగినై. అందరూ లబలబ లాడారు. భార్యను చూస్తున్న రామనాథం మొహం మరింత పాలిపోయింది. అతని గుండె తన అసమ్మతిని చాలా గట్టిగా తెలియజేసింది. అతను పళ్ళు బిగబట్టి "నామీద కోపం దానిమీద తీర్చుకుంటాడా? తుచ్ఛుడు!.. నేను మొక్కు చెల్లించను" అన్నాడు.

*  *

రాబొయ్యే ఫిలిం ట్రెయిలర్ వేస్తున్నాడు, అసలు ఫిలిం ఇంకా ప్రారంభం కాలేదు. త్వరగా వెళ్ళండి' అన్నాడు బుకింగు ఆఫీసు గుమాస్తా

రామనాథం హాలులోకి వెళ్ళాడు. లోపల కటిక చీకటిగా ఉన్నట్టుంది అతని కళ్ళకు. అప్పుడే వెలుగులోనుంచి రావటంవల్ల. హాలంతా కిటకిటలాడుతున్నది. అతను కుర్చీల మధ్యగా, మనుష్యుల మధ్యగా దారిచేసుకుంటూ, ఖాళీ కుర్చీ ఎక్కడ కనబడుతుందా అని చూసుకుంటూ నడవసాగాడు. కొంత వెళ్ళినతరువాత ఎవరో పెద్దమనిషి పొగరుగా "ఉండు అట్లా!" అంటూ అతన్ని అటకాయించాడు. ఆయన అడ్డం పెట్టిన కాలు రామనాథం చూడలేదు. ఆ కాలు

తగిలి అతను ముందుకు తూలాడు. పడకుండా ఉండటానికి అతను తన చెయ్యి అవతలి కుర్చీలో కూర్చున్న మనిషి భుజంమీద వేశాడు. మరుక్షణం చెయ్యి తీసి నిదానంగా నుంచున్నాడు రామనాథం, కాని అపచారం జరిగి పోయింది ఈ పెద్దమనిషి పక్కన కూర్చున్నదెవరో ఆడమనిషి! తనకు కాలు అడ్డంపెట్టిన పెద్దమనిషి తాలూకే నేమో! అందుకనే ఆయన అతన్ని అట్లా గదమాయించాడు. ఆడవాళ్ళను తెచ్చి మగవాళ్ళలో కూర్చోపెట్టట మెందుకు? ఇంత గలభా ఎందుకు?

ఈ లోపల ఆ పెద్దమనిషి రామనాథం చేసి దిద్దుకున్న తప్పు గమనించి "ఎవడ్రా నువు? బుద్ధిలేదూ?" అంటూ లేస్తున్నాడు. వెనకనించి "ఊరుకోండి! పోనివ్వండి!" అని అనునయింపులూ, "కూర్చో! కూర్చో!' అని గదమా యింపులూ వినిపించినై. రామనాథం ఆ పెద్దమనిషి చెయ్యి పట్టుకొని బలవంతాన కుర్చీలో కూర్చోపెట్టి తను ముందుకు వెళ్ళాడు. అది మాటలకు సమయంకాదు.

"ఈ పాటికి అతనికళ్ళు చీకటికి అల వాటు పడినై. ఆ ఆడమనిషి పక్కకుర్చీ ఖాళీగానే ఉంది. హాలు కిటకిటలాడు తున్నా, ఆడదాన్ని గౌరవించి పక్క కుర్చీ ఖాళీగా ఉంచారు. తనకు మరి తప్పదు. అతను ఆమెపక్కన చదికిల బడ్డాడు.

నువ్వా?' అంది ఆమె ఆశ్చర్యంతో.

సావిత్రీ! అన్నాడు రామనాథం. అతని వళ్ళు జల్లుమన్నది. లైట్లు వెలిగినై.

* *

సావిత్రిని ఇంతకాలానికి చూసిన ఆశ్చర్యంలో రామనాథం ఆమె పక్కన ఉన్న పెద్దమనిషిని పూర్తిగా మరిచిపోయినాడు తను ఆమెతో మాట్లా డటం ఇంకా పందమంది చూస్తున్నా రన్న విషయం కూడా అతన్ని బాధించ లేదు.

'ఎక్కడుంటున్నావు? మీ అత్తవా రేవూరు?' అన్నాడతను.

"ఇప్పుడు ఇక్కడే వుంటున్నాను- మావాళ్ళింటో, మా అమ్మకు కొంచెం సుస్తీచేసి, ఇప్పుడు నయంగా వుంది' మిగతాది సావిత్రి ఒక చిన్న యాక్షనుతో పూర్తిచేసింది, తల ఆ పెద్దమనిషివంక విసిరి. రామనాథం ఆశ్చర్యంతో ఆయన కేసి చూశాడు. ఆ పెద్దమనిషి సంగతి చెప్పనే అక్కర్లేదు. ఆయన మొదటి నించీ అతనివేపే చూస్తున్నాడు—తను ఈ సంభాషణలో కల్పించుకుంటే సమం జసంగా ఉంటుందా, ఉండదా అని అనుమానిస్తూ.

ఆయన ఆమె భర్త అయిన రిటైర్డు తహసీల్దారుగారని రామనాథానికి ఒక నిమిషందాకా తట్టలేదు,

"ఓ!" అన్నా డతను అర్థమైనట్టు.

సావిత్రికి ఈ మొగుడేమిటి? అతనికి మొదట నవ్వొచ్చింది. తరవాత తట్టింది. సావిత్రికి ఆ మొగుడు హాస్యకారణం కాకపోవచ్చునని, ఈ పెళ్ళిళ్ళేమిటి?— పగకొద్దీ చేసినట్టు! అసురబుద్ధి! అదీ కారణం, ఈ ప్రపంచం ఇట్లా తల కిందుగా వెళుతూండటానికి కారణం!

పైకి బాగానే ఉంది సావిత్రి పని. ఏదో అందమైన చీర కట్టింది. బోలెడు నగలు పెట్టుకుంది. చక్కగా బంగారపు బొమ్మల్లే ఉంది. అదృష్టవంతురాలేనేమో!

తిరిగిలైట్లు ఆరిపోగానే సావిత్రి తన చేతిని చల్లగా అతని చేతుల్లో పెట్టింది! దాంతో కొంపలు అంటుకున్నై!

నీరసంగా ఉన్న అతని జీవితంలోకి సారం వచ్చినట్టయింది. కటిక చీకటిలో మతాబా వెలిగించి నట్టయింది. అతని ప్రతి నరంలోకీ ఎక్కడినించో జీవశక్తి వచ్చి ప్రవహించటం మొదలుపెట్టింది. ఆ చేతిని అతను చాలాసేపు పట్టు కున్నాడు !....

మర్నాడు పోస్టులో అతనికి సావిత్రి దగ్గర్నించి ఉత్తరం వచ్చింది.

'నా ప్రాణదాతకు—నిన్న నిన్ను చూడగానే నాకు ప్రాణంలేచి వచ్చినట్ట యింది. కొంతకాలంనించీ నేను ఒకవిధ మైన మత్తులో వున్నానని నా కిప్పుడు అర్థమవుతున్నది.

"ఇది తప్పు, నేనీపని చెయ్య గూడదు" అని నాకు నేను ఎంతో నచ్చ జెప్పుకో జూచాను. లాభం లేకపోయింది. నేను నిన్ను విడిచి ఉండలేను. నువు నాకు కావాలి. నాలో ప్రతినలుసూ నీకోసం తహతహలాడుతున్నది. ఇవాళ సాయంకాలం అయిదుగంటలకు రా! తప్పకుండా రావాలి!"

ఇక ప్రపంచం ఎట్లాపోతే ఏం? ఏది ఎట్లా అయితే ఏం? ఎవరు ఏమయితే ఏం? ఇదంతా మాయ. సావిత్రి ఒక్కతే చైతన్యంగల జీవి. ఏ ఇతర పదార్థం లోనూ, జీవం ఉన్నట్టు కనిపిస్తుందేకాని, నిజంగాలేదు! ...

అతను దీపాలు పెట్టేవేళ యింటికి తిరిగివచ్చాడు. అతని శరీరం దేవతా స్పర్శచేత పవిత్రమైనట్టుగా ఉంది. అతని కళ్ళు మెరుస్తున్నై. అతని మొహం కళ కళ లాడుతున్నది. అతను మారిపోయి నాడు. "కాస్త ఒప్పుకుందూ, నాయనా! పిల్లది బాధతో అల్లాడి పోతున్నది!" అన్నది అత్తగారు అతన్ని సావిట్లో పట్టుకుని.

"వెంకటేశ్వరస్వామికి నువ్వుకూడా ముడుపుకట్టి, అపరాధం అను!"

"అట్లాగే చేతాం లెండి! అంటూ అతను గదిలోకి వెళ్ళాడు.

* *

రాత్రి పదకొండు గంటలయింది. రామనాథం పక్కమీద దేరా మేకల్లే కూర్చుని మొహం చిట్లిస్తున్నాడు. అతనికి నిద్రరావటంలేదు.




ఏదో పొరబాటు జరిగింది. లేకపోతే అతను, మర్నాడు వెంకటేశ్వరస్వామికి ముడుపుకట్టి అపరాధం అనటానికి ఎట్లా అంగీకరించాడు? అతనిపట్టు ఏమైంది!...

సావిత్రి తనలో కలిగించిన మార్పు సొంతంగా మంచిదేగా? తను ఇప్పుడు ఈత రాకుండా కాలవల్లో దిగగలడా? గొడుగులు పట్టుకుని ఇంటిమీదనుంచి దూకగలడా? అటువంటి చిలిపిపనులు చెయ్యాలని కాదు. తనలో ఇప్పుడా సాహసం ఉందా? తనకు ప్రాణం కొంచెం రుచిగాలేదా?—సావిత్రికోసం!

ఇంతకాలమూ తనలో ఒక గొప్ప శక్తి వుంటూవచ్చింది....దానితో అతను సాధించినది ఏమీలేదు. అయిన ఇప్పుడది నశించి పోతుందని అతనికి భయంగా వుంది. ఉన్నశక్తిని వినియోగించక పోవటం తన పొరపాటు. ఇప్పుడు దాన్ని నశించనివ్వటం మరొక పొరపాటు! ఏం చెయ్యాలి తను?

కావాలంటే ఈ క్షణంనించి తను సావిత్రిని చూడకుండా వుండగలడా? ఎందుకు చూడకుండా ఉండాలనేది అనవసరం! పట్టుదలకోసం!.........ఇతర కారణాలూ లక్ష కలగవచ్చును. తన్ను రానివ్వటంవల్ల సావిత్రి రేపో ఎల్లుండో చచ్చిపోవచ్చును. తను ఆ దెబ్బకు కుంగిపోవలసిందేనా? నూరు నోములు ఒక్కరంకుతో పోయినవన్నట్టు, ఒక్కసారి సావిత్రి దగ్గరికి వెళ్ళినందుకే తన శక్తి యింత క్షీణించిపోతే ఇంకొక నెల రోజుల్లో తన సంగతి ఏమవుతుందీ? ... ఇప్పటికింకా మించిపోలేదేమో! తాను త్వరగా మేలుకుని కర్తవ్యం ఆలోచించాలి.

ఆ రాత్రి అతను నిద్రపోలేదు.

మర్నాడు సాయంకాలం అతను వెళ్లే ఉప్పటికి సావిత్రి అతనికోసం నిరీక్షించు చున్నది అతనిమొహం చూడగానే ఆమె గ్రహించింది, ఏదో జరిగిందని.

"ఏమయింది ? ... '

"పొరపాటు జరిగింది, సావిత్రీ ! '

"ఏం ?

' నాకు భయంగా వుంది !'

"ఎందుకూ ?"

"కొంతకాలం ఇట్లా జరిగితే నేను నిన్ను కావాలన్నా చూడకుండా వుండ లేనేమో అని !'

ఆడదయినా ఆ ముక్క అర్థం చేసు కున్నది సావిత్రి.

"నాలో ఏదో నశించిపోతున్నదని భయం! స్వార్థం! నాకు తెలుసును! కాని, ఏది స్వార్థంకాదు? నేను నిన్ను కోరటం స్వార్థం కాదూ?"

సావిత్రి మాట్లాడలేదు.

"నా హృదయం చాలా దుర్బల మయినది, సావిత్రీ! అది నాతో ఎన్నడూ కలిసిరాలేదు. నేనేది చెయ్యబోయినా అది అడ్డపుల్ల వేస్తూనేవుంటుంది. చివరకు దాన్ని ప్రతిఘటించటమే ఒక నియమంగా పెట్టుకున్నాను....ఎందుకూ! ఇప్పుడు నా హృదయం నన్నెంత నిర్బంధపెడు తున్నదీ?—నిన్ను నా చేతుల్లోకి తీసుకుని గట్టిగా కౌగలించుకోమని, నీ లేతబుగ్గలు కందేటట్టు ముద్దుపెట్టుకోమని !..."అతను మొహానికి చేతులు ఒత్తుకుని కొద్దిగా వణి కాడు.

ఆ క్షణంలో సావిత్రి అతన్ని సమీ పించి, తనచెయ్యి మెల్లిగా అతని భుజం మీద వేస్తే ఏమయివుండునో!....సావిత్రి కూర్చున్నచోటినించి కదలలేదు.

ఇద్దరు అయిదునిమిషాలపాటు మౌన ముగా కూర్చున్నారు.

"నా శరీరాత్మలు నీ చేతులో పెట్టటం వల్ల నాకు పొయ్యేదేదీ కనిపించదు, ఎంత ఆలోచించినా! మగవాడికీ ఆడదానికీ అదొక భేదమేమో!' అంది సావిత్రి.

మొహానికి చేతులు అడ్డంతీసి, ఆమె వంక చాలాసేపు చూసి రామనాథం "నేను నిన్ను ప్రేమించటంలో నాకు నా భార్య మీద కల అసహ్యమూ, నీ భర్తమీద కోపమూ—ఈ రెండూ కూడా పని చేస్తున్నై. అట్లా కాకుండా నా హృద యాన్ని నేను జయించగలిగిన తర్వాత మనిద్దరం కలిసివుందాం! ఏం, సావిత్రీ!"

"అట్లాగే! '

"అందాకా ఒకళ్ళనొకళ్ళు చూసుకో నైనా వద్దు!"

"వద్దు!"

"నీకీ ఏర్పాటు కష్టంగా వుండదు కదా !"

"ఉంటుంది!" సావిత్రి నవ్వింది. "నేను కష్టాలకు అలవాటుపడ్డ ప్రాణాన్నే!"

రామనాథం ' వస్తాను!'' అని లేచాడు. అతని హృదయం తీవ్రమయిన తన తుది




ప్రయత్నం ప్రారంభించింది. రామనాథం దానికి లొంగదలచుకోలేదు.

ఎటు పోతున్నాడో, ఏంచేస్తున్నాడో అతనికి తెలియదు. దీపాలు పెట్టేవేళకు ఇల్లు చేరుకున్నాడు. ఎవరితోనూ మాట్లాడకుండా అతను తనగదిలోకి వెళ్లి పడుకున్నాడు.

అతనికి శరీరంలో అస్వస్థతగా వున్నట్టు తోచింది. శరీరం వేడిగా లేదు. నాడిమాత్రం విపరీతంగా కొట్టుకుంటున్నది. మతిచెడ్డవాళ్ళకు మల్లే ఆలోచన ఒక్కక్షణం ఒక్కచోట వుండక సంచారం చేస్తున్నది. చెవులో ఎవరో గుసగుసలాడుతున్నట్లున్నది.

"చాలా క్రూరం!....అయినా, పాపం సావిత్రి ఏం పాపంచేసింది?....స్వార్థం! స్వార్థం! అపరాధం! .... వెంకటేశ్వర స్వామికి మీదుకట్టు!..నెత్తి అడుస్తాడు!.. సావిత్రిమొహం చూడకు!....అమృతం విషమయింది, ఖర్మం చాలకపోతే!.... పాపం, సావిత్రిని మొహమ్మీద కొట్టినట్టు—"

రామనాథం మూలిగి, పక్కమీద పొర్లాడు. కాని, ఒక్కక్షణం కదలకుండా పడుకోగానే కలవరింతా, మగతా, చెవుల్లో సంభాషణా!

"నీకే వుందనుకున్నావు, మొండితనం!....సావిత్రి నీ తల తన్నింది!.... చూడు ఎంత సులభంగా నీ మొహం చూడకుండా వుండటానికి ఒప్పుకుందో! ఆ మనిషి నీకోసం పుట్టిందని తెలియటం లేదూ? ఇట్లాగా ఆ మాట రుజువు చెయ్యటం?....

అతని తల్లివచ్చి కొడుకును భోజనానికి లేపింది. అతను పలకలేదు. తట్టిలేపినా పలకలేదు. శరీరం వేడిగాలేదు. ఊపిరి

బలవంతంగా పీలుస్తూ విడుస్తున్నాడు. ఏమిటా ఈ అవస్థ అని ఆవిడ ఆశ్చర్య పడుతుండగా అతను కలవరించాడు.

"సావిత్రి పిరికిదనా?........భలే మొండిది!........నా అభిప్రాయం ఎంత బాగా అర్థం చేసుకుంది!....నా ప్రాణం!"

అతని గొణుగుడు ఆమెకు ఒక్క అక్షరమయినా అర్థంకాలేదు. ఆమె వియ్యపురాలిని పిలిచింది. ఆవిడవచ్చి పరిస్థితులు చూసి వెంటనే వెంకటేశ్వరస్వామికి ముడుపు కట్టించి అపరాధం చెప్పించింది.

నాలుగు రోజులైన తరువాత సావిత్రికి తెలిసింది, రామనాథంయొక్క అర్థంలేని జబ్బు సంగతి. ఆమె వెంటనే రామనాథాన్ని చూడటానికి ప్రయాణమయింది.

ఆమెను చూసి రామనాథం అత్తగారూ, తల్లీ ఆశ్చర్యపోయినారు. ఆమె నేరుగా రోగివున్న చోటికి వెళ్ళింది. రామనాథం పక్కమీద వెల్లకిలా పడుకుని కప్పువంక అర్థంలేకుండా చూస్తున్నాడు.

సావిత్రి అతని వంటిమీద చెయ్యివేసి 'ఇటుచూడు! ' అంది,

"అపరాధం?" అన్నాడతను ఇంటి కప్పుతో.

చచ్చిపోయింది! హాత్యచేశాను! వెంకటేశ్వర స్వామి చేయించాడు!"

"ఇదిగో చూడమ్మాయి! మా అల్లుడు సావిత్రి అని కలవరిస్తాడు విన్నేనా?" అన్నది సౌభాగ్యమ్మగారు వెనుకనించి.

"కావచ్చును!"

"ఎందు కల్లా?" అన్నది సౌభాగ్యమ్మ గారు మంచి లాయరు ప్రశ్న వేసిన దాని మాదిరిగా.

సావిత్రికి ఏం చెప్పాలో తెలియలేదు.

"మా యిద్దరిదీ ఒకటే ప్రాణం!" అన్నది సావిత్రి తెగించి.

"అట్లాగా? అయితే అతని ప్రాణం మీదికి వచ్చింది. ఏం చేస్తావో చెయ్యి!" అన్నది రామనాథం అత్తగారు.

"ఛీ! అవతలికి పో నువ్వు!....పో!" అని రామనాథం ఇల్లు ఎగిరి పొయ్యేట్టు అరిచాడు. సౌభాగ్యమ్మగారు దడుచుకుని పారిపోయింది.

"నాకు వళ్ళు తెలిసేవుంది, సావిత్రీ! మధ్యమధ్య మెదడు దాని యిష్టంవచ్చినట్టు పోతుంది. అర్థంలేని మాటలు అన బుద్ధి అవుతుంది——"

"కాకూడదు!" అంది సావిత్రి.

"లాభంలేదు, సావిత్రీ! ఇట్లా అయితే నాకు పిచ్చి ఎత్తిపోతుంది!.... నేను నిన్ను విడిచి ఉండలేను! ' అతను ఆమె వేపు చెయ్యి చాచాడు. ఆమె అనుమానిస్తూ చెయ్యి అందించింది. అతను ఆమెను ఏనుగుబలంతో లాగి ఆమె మొహం తనచేతులతో పట్టుకుని ఆమెకు ఊపిరి సలపకుండా ముద్దు పెట్టుకున్నాడు.

"ఉండండి! మీరట్లా ఇంద్రియ నిగ్రహము పోగొట్టుకోవటం బాగాలేదు, మీరు ప్రయత్నం చెయ్యటంలేదు, నన్ను మరిచి

పోవాలని. ఇట్లా అయితే—''

రామనాథం ఒకబలమైన ముద్దుతో ఆమె మాటల ప్రవాహం ఆపేశాడు. ఎవరైనా వస్తారనికూడా అతనికి భయంలేదు. ఏమి చెయ్యాలో ఆమెకు తోచలేదు. ఈ ప్రవాహంలో పడి తనుకూడా కొట్టుకొని పోవాలా? అదెంతసేపు పని? అతని ముద్దులు ఆమె రక్తాన్ని ఉడికించటంలేదా? ఆమె కింతకన్న స్వర్గం ఏముంది? అతనికో?....

అతని పట్టు మెల్లిగా విడిపించుకుని ఆమె ''ఇంటికి పోవాలి!'' అన్నది.

''అప్పుడే పోతావా? నా జబ్బు ఎంత నయమయిందో చూశావా?''

''మళ్ళీ సాయంకాలం వచ్చి చాలా సేపు కూర్చుంటాను!''

''ఈ గ్రహాలన్నీ —— ఇక్కడకాదు. నేనే మీ యింటికి వస్తాను. ఏం,సావిత్రీ?''

సావిత్రి ముక్కుమీద వేలు పెట్టుకుంది. అతను లెక్కచెయ్యలేదు.

నేను రాలేనన్నా? రాగలను! '

''నేను వస్తాను కాదూ? వస్తానని చావా? '

'అయిదు గంటలకు రా! రాకపోతే నేను ఇంతదూరమూ నడిచి వస్తాను సుమా!'

''అట్లాగే! ' ఆమె ధైర్యంచేసి, అతన్ని సమీపించి, వంగి, అతనికళ్లు రెండూ ముద్దుపెట్టుకుని, ఇవతల పడ్డది. ఏం చెయ్యాలో ఆమె అప్పుడే తీర్మానించుకుంది.



ఆ సాయంకాలం ఆరింటికి ఒక వీరసంగా ఉన్న వ్యక్తి బలవంతాన నడుస్తూ వచ్చి సావిత్రి పుట్టింటివారి ఇంటి అరుగు మీద చతికిలబడ్డది.

ఆ ఇల్లు తాళంపెట్టి ఉంది!

* *

ఆరునెలలు గడిచినై. రామనాథం తన గుడ్డిభార్యతో వేరే కాపరం ఉంటున్నాడు. ఈ ఆరు నెలల్లోనూ చాలా గ్రంథం జరిగింది.

మహాలక్ష్మి జబ్బు కాస్త నయమై ఆమె లేచి అటూఇటూ తిరుగుతుండగా ఆమెకు మశూచికం పోసిపోయినై.

ఈ లోపల రామనాథంలో పెద్ద పరివర్తన కలిగింది. భగవంతుడు తనకు ప్రసాదించిన మొండితనాన్ని ఉపయోగించటానికి అతను ఒక మార్గం

కనిపెట్టాడు.

మంచి అలవాట్లు అభ్యసించినట్టు సద్గుణాలు మాత్రం ఎందుకు అభ్యసించ రాదూ? తన భార్యా ఎటువంటిదైనాసరే, ఒక కుక్కను, ఒక పిల్లిని దయతో చూచినట్టు, దయతో, ప్రేమతో మహాలక్ష్మిని చూడటం అసంభవమా తనకు? ఎంత కష్టమైనాసరే ప్రయత్నం చేసేటందుకు తనకు పట్టుదల వుంది—అసంభవం కాకపోతేసరి! లేదా, తనలో అంత మొండితనం లేదని రుజువైనా కావాలి!....

అతను ప్రయత్నంచేసి తన భార్య మీద ప్రేమా, జాలీ, దయా తెచ్చిపెట్టుకున్నాడు. ఇటువంటి పని చేసినవాడు ప్రపంచంమీద మరొక డున్నాడని చెప్పలేం! మొదట్లో ఈ పని అతనికి చాలా కృత్రిమంగా, హాస్యాస్పదంగా తోచింది. కాని అతను పట్టు విడువలేదు. కావాలనేటప్పటికి అతనికి ఎక్కడలేని ఓర్పు వచ్చింది. ఆమె అవకతవక మాటలూ, వంకరబుద్ధీ సహించడం మొదలుపెడితే, అందులోనూ కొంత ఆనందం కనబడ్డది, కాని అతని ప్రయత్నానికి అతని తలిదండ్రులు పెద్ద అంతరాయం అయిపోయినారు.

ఏం చెయ్యాలి తను? ఆ ముసలివాళ్లకు తన అభిప్రాయం అర్థంకాదు. తన తల్లి ఒకసారి అనుకుంటున్నది—బిగ్గరగా!—"ఇంకేముందీ! అది వాణ్ణి బాగా తన వల్లో వేసుకుంది!" అని. భూతదయ తన భార్యయందు ఎటువంటి మార్పు తెచ్చిపెడుతుందో చూడటం ఎట్లా? అటువంటి తల్లిని ఇంట్లో పెట్టుకుని?

బాగా ఆలోచించి అతను వేరే కాపరం పెట్టాడు. ఈ నాలుగు నెలల్లోనూ మహాలక్ష్మి ఎంతో మారిపోయింది.

ఆమెలో కలుగుతున్న మార్పులన్నీ అతను గమనిస్తూనే ఉన్నాడు. మొదట్లో ఆమె అమితంగానూ, అప్రియంగానూ మాట్లాడేది. తన కళ్ళు తన మొగుడే పోగొట్టాడని రోజుకు పదిసార్లు అనేది. వెంకటేశ్వర స్వామిచేత పోగొట్టించాడనేది.

క్రమంగా ఆమె ధోరణి తగ్గిపో సాగింది. ఆమె మాట్లాడటం తగ్గించి ఆరిపోయిన దీపాలవంటి తనకళ్ళతో ఆలోచించటం ఎక్కువ చేసింది. అలవాటు చొప్పున మాట్లాడటం మొదలుపెట్టినా మధ్యలో మానేసి ఆలోచనలో పడేది.

ఇంకా రోజులు గడుస్తున్నకొద్దీ ఆమె తన భర్తకు పని ఇవ్వటానికూడా సంకోచిస్తున్నట్టు కనపడటం మొదలు పెట్టింది. మంచంలో లేచి కూర్చుని చాలాసేపు అనుమానించి "ఏం చేస్తున్నారు?" అని అడిగి, "వీలయితే నన్ను ఒక్కసారి బయటికి తీసుకుపోతారూ?" అనేది. ఇటువంటివి అతను గమనించకుండా ఎట్లా ఉండగలడు? అతని కాలి చప్పుడు గుర్తుపట్టేది. రెండు మూడు

గంటలు అతను ఇంట్లో లేకుండా ఎక్కడికైనా వెళ్ళిరాగానే, అతనికోసం నిరీక్షిస్తున్నదానల్లే అతను వచ్చిన అలికిడి విని మంచంలో లేచి కూర్చుంటుంది. ఆమె మొహాన సంతోషం కనబడుతుంది. ఒక్కరాత్రి అతన్ని తన మంచంమీద కూర్చోమని అతని చెయ్యి తనచేత్తో పట్టుకుని అట్లాగే నిద్రపొయ్యేది. ఒకసారి అతను తన్ను దగ్గిరికి తీసుకుని తన నుదురు ముద్దుపెట్టుకొంటే ఆమె శరీరం గట్టిగా జలదరించింది!....

మనిషిలో ఇంత మార్పా? ఆ మార్పు కలిగించటానికి ఇదా విధానం? అతను ఆశ్చర్యపడ్డాడు, సంతోషించాడు.

అతనికి పనిచెప్పటం ఇష్టంలేక ఆమె ఒకసారి తనంతట తానే దొడ్లోకి పోవాలని బయలుదేరి, దారిలో ఏదో తగిలి పడ్డది. మోకాలు దోక్కుపోయింది. రామనాథం ఆ చప్పుడు విని చేస్తున్నపని విడిచిపెట్టి వచ్చి, ఆమెను చేతుల్లో ఎత్తుకుని, మృదువుగా "దెబ్బ తగిలిందా? లక్ష్మీ!" అన్నాడు. "మోకాలికి తగిలింది" అన్నది, మోకాలు అందుకోవాలని ప్రయత్నంచేస్తూ. అతనికి గాయం కనపడ్డది. "అయ్యయ్యో!....నెప్పిగా ఉందా?" అన్నాడతను గాయం చూసి గాభరాపడి.

ఆమె అతనిచెంప స్పృశించి నవ్వుతూ "ఇప్పుడు లేదులెండి!" అన్నది.



రామనాథం పూర్తిగా తృప్తిపడ్డాడు. అతని విజయం పూర్తి అయింది. అతని హృదయం ఇప్పుడు ఎక్కడ ఉందో "పత్తా" లేదు. కుక్కిన పేనయిపోయింది. మిన్ను విరిగి మీదపడ్డా ఇప్పుడది కిక్కురుమనదు....అంతా సావిత్రి ప్రసాదం! అప్పుడామె తన్ను విడిచిపెట్టి వెళ్లకపోతే తను ఇంతపని చెయ్యగలిగి ఉండడు! ఎందుకూ? తనకు తనలో నమ్మకంకూడా పోయింది. సావిత్రికోసం తను మతి చెడగొట్టుకొన్న రోజుల్లో, సావిత్రికి తను యావజ్జీవం కృతజ్ఞుడై ఉండవచ్చును.

ఒకనాడు రామనాథం భార్యతో సావిత్రిని గురించి యావత్తూ చెప్పాడు. ఆమె గంభీరంగా అంతా విని చాలాసేపు

మాట్లాడలేదు.

"పాపం! అప్పుడామెను అట్లా ఎందుకు వదిలేశారు?" అన్నదామె చివరకు.

"నిమ్మా. సావిత్రి మొగుణ్ణి ఒక చెంప ద్వేషిస్తూ నేను సావిత్రితో సుఖ పడటానికి ఇష్టపడలేదు. ఆ స్థితిలో నేను సావిత్రిని వదలలేకపోవటం నా హృద యానికి దాస్యం చెయ్యటం అయింది. నా హృదయం మొదటినుంచీ నా పట్టుదల మీద కన్నువేసి ఉంది!... అందుకని!" అన్నాడతను భార్య తల నిమురుతూ.

* *

సాయంకాలం అయిదుగంటలయింది. అతను బజారుకువెళ్ళి తిరిగివచ్చాడు. లోపలికి వచ్చి "లక్ష్మీ!" అని పిలిచాడు. ఇంట్లో ఉన్నట్టు లేదు. ఉంటే తన అడు గుల చప్పుడుకు మెల్లిగా ఎదురువచ్చేదే! మంచం దగ్గిరికి వెళ్లి చూశాడు నిద్ర పోతున్నదేమోనని, అక్కడాలేదు. ఒంట రిగా దొడ్లోకి వెళ్ళిందేమో!

అతను దొడ్లోకివెళ్ళి ఒకటి రెండు కేకలు పెట్టాడు. పొట్లపాదు పక్కనించి మూలుగు వినపడ్డది. అతను అక్కడికి పరిగెత్తి బొక్క బోర్లాపడివున్న భార్యను చూసి, గాభరాపడుతూ ఆమెను లేవ దీశాడు. ఆమెకు స్పృహలేదు. ఏమయిందో అతనికి అర్థంకాలేదు. చుట్టూ చూశాడు. నేలమీద ఏవో పశువుల అడుగుజాడలు కనపడినై. ఏ పొగరుబోతు గొడ్డయినా దొడ్లో ప్రవేశించి, ఆమెను వెనకనించి కుమ్మి పడదోసిందేమో!

భార్యను మెల్లిగా లోపలికి మోసుకుని వచ్చి మంచంమీద పడుకోబెట్టాడు రామ నాథం. ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు సరి గానే ఉన్నై. గుండె సరిగానే కొట్టు కుంటున్నది. ఎక్కడా గాయంకూడా అయినట్టు లేదు. భయంచేతా, పాటువల్లా స్పృహతప్పి ఉంటుంది. అతను కాసిని చన్నీళ్లు తెచ్చి ఆమె మొహాన కొట్టాడు. ఆమె పెద్ద నిట్టూర్పు విడిచి కదిలింది. ఆమె గొంతులో కాసిని నీళ్ళు పోశాడు ఆమెకు దాంతో స్పృహవచ్చింది.

"ఏం జరిగింది, లక్ష్మీ?" అన్నా డతను.

ఆమె జవాబు చెప్పలేదు. అతనికి కారణం అర్థంకాలేదు. ఆమెకు స్పృహ వచ్చిందనీ, మేలుకుని ఉందనీ, విశేషం దెబ్బతగల్లేదనీ అతనికి తెలుసును. అతని మాట వినపడగానే ఆమె మొహంలోకి రావలసిన వికాసం రాలేదు. గుడ్డితనానికి తోడు, పాపం, చెముడుకూడా రాలేదు కదా!

ఇంకా బిగ్గరగా పిలిచాడు.

"ఉఁహూ!" అన్నది మహాలక్ష్మి, పలకరించవద్దు అన్నట్టు. ఆమె గొంతు కూడా చాలా విచిత్రంగా, అమానుషంగా ఉంది. అతను ఆమె జోలికి పోక ఎడంగా వచ్చి తనపని చూసుకోవటం మొదలు పెట్టాడు. మరి కాస్సేపటికి వంటమనిషి

వచ్చి వంటచెయ్యటం మొదలుపెట్టింది.

అతను భోంచెయ్యటానికి లేవబో తుండగా వంటమనిషి "అమ్మాయిగారు ఇప్పుడు భోంచేస్తుందా?" అని అడిగింది. "నా తరవాత" అని అతను సమాధానం చెప్పి, వెళ్ళి భోజనం చేశాడు. అతను భోజనం పూర్తికాగానే లేచివచ్చి నిశ్చలంగా పడుకున్న భార్యనుచూసి, ఆమె కోసం ఎదురుచూస్తున్న వంటమనిషితో "మీరు భోంచెయ్యవచ్చును. లక్ష్మికి తరవాత నేను పెడతాను" అన్నాడు. వంటమనిషి ఏవో ప్రశ్నలు వెయ్యబోయింది. కాని రామనాథం ఆమెను నిరుత్సాహపరచి పంపేశాడు.

పదిగంట లయింది. అతను కుర్చీలో కూర్చొని ఏదో చదువుకుంటున్నాడు. ఇంకా కాస్సేపు చూసి లక్ష్మి లేవకపోతే ఏమైనా సరే లేపుదామనుకున్నాడు.

ఏదో చప్పుడు కావడంవల్ల అతని చదువుకు అంతరాయం కలిగింది. అతను లక్ష్మిమంచంవేపు చూశాడు. ఆమె మంచంమీద లేచికూర్చుని ఉంది. అతను చూస్తుండగానే, ఆమె మామూలు మనిషల్లే మెల్లిగా తనవేపు నడిచిరావటం మొదలు పెట్టింది.

"అయ్యయ్యో! పడతావు సుమా! అక్కడే ఉండు, వస్తున్నాను" అంటూ అతను ఒకచేత్తో లాంతరు పైకెత్తి నిలబడ్డాడు. కాని అతని ఆందోళన అనవసరం అయింది. ఆమె కళ్ళున్న మనిషల్లే అడ్డాలూ, అవీ తప్పుకుని నడిచివస్తున్నది. ఆమెకు సాయంత్రం కలిగిన పాటువల్ల కళ్ళు రాలేదు కదా! కాని—ఆమె కళ్ళు మూసుకునే నడుస్తున్నది. అతని కళ్ళనే అతను నమ్మలేకపోయినాడు.

అతనికేక ఆమెకు వినపడ్డట్టులేదు. ఆమె అతని దగ్గిరికివచ్చి అతని భుజాల మీద చేతులువేసింది. ఆమెకళ్ళు ఇంకా మూసుకునే ఉన్నై.

"లక్ష్మి!"

"ఊఁ!"

"నీకు—నీకు కనపడుతున్నదా?"

"ఊఁ!"

"నేను కనబడుతున్నానా?" అతని గొంతు చలించింది.

"ఆ!"

"ఏం కావాలి?"

సమాధానం లేదు.

"భోంచేస్తావా?"

సమాధానం లేదు.

అతనికి ఎన్నో ప్రశ్నలు వెయ్యాలనిపించింది. కాని ఒక్కటీ వెయ్యకుండా ఆమెవంక అర్థంలేని చూపు చూస్తూ అట్లాగే నిలబడిపోయినాడు.

"సావిత్రి మొగుడు పోయినాడు!" అన్నదామె వినపడీ వినపడని గొంతుతో.

"ఎప్పుడు?"

"నిన్న!"

"నీకెవరు చెప్పారు?" అన్నాడతను ఉద్రేకం అణచుకోలేకుండా.

సమాధానం లేదు.

"నిజంగా పోయినాడా?"

"పోయినాడు!"

"పాపం!"

"సావిత్రిని తీసుకురండి."

"ఎక్కడికి?"

"సావిత్రికి మీరుతప్ప దిక్కులేదు, ముందు ముందు."

"ఇదంతా నీ కెట్లా తెలిసింది?"

మహాలక్ష్మి సమాధానం చెప్పలేదు. ఆమె అతనివంక చూస్తున్నట్టు నటించటం మానేసింది. ఆమెమెడ వేళ్లాడబడ్డది. ఆమె అతనిమీదికి తూలిపడి కిందికి జారటం మొదలుపెట్టింది. ఆమెను అతను గట్టిగా పట్టుకుని తీసుకువెళ్లి మంచంమీద కూర్చోపెట్టాడు.

"దాహం!" అంది మహాలక్ష్మి. ఇప్పు డామెగొంతు సహజంగా ఉంది. ఆమె వాలకంచూస్తే ఆమెకు ఇప్పుడే నిజంగా వళ్ళు తెలిసినట్టుకూడా తట్టింది రామనాథానికి. అతను మంచినీళ్ళు తెచ్చి ఇచ్చాడు. ఆమె వాటిని ఒక్కగుక్కలో తాగేసి నిట్టూర్చింది

"భోంచేస్తావా, లక్ష్మి!"

"వద్దండీ!....అబ్బ! వీపులో పోటుగా ఉందండీ!" అతను ఆమెను మెల్లిగా పడుకోబెట్టాడు.

"చల్లగాలికోసం నేను తడువుకుంటూ దొడ్లోకి వెళ్ళేటప్పటికి ఏదో వచ్చి నన్ను పడదోసింది!....నేను మిమ్మల్ని చూసి నట్టు కల వచ్చిందండి! దీపం అట్లా చేత్తో పైకెత్తి పట్టుకుని నుంచున్నారు!... ఆ తరవాత ఏమీ జ్ఞాపకంలేదు."

"అది కలకాదు, లక్ష్మి! దేవతలు నీకు దివ్యదృష్టి ఇచ్చారు." అని సమాధానం చెప్పాడు.

* *

అప్పుడప్పుడూ మహాలక్ష్మి కళ్లు మూసుకునే ఇల్లంతా తిరుగుతూ ఉంటుంది రామనాథం గాని, సావిత్రికాని ఆమెనుచూసి ఆశ్చర్యపడరు. ఆమెకు అద్దంవెళ్లరు!





# అమ్మ

ఇందుమతీ పట్నాయక్

ఆఫీసుకి పనిమనిషి రంగమ్మ చేసిన ఫోన్‌కాల్ అందుకోగానే చేస్తున్న పని అలాగే వొదిలిపెట్టి అయిదు నిమిషాల్లో యిల్లు చేరుకుని రేణుక గదిలోనికి వెళ్లాడు వేణుగోపాల్. రేణుక బెడ్ ప్రక్కన కుర్చీలో కూచుని ఆమెని ఓదారుస్తూంది డాక్టర్ వనజాక్షి. లోనికి అడుగు పెట్టిన భర్తని చూడగానే ఒక్కసారిగా దుఃఖం పొంగుకొచ్చి చిన్నపిల్లలా ఏడవసాగింది రేణుక. దగ్గరగా జరిగి, తల మీద చెయ్యి నుంచి "వూరుకో రేణూ.... వూరుకో ఏడవకు" అని "ఏం జరిగింది డాక్టర్? అబార్షనా? మరేం ప్రమాదం లేదు కదా?" అని అడిగాడు డాక్టర్‌ని వేణుగోపాల్.

తల అడ్డంగా వూపుతూ అసలు గర్భం అంటూ రానేలేదు. ఇది మామూలు "ఫ్లో" మాత్రమే. ఆవిడని రెస్ట్ తీసుకో

నివ్వండి. మానసికంగా, శారీరకంగా కూడా ఆవిడకి విశ్రాంతి ఎక్కువ అవసరం. పదండి హాల్లోకి అక్కడ ప్రిస్క్రిప్షన్ వ్రాసిస్తాను'' అంటూ గది బైటకు నడిచింది. పోర్టికోలోకి వచ్చి కారెక్కుతూ ''మిస్టర్ వేణుగోపాల్ ఆవిడకి యింకేమందూ అక్కర్లేదు. నిద్ర కోసం మందిచ్చాను. అది చాలు ప్రస్తుతానికి. ఆవిడ యిక తల్లి అవటం అసంభవం అని మీ కిదివరకే చెప్పాను నేను. మాతృత్వం మీద లేనిపోని ఆశలు పెంచుకొని, ఆ తర్వాత నిరాశతో కుప్పగా కూలిపోవటం మినహా చెయ్యగలిగిందేమీ లేదు. నెమ్మదిగా ఆవిడకి విషయం తెలియజేసి, ఆమె మనసు నీ విషయం మీద నుండి మళ్ళించండి'' అని చెప్పి వెళ్ళిపోయింది డాక్టర్ వనజాక్షి.

నిశ్శబ్దంగా మేడ మెట్లెక్కి లోనికి వెళ్ళిన వేణుగోపాల్‌కి, మగతగా కళ్ళు మూసుకుని పడుకుని వున్న రేణుక కనిపించింది. ఈ రోజు జరిగిందానికి అనవసరంగా ఉద్రేక పడిపోయి, ఏడ్చి, నానా రభస చేసినందుకు, డాక్టర్ యిచ్చిన సెడెటివ్, నెమ్మది, నెమ్మదిగా నిద్రలోనికి జార్చింది రేణుకను. అమలినమైన ఆమె మొహాన్నీ, తడిసిన కనురెప్పలనీ చూస్తుంటే అతడికి ఈ మూడు నెలల వ్యవధిలో జరిగిన సంఘటనలన్నీ తలపుకి రాసాగాయి.

సంక్రాంతి వెళ్ళిన వారం రోజులకి కాబోలు, ఓ ఉదయాన్నే తను షేవ్ చేసుకుంటూంటే, వెనకాల నుంచుని, చెయ్యి మాత్రం ముందుకి చాచి, ''యిదేమిటో చెప్పుకోండి చూద్దాం మరి'' అంది. ఏదో బొమ్మల పుస్తకం లాగుంది అట్ట చూస్తే. లోపల పేజీలు తిప్పి చూశాడు తను. పాపాయికోసం డైరీ అది. మొన్న షాపింగ్ వెళ్ళినప్పుడు బుక్ సెంటర్‌లో కొన్నాను అంది సన్నగా నవ్వుతూ. మొదటి పేజీలో ఒక స్టార్క్ ముక్కుకి వేలాడుతూన్న వుయ్యాలలో పాపాయి ఫొటో అతికించటానికి స్థలం మార్క్ చెయ్యబడి వుంది. ఆ తర్వాత పేజీలో పాపాయి పుట్టిన తారీఖు, ఏ హాస్పిటల్లో పుట్టిందీ, బరువు ..యివి రాసేటందుకు ఆయా విషయాల కెదురుగా ఖాళీ లున్నాయి. రెండో పేజీలో, పాపాయిని చూడటానికి వచ్చిన మొట్టమొదటి వ్యక్తి పేరు రాయటానికీ, ఆ తర్వాత ఎవరెవరు వచ్చారో, ఎప్పుడు హాస్పిటల్ నుండి డిశ్చార్జ్ అయి యింటికి వచ్చారో, రాయటానికి వుంది. ఇక ఆ తర్వాత పేజీల్లో, పాపాయి ఏ రోజు పక్కకి దొర్లిందీ, కూచున్న సమయమూ, పళ్ళు ఎప్పుడు రావటం మొదలు పెట్టిందీ, 'అమ్మ' అన్న శబ్దం ఏనాడు వుచ్చరించిందీ, బుల్లి చేత్తోటి పాపాయి చేత అక్షరం రాయించటానికి ఖాళీ.. .యివన్నీ వరుసగా, ఒకదాని వెంబడి మరొకటి, పాపాయి ప్రతి దశనీ తెలిపేటందుకూ, దాన్ని చూసి పెద్ద

యు వ

య్యాక బాబు మురిసి పొయ్యేటందుకూ ఎంతో ఆశతో రేణుక కొనితెచ్చుకున్న పుస్తకమది. ఆ అమాయిక హృదయం లోని నిరీక్షణనీ, పరవళ్ళు తొక్కుతున్న ఉత్సాహాన్నీ చూసి, వస్తూన్న నిట్టూర్పుని బలవంతాన అణచుకొని పుస్తకాన్ని ఆమె చేతికే యిచ్చేశాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకి రేణుక తన దగ్గరికి వచ్చి "చూడండీ గర్భిణీ స్త్రీలకి మంచి వ్యాయామం వుండాలట కదా; మరి మీరు రోజు ఆఫీసునుండి పెందరాళేవస్తే, యిద్దరం కలిసి వాకింగ్ వెళ్ళవచ్చు, ఏమంటారు అంది. ఆ తర్వాత ప్రతి సాయంత్రం ఇద్దరూ మెయిన్‌రోడ్ దాకా నడిచి, దగ్గరలోనేవున్న పార్కులో కాసేపు కూచుని వచ్చేవాళ్లు. వెళ్ళే దారిలో ఏదో చిన్న కాన్వెంట్ ఒకటుంది. ఆ కాన్వెంట్ గేటుకి ఎడమవైపున పచ్చ గడ్డిలో ఒక విగ్రహం—మేరీ జీసస్‌ని ఎత్తుకుని నుంచున్న ప్రతిమవుంది. చీకటి పడే సమయానికి ఆ విగ్రహానికిరు వైపులా నాలుగేసి కొవ్వొత్తులు వెలిగింప బడి వుంటాయి. వాత్సల్యం జాలు వారు తూన్న ఆ మాతృమూర్తి వదనం ఈ మెత్తటి దీపకాంతిలో, మరింత దీప్తి వంతమై వెలుగొందేది. ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు ఆ చోటుకి రాగానే, రేణుక కళ్ళు వాటంతటవే ఈ దృశ్యంవైపు తిరిగేవి. నిరీక్షణ నింపుకున్న ఆమె కళ్ళు చూసినప్పుడల్లా, వేణు మనస్సు విలవిల లాడేది.

ఈ విషయం ఎలా మొదలు పెట్టాలా అని ఆలోచిస్తూన్న వేణుగోపాల్‌ని, ఆ మరుసటిరోజు రాత్రి రేణుక అడిగింది. "ఏమండీ ఓ మంచి పాపాయిని మనం పెంచుకుంటే?" అని. "అదే నేనూ తీవ్రంగా ఆలోచిస్తున్నాను రేణూ, మరో మార్గంలేదు మనకు. తొమ్మిది నెలలు మోసి, బిడ్డని ప్రసవించితే కానీ, మాతృత్వం పొందలేనని నీ వనుకోవటం పొరబాటు. ఈ విశ్వంలో తల్లి ననిపించు కునే అర్హత ప్రతి స్త్రీకీ వుంది రేణూ. కన్న బిడ్డని సాకటంలోకన్నా, ముక్కూ మొహం ఎరగని పరాయి బిడ్డను తెచ్చి, ప్రేమానురాగాలు రంగరించి, వాటితో ఆ బిడ్డను పెంచి పెద్ద చెయ్యటంలో ఔన్నత్యం వుంది. అప్పుడు నువ్వు నిజ మైన అమ్మవి అవుతావు" అన్నాడు నిశ్చల కంఠంతో వేణుగోపాల్.

అదొక మిషన్ హాస్పిటల్. దానికి సంబంధించినదే ఒక అర్ఫనేజ్ వుంది. అందులో అనాధ శిశువులే కాకుండా, అంగవైకల్యం కల పిల్లలూ, మానసికాభి వృద్ధి కొరవన శిశువులూ, తలిదండ్రి వుండికూడా, తమకు గల ఈ స్వల్ప లోపాల మూలంగా వారి ప్రేమకు దూరమై వారిచేత భారంగా పరిగణింపబడి ఇక్కడ పెరుగుతున్నారు. ముందుగా వేణుగోపాల్ వెళ్ళి అక్కడి సూపరింటెండెంటుతో మాట్లాడితే ఆమె కొన్ని కాగితాలూ అవీ

యిచ్చి, వాటిని నింపి సంతకంచేసి, మరునాడు భార్యతోసహా వచ్చి నచ్చిన పిల్లవాడిని తీసుకుని వెళ్ళవచ్చునంది.

ఆ రోజు మధ్యాహ్నం నుండే రేణుక గంటలు లెక్కపెడుతూ కూచుంది. చివరికి ఒకచోట కూచోలేక సర్దినదే మళ్ళీ, మళ్ళీ, సర్దుతూ ఇంట్లోనుండి వరండాలోనికి కలియతిరిగింది. ఆర్ఫనేజ్ దగ్గరవుతున్నకొద్దీ మనసులో కలవరం హెచ్చింది. కానీ వేణుగోపాల్ మాత్రం మనసులోని ఏ భావం పైకి కనిపించ నివ్వక, గంభీరంగా డ్రైవ్ చేస్తున్నాడు. బయిట కారాగిన శబ్దం వినగానే లోపలి నుండి సూపరింటెండెంట్ బైటికి వచ్చి "నమస్తే రండి" అని చెప్పి రేణుక చేతిని తన చేతిలోకి తీసుకుని లోపలికి దారితీసింది.

పిల్లలందరూ వెనుకనున్న తోటలో ఆడుకుంటున్నారు. చిన్నా, పెద్ద, ఆడా, మగా తారతమ్యం లేకుండా, కొత్త మొహాలు చూడగానే ఒక్కసారిగా అందరూ ఎక్కడి వాళ్లక్కడే నిశ్శబ్దంగా నిలుచుండి పోవటం చూసి, సూపరింటెం డెంట్ నవ్వుతూ "సే గుడ్ ఈవినింగ్ టు ఆంటీ అండ్ అంకుల్" అనగానే అందరూ ఏకకంఠంతో గుడ్ ఈవినింగ్ అన్నారు. వాళ్ళందరిలో తలుపు ప్రక్కగా ఒదిగి నుంచుని, పెద్దపెద్ద కళ్ళతో వచ్చిన వాళ్లకేసి చూస్తున్నాడు ఒకబ్బాయి. రేణుక వాడి దగ్గరికి వెళ్ళి భుజంమీద చెయ్యేసి "నీ పేరేమిటి బాబూ" అంది. "ఉదయ్‌కుమార్" అన్నాడు. అమాయ కత్వం నిండిన ఆ కళ్లలో, యేదోలోటు, దేన్నో పోగొట్టుకున్న అనుభూతి, వ్యక్తంజెయ్యలేని బాధ, లీలగా కనిపిం చాయి రేణుకకి. ఒక్కసారిగా వాడి బాధ నంతా తన చేత్తో తీసివెయ్యాలనీ, వాడి గుండెలనిండా తనలో పెల్లుబికే వాత్స ల్యాన్ని నింపాలనీ అనిపించిందామెకి "నాతో మా యింటికి వస్తావా బాబూ" అంది ప్రేమగా. చిరునవ్వు సమాధానం వచ్చింది దానికి

ప్రక్కనే నుంచునివున్న సూపరిం టెండెంట్ చెప్ప సాగింది యిద్దరితోటీ "కుమార్ అనాధ అనుకుంటున్నారేమో? కాదు తలిదండ్రు లిద్దరూ బ్రతికేవున్నారు. పైగా తండ్రి పెద్ద ఆఫీసరు కూడాను. వీడికి చిన్నతనంలో "సెరిబ్రల్ పేల్స్" చేత కాలు వంకరయిపోయింది. వాడిని సాకటం కష్టం అనిపించి తల్లిదండ్రులు వాడిని ఇక్కడే వదిలేసి వెళ్లారు. అప్పు డప్పుడూ వుత్తరాలు రాస్తుంటారు. వీడినికూడా వదిలి వెళ్ళిన అయిదేళ్లకి తల్లిమాత్రం వచ్చి చూసి అయ్యో రాలే యింకా వీడు కుంటివాడుగానేవున్నాడే. ఇక బాగుపడేదెన్నడు. ఉన్న నలుగురి తోనే వేగలేక ఛస్తున్నాను. ఇక వీడిని తీసుకవెళ్తే నాపని అయినట్టే అని నెత్తి నోరూ బాదుకుని, వెళ్ళేముందు నా దగ్గరికి వచ్చి చూడండీ పిల్లవాడు ఇక్కడే బాగా

అలవాటు పడినట్టున్నాడు. ఒకవేళ నేను తీసికెళ్ళినా మీ అందరిమీదా బెంగపెట్టు కుంటాడేమో. ఒకవేళ ఎవరైనా అడిగితే వీడిని పెంపకానికిచ్చెయ్యండి మంచి వాళ్ళుగా చూసి అని రహస్యంగా చెప్పి వెళ్ళిపోయింది. చూశారా వీడి దురదృష్టం ఎంతటిదో. ఇప్పటిదాకా ఒకవేళ నిజంగా మీరు తీసుకు వెళ్తానంటే నా కంతకన్నా సంతోషం మరొకటి వుండదు. "మే గాడ్ బ్లెస్ యూ బోత్" అందావిడ.

బాబుని యింటికి తీసుకొచ్చే రోజున స్నేహితులందరినీ పార్టీకి పిలిచారు వేణు గోపాల్ రేణుకా. వచ్చిన వాళ్ళందరూ యేవేవో బహుమతులు తెచ్చి బాబు చేతుల్లో పెట్టారు. పార్టీ అయిపోయి అందరూ వెళ్ళిపోగా, రేణుక చిన్ననాటి స్నేహితురాలు విమలమాత్రం మిగిలింది. నెమ్మదిగా వరండాలోనికి తీసుకువెళ్ళి "ఏమిటే రేణూ ఎవడో వూరూ, పేరూ తెలీని వాడిని, మన కులం కాని వాడిని తెచ్చుకోవటం ఏమిటి? కావాలంటే మీ బంధువుల్లో పిల్లాడిని తెచ్చుకునివుంటే సరిపొయ్యేది కదా. కనీసం మాతో ఎవరితోనూ చెప్పపెట్టకుండా ఇంత కంగారుగా వెళ్ళి తెచ్చుకోవటం ఏమిటి" అంది విమల.

"పెంపకానికి పిల్లలు దొరకటం సులభమే కానీ, పిల్లలకు పేరగటానికి సరయిన గృహం దొరకటం అత్యంత కష్టం విమలా! ఎన్ని మందులిస్తేనేం, ఎటువంటి తిండిపెడితేనేం అది అర్ఫనేజి. తల్లీ, తండ్రీ కురిపించే ఆప్యాయత, ఆదరణ లేవక్కడ. రోజురోజుకీ మానసికంగా వాడు కృంగిపోతూంటే యిక కోలుకోవటం ఎప్పుడు? మన వాళ్ళలో పిల్లవాడిని పెంపకానికి తీసుకోలేదేమని కదూ అడిగావు? తండ్రిచాటున పెరుగుతున్న పిల్లవాడికి మరో తల్లి, తండ్రి, యిల్లు దేనికి? జన్మతః దురదృష్టవంతులైన ఇలాటి పిల్లలకి ఆ అవసరం కాని. ఇన్ని రోజురోజులూ, ఆ టానిక్కులూ, మందులూ యివ్వలేని ఫలితాన్ని, వాడికీ యింట్లో లభించే మమతానురాగాల ద్వారా పొందుతాడు. త్వరలోనే మామూలు మనిషవుతాడు అంది.

ఆర్ద్రత నిండిన ఆమె కళ్ళలోనికి చూస్తూ "రేణూ వాడు నిజంగా లక్కీఫెలో సుమా అంది" నవ్వుతూ విమల.



సెప్టెంబరు నెల

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10—00



**ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.**

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి. **వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులో పంపినవి అంగీకరింపబడవు.**

మాకు చేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమాన మివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు సెప్టెంబరు 5 వ **తేదీలోగా చేరాలి.** యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొన వచ్చును. ప్రవేశరుసుములేదు.



# క్షితిజ రేఖలను దాటి...

ముదిగొండ శివప్రసాద్

మా టూరిస్టు బస్సు అమరావతి చేరే సరికి సాయంత్రం ఐదు గంటలైంది. బస్సుదిగి మ్యూజియం గూర్చి విచారించేసరికి "అయ్యా యిది పల్లెటూరు. మీకిక్కడ గైడ్సు వగైరాలు దొరకరు. నిజానికంత అవసరంకూడా లేదు. కాబట్టి ముందుగా మీ రా బస్సుస్టాపు వెనుకగా ఓ ఫర్లాంగు వెళ్ళండి. అక్కడ బౌద్ధుల నాటి విహారమూ, శిధిలాలూ కన్పడతాయి. దాని పక్కనే ఓ చిన్న మ్యూజియం. ఈ రెండూ చూడటానికి ఓ గంటకూడా పట్టదు. ఆ తర్వాత అమరేశ్వరస్వామి దర్శనం చేసుకొని ఇష్టమైతే కృష్ణలో స్నానంచేసి మరీ వెళ్లవచ్చు" అని ఓ పెద్దమనిషి సలహా చెప్పాడు.

"అయితే ఇంకేమైనా వున్నాయా

చూడవలసినవి?'' ప్రశ్నించాను.

'' ఇంతేనండీ—మరేంలేవు '' జవాబిచ్చాడాయన.

''మాష్టారూ—జల్దీ పోదాం—మేము ఫొటోలు తీసుకునేందుకు లైటు చాలేట్టు లేదు'' స్టూడెంట్సు తొందర చేస్తుంటే నేనుకూడా వారివెంట బయలుదేరుతూ ''చూడండి మీ పేరేమన్నారు .'' అని ప్రశ్నించాను.

''నా పేరు రంగారావండీ—ఆ పఛ్ఛాలుగోమైలురాయి దగ్గర పొగతోట లేదూ—అది నాదే. పఛ్ఛాలుగోమైలు రాయి అన్నది అమరావతి సమీపంలోని ఓ వూరు పేరుట.

''ఇదుగో చూడండి రంగారావుగారూ నా పేరు దీక్షితులు. వీళ్లంతా మా స్టూడెంట్సు. మేము హైదరాబాదునుంచి స్టడీ టూరు మీద వెళ్తూ ఈ ఉదయమే గుంటూరు చేరాము. మధ్యాహ్నం లాం ఫారం చూశాము. ఇప్పుడు అమరావతి చూసుకొని రాత్రికి విజయవాడకు చేరాలని మా సంకల్పం. మీకు వేరే అర్జంటు పని లేకపోతే మాతో కూడా ఓగంటసేపు కనుక వుంటే సంతోషిస్తాము—''

రంగారావు వెంటనే అంగీకరించాడు.

పిల్లలంతా అప్పుడే హుషారుగా కేరింతలు పెడుతూ చాలా దూరం సాగిపోయారు. రంగారావు కేవలం పల్లెటూరి రైతేకాదు కొంచెం చదువూ సంస్కారమూ కలవాడు. ''చిన్నప్పుడు తాడికొండ ఎస్. ఎ. బి. హైస్కూలు లేదూ అక్కడ చదువుకున్నానండీ ఫోర్తుఫారందాకా—తర్వాత పెళ్లయి కుటుంబం నెత్తిన పడేసరికి పొగాకుకే పరిమితమైపోయాను'' నవ్వుతూ చెప్పాడు రంగారావు - ఆయన కళ్లల్లోని వెలుగునుబట్టి హైదరాబాదు మహాపట్నంనుంచీ వచ్చిన వ్యక్తులవెంట తాను గైడు బాధ్యతను నిర్వహించి రావడానికి చాలా సంతోషపడుతున్నట్లుగా గ్రహించగలిగాను. ప్రాచీన బౌద్ధవిహార శిథిలాలూ, పక్కనేవున్న మ్యూజియమూ ఓ అర్ధగంటలోనే చూపించేశాడు. నాకు మాత్రం అక్కడ అధ్యయనం చేయవలసిన విషయాలు చాలా వున్నట్లు అనిపించాయి కాని దానికిది తగిన సమయం కాకపోవడంవల్ల మనసు వెనుకకు పీకుతున్నా కాళ్లు ముందుకు సాగిపోయాయి . .

''ఇటు సార్—ఇటు—ఇదిగో ఈ రథం పక్కగా రండి—ఇటు స్నానాల రేవు—'' కృష్ణవైపు నడిపించాడు రంగారావు. ఎండాకాలం కావడంవల్ల కృష్ణమ్మ ఆస్తినాస్తివిచికిత్సకు లోనై దర్శనమిచ్చింది.—సూర్యుని అస్తమయ కిరణకాంతులు ఆమెకు చెంగలువ మాలలతో పూజిస్తున్నట్లు కన్పడింది. అవతలి లంకలనుండి ఆవులూ, గేదెలూ మోకాటి లోతు నీళ్లలోనుండి నడుస్తూ అమరేశ్వరుని గుడివైపుకు వస్తున్నాయి. మా విద్యార్థులు కొంతమంది అప్పుడే చొక్కాలూ, నారోపాంట్లూ ఒడ్డునపడేసి

యువ

నీళ్లల్లోకి దిగారు.

"జాగ్రత్త"—హెచ్చరించాను వాళ్లను నేను.

"ఫరవాలేదులెండి సార్—ఇప్పుడేం ప్రమాదం లేదు — ఎంత లోతుకెళ్లినా మోకాళ్లు దాటవు నీళ్లు—ఆ రాముగాడు లేడూ, వాడు కృష్ణమ్మకు వరదలు వచ్చి నప్పుడు కూడా అవలీలగా తెప్ప కొయ్య లేకుండా అవతలి ఒడ్డుకు చేరుతాడు" "ఏ రాముగాడు?" ప్రశ్నించాను నేను.

"వాడే మా పిచ్చి వెధవ—" రంగా రావు నవ్వుతూ జవాబు చెప్పాడు. రామునే తెలియకపోతే ఇంక మాదీ ఒక బతుకేనా అన్నట్లు—నేను మళ్ళీ ప్రశ్నించ లేదు. కాని రంగారావే అన్నాడు "అడుగో దూరాన ఆ లంకలో కూర్చోని వున్నాడు చూడండి వాడే మా రాము గాడు—"నిశితంగా చూచాను. నిజమే! దూరంగా ఓ చిన్నమనిషి కూర్చుని వున్నట్లు కన్పడుతున్నది. "ఏం చేస్తు న్నాడు ఆయనక్కడ?" ప్రశ్నించాను. "ఆయన కాదు సార్—వాడు చిన్నపిల్ల గాడు. చదువుకోరా బడికి పంపితే పలక మీద పిలక పెట్టి అయ్యవారి బొమ్మ గీచాడు—బొమ్మైతే అచ్చంగా అయ్య వారిలానే వుంది గాని కోతిపనులు చేసి నందుకు బళ్లోంచి తరిమివేశాడాయన. పోనీ వీణ్ణి పొలంపనుల్లో పెట్టమని చెప్పాము. వాళ్లయ్యకి — "సరేనని వాళ్ళయ్య వీణ్ణి పొలానికి కాపలా పంపిం చాడు. మనిషి మనిషిలాగే కూర్చోని వున్నాడు. కాడీ, మోకులూ మాత్రం దొంగలెత్తుకుపోయారు సార్..."

"పాపం ... నిద్ర పోయాడేమో!" సానుభూతిగా చూశాను నేను.

"నిద్రలేదూ. పాడూలేదు సార్— వాడి రకమే అంత. వెర్రివెధవ—ఒక రోజు పొలానికి వాళ్ళమ్మ పంపించిన బువ్వను దొర్లించి, కుక్క తినడం దూరంనుంచి చూశాను నేను. పరుగెత్తు కుంటూ వచ్చేసరికి నన్నుచూచి కుక్క పారిపోయింది. 'మొద్దెధవా కూడేదిరా—' అని నే నడిగితే రాముగాడు పక్కనే వున్న ఖాళీ గిన్నెచూచి, నవ్వి 'బహుశా ఇందాక తినేసి వుంటాను బాబాయ్' అన్నాడు — ఏం చెయ్యమంటారు. వాణ్ణింక...." నవ్వుతున్నాడు రంగారావు.

నిజమే! వింతగా వుంది!!

ఉన్నట్టుండి నా కెందుకనో అవతలి ఒడ్డును చేరాలనిపించింది.

"ఇప్పుడే వస్తాను" అని రంగా రావుకు చెప్పి ఏకాంతంగా నీళ్ళనుండి నడుచుకుంటూ అవతలితీరం చేరి ఇసు కలో ముందుకు సాగాను.

వాతావరణం ప్రశాంతంగా వుంది.

ఎటు చూచినా, చుట్టూ మానవులు లేని నిర్జనప్రదేశం నిశ్శబ్ద సంగీతం!

సూర్యుని రధఘాటికి పరాజితులైన పడమటి రాజుల అవమానకళంకమా అన్నట్లు కారు చీకటి మరింక రాబోయే

సూచనలు—

మరికొంచెం ముందుకు పోయాను. వాతావరణంలో పిల్లగాలులు నన్ను పులకరింపజేస్తున్నాయి—ఆ నిర్మల వాతావరణంలో ఆ సువిశాలతల్లి క్షీరమా అన్నట్లున్న కృష్ణమ్మ పులినవేదికపై ప్రకృతిని కళ్ళతో తాగుతున్న రామూ—

దగ్గరికి పోయి చూచాను.

దరహసితవదనంతో గంభీరముద్రలో కూర్చొనివున్నాడు రామూ—

అతన్ని చూడగానే నా కెందుకో తొలి చూపులోనే అనిపించింది—ఇతడు పిచ్చివాడు కాడు—యోగి, అని!

నేను సమీపానికి వచ్చానన్న పరిజ్ఞానం కూడా లేకుండా అలాగే ప్రకృతిలో ప్రకృతిగా మారి కూర్చొని వున్నాడు రామూ—

చుట్టూ పరిశీలించి చూచాను—

అతని పక్కనే ఓ గీయబడ్డ చిత్రం వుంది.

ఆసక్తితో చేతిలోకి తీసుకొని చూచాను. ఆశ్చర్యపోయాను. బాగా చేయి తిరిగిన ఒక చిత్రకారుడు గీచిన బొమ్మలా వుందది—

"రామూ ..రామూ...." గట్టిగా పిలిచాను. నా పిలుపు ఈసారి వినిపించి నట్లుంది—ఈ లోకంలోకి వచ్చి నన్ను చూచాడు. ఒక్కక్షణం బిత్తరపోయాడు ఈ కొత్తవారెవరా అన్నట్లు.

"బాబూ నీపేరేకదూ రామూ"

"అవునండీ" కళ్లల్లో కొంచెం భయం.

"నీ వయస్సెంత"

"తెలీదు"

సుమారు పదిహేను పదహారేళ్లు దాటి వుండవనుకున్నాను— "నీవేం చేస్తుంటావు?"

"ఎంచేయను—పగలుపూట బస్సు దగ్గర మూటలు మోస్తాను."

"అదేంఖర్మ—హాయిగా బొలం పని చేయవచ్చుగా"

"నాకెందుకో ఏపనీ నచ్చదు—ఈ మూటలు మోసిన డబ్బులైనా రంగులు కొనుక్కోడానికే—ఆ డబ్బులు కండక్టరు మస్తానయ్య కిస్తే గుంటూరునుంచి రంగులూ కాన్వాసూ, తెచ్చిపెడతాడు."

రామూ వాడిన రంగులూ కాన్వాసూ చాలా చౌకబారువి. అయినాసరే చిత్రంలో అపూర్వమైన కళానైపుణ్యం వుంది. ఏ రవివర్మ చిత్రాన్నో చూస్తున్నట్లు నాకనిపించింది.

"ఈ బొమ్మ నీవే గీశావా?"

"అవునండీ—ఇవ్వాళే గీచాను—"

కృష్ణానదీ తీరం బాక్‌గ్రౌండ్‌గా తీసుకున్నాడు. అక్కడ ఒక నర్తకి నర్తిస్తున్నది—నిజం చెప్పవలసివస్తే ఆమె నర్తకి కాదు. కృష్ణానదీతీరంలో యుగయుగాలుగా ప్రవర్ధమానమైన శిల్ప కళాసుందరికి ఆమె సంకేతం. నేడు పతనమైపోయిన వైభవాన్ని, శిథిల

ఈ యేడు మావాడ్ని బళ్లో వేశాను సార్!! పదకొండు సంవత్సరాల తర్వాత వీడు ఎస్సెల్సీ పాసయ్యాక మీ కాలేజీలో వీడికో పీయూసీ సీటు ఇప్పించండి ప్రిన్సిపాలు గారూ!!

ప్రాయంగా మారిన ఆ సౌందర్యాన్ని సూచించే నిమిత్తం ఎరుపురంగూ నలుపు రంగూ పరివేషంగా వాడాడు. అలంకార శాస్త్రంలో ఒక్కొక్క రసానికి ఒక్కొక్క రంగును నిర్ణయించారు శాస్త్ర వేత్తలు అవన్నీ పిల్లవాడికి తెలుసునా??

అసంభవం—

మరి ఇంత ధ్వన్యాత్మకంగా, ఈ చిత్రం ఎలా గీచాడు??

"ఈ బొమ్మకు మోడల్ ఏమయినా వుందా?—"

"లేదండీ—నాకెందుకో ఉన్నట్టుండి ఓ బొమ్మ గీయాలనిపిస్తుంది. గీస్తాను అంతే—"

"నీవింకా బొమ్మలు గీచావా?"

"ఆఁ గీచానండీ—కానీ మా అయ్య "పొలంపని మాని పిచ్చిధవలా తిరుగుతున్నావా కుంకా" అని తిట్టి వాటిని పొయిలో పారేశాడండీ...." రామూ కళ్ల వెంట నీళ్లు వచ్చాయి.

నా హృదయం కలుక్కుమంది—

గుణాఢ్యుని హోమాలవంటివి నేటికీ సాగుతూనే వున్నాయన్నమాట!!

"చూడుబాబూ—నాపేరు దీక్షితులు. నేను హైదరాబాదులో వుంటాను. ఈ బొమ్మను నా వెంట తీసుకుపోతాను. అక్కడ లలితకళా ఎకాడమీ వాళ్లకి చూపి నీకు గుర్తింపు వచ్చేటట్లు చేస్తాను. అంతా నిన్ను పొగుడుతారు కూడా-ఏం, నా కిస్తావా మరి?"

రామూ ఓ క్షణం తెల్లబోయాడు.

కౌతుకమూ, సందేహమూ రంగరింపబడ్డ హృదయంనుండి పెల్లుబికిన రెండు మూడు మ్లానరేఖలు ముఖాన్ని ఆవరింపగా, ప్రశ్నించాడు, గుర్తింపూ పొగడ్తా ఎందుకు?"

ఇప్పుడు తెల్లబోవడం నావంతు.

"చూడు రామూ—నీవు మంచి కళా

కారుడివి. నీ కళను నలుగురూ చూచి మెచ్చుకోవద్దా—''

''వద్దు—ఈ బొమ్మలు గీయకపోతే నేను బతుకలేనండీ—అందుకనే గీస్తు న్నాను—'' ఆవేశంగా అన్నాడు.

కీర్తిప్రతిష్టలు కావు రామూకు కావల సినవి, తన రచనా వ్యాసంగం సాగడమే లక్ష్యం; చిత్రరచన లేకపోతే అతడు జీవించలేడు—అందుకనే హృదయాన్ని చీల్చి బొమ్మలు బహిర్గమింపజేస్తున్నాడు.

''చూడు రామూ — ఈ బొమ్మ కూడా పొయిలోకి పోక తప్పదు ఇక్క డుంటే—నన్ను నమ్మూ, నీకేమీ అన్యాయం చెయ్యను. నీ బొమ్మ సురక్షితంగా నా దగ్గిర వుంటుంది ఎప్పుడు కావాలంటే అప్పుడు పోస్టు ద్వారా నీకు పంపుతాను సరేనా—''

రామూ కొంచెంసేపు ఆలోచించి ''సరే''నన్నాడు—

నేను జేబులోంచి ఓ పది రూపాయల నోటు తీసి ఇచ్చాను. రామూ ఆశ్చర్య పడ్డాడు. తీసుకోవడానికి మొగమోట పడ్డాడు.

''తీసుకో, రామూ ఏమైనా కొనుక్కో— నీకు కావలసిన మంచి రంగులూ కాన్వాసూ నేను పోస్టుద్వారా పంపుతాను, వీలైతే హైదరాబాదు లలిత కళా ఎకాడమీద్వారా చిత్రవిద్య నేర్పించే స్కాలర్‌షిప్‌కై నీ కోసం ప్రయత్నిస్తాను.''

రామూ కళ్లల్లోని కాంతిరేఖలను నేను తేలికగానే అక్షరాల కిందికి అనువదించుకో గలిగాను. అతడు ఉబ్బి తబ్బిబ్బవుతూ కళ్లతోనే కృతజ్ఞతలు చెపుతున్నాడు—. పసిహృదయం పరవశం చెందుతున్నది.

నిరంతరం తిరస్కారాలకూ, బహి ష్కారాలకూ గురియైన రామూ మొట్ట మొదటిసారి నా నుండే ఓ దోసెడు సాను భూతికి నోచుకుంటున్నట్లున్నాడు చూడ బోతే.

అందుకే వర్షాకాలంలోని కృష్ణమ్మలా ఉప్పొంగుతున్నాడు—

చీకటి వ్యాపిస్తున్నది, ''వెళ్దామా ఇంక'' అని లేచాను. నా వెంట హుషా రుగా లేచి నడవసాగాడు రామూ. నేను అడగకుండానే తనకు నచ్చిన, తెలియ వచ్చిన విశేషాలన్నీ గబగబ చెప్పే స్తున్నాడు. నేను నిశ్శబ్దంగా వింటు న్నాను.

తాను పుట్టినదగ్గరినుండీ ఈ శిల్పాల మధ్యనే గోలీకాయలు ఆడుకుంటూ, గొడ్లు కాచుకుంటూ బతికేవాడట. చదువు కానీ, పొలంపనులు కానీ అబ్బలేదట. ఎప్పుడూ కృష్ణలో దూకి అటూ ఇటూ ఈదాలనీ, పండే పంటపొలాలలో పాలపిట్టలా దూరి పోవాలనీ కృష్ణ లంకలపై ఎవ్వరూ చూడ కుండా గెంతుతూ వుండాలని అనిపిస్తూ వుండేదట మనస్సుకు.—ఈ ఆనందాను భూతికోసం తల్లిదండ్రులు కొట్టినా సరే సహిస్తూనే వుండేవాడట. అప్పుడప్పుడూ అమరావతి శిథిలాల మధ్య పడుకొని

చేతితో వగిలిన బొమ్మలను నిమురుతూ అలాగే రాత్రీ పగలూ తేడా తెలియకుండా గడిపేవాడట....

కృష్ణను దాటి అవతలి ఒడ్డుకు చేరాము.

మా విద్యార్థు లప్పుడే అమరేశ్వరుని కోవెలలోకి వెళ్లి గంటలు గణగణ మని పిస్తున్నారు. నేనూ దైవదర్శనం చేసు కొని కొబ్బరిచిప్పను రామూకు ఇచ్చాను. వద్దనకుండా తీసుకొని అక్కడికక్కడే చిప్పమొత్తమూ తిన్నాడు.

రంగారావుకు కృతజ్ఞత చెప్పాను. అడ్రసు తీసుకున్నాను.

బాగా చీకటి పడింది.

మేమంతా తిరిగి టూరిస్టు బస్సు ఎక్కాము.

బస్సు దూసుకుంటూ గుంటూరురోడ్డు పట్టింది. రామూ, రంగారావూ చీకట్లో కలిసిపోయారు క్రమంగా....

చిత్రాన్ని భద్రంగా నా బాగ్‌లో దాచాను బస్సులో. ఓ రెండుగంటల సేపట్లో అమరావతినుండి విజయవాడ చేరాము—అక్కడ భోంచేసి విశ్రమించి మర్నాడేస్తతర్వాతి కార్యక్రమంలో సాగి పోయాము....

అలా ఓ పదిహేనురోజుల్లో టూరు మొత్తమూ ముగిసింది—ఈ ప్రయాణం దెబ్బతో ఒళ్లంతా హూనమైపోయింది. తిరిగి హైదరాబాదు చేరాక రెండురోజుల వరకూ మంచం దిగలేకపోయాను. ఆ తర్వాత గుడ్డలు సర్దుతుంటే రామూ ఇచ్చిన శిల్పసుందరి ఫొటో కన్పడింది. రామూగూర్చి ఈ రెండు వారాలలో పూర్తిగా మరిచేపోయాను నేను. దాన్ని ఫొటో తీయించి పత్రికలకు పంపాను. ఎకాడమీ కార్యదర్శిని కలుసుకొని బొమ్మను వారికిచ్చి "ఈసారి మీ ఆర్ట్ ఎగ్జిబిషన్"లో ప్రదర్శించమని కోరాను. రంగులూ, కాన్వాసూ చాలా ముతకగా వుండి రేఖలు అపరిమితంగా వున్నప్పటికీ వాటి వెనుక వున్న అగాధమైన భావుకతకు మాత్రం కార్యదర్శిగారుకూడా ఆశ్చర్యపోయారు. "ఈ అబ్బాయికి సెంట్రల్‌దో, స్టేట్‌దో స్కాలర్‌షిప్ ఒకటి ఇప్పించే ఏర్పాటు చేస్తాను దీక్షితులుగారూ" అని నాకు మాట ఇచ్చారు. మరుగునపడ్డ మాణిక్యాన్ని వెలికితెచ్చిన గౌరవం నాకే దక్కింది కదా నేను కొంచెం గర్వపడ్డాను కూడాను.

అన్నమాట నిలబెట్టుకుని కార్యదర్శి గారు సెంట్రల్ స్కాలర్‌షిప్ ఒకటి ఇప్పించి ఎకాడమీ విజయవాడ కేంద్రంలో శిక్షణకొరకు చేరవచ్చునని తెలిపారు. ఈ సంతోష వార్తను నేను రంగారావుకూ, రామూ తల్లిదండ్రులకూ తెలిపాను. "ఈ సదవకాశాన్ని జార విడుసుకోవద్దు. మీ పిల్లవానికి మంచి భవిష్యత్తు వుంది. గొప్ప చిత్రకారుడు కాగలడు. ప్రోత్స హించి పంపండి" అని రామూ తండ్రికి వ్రాశాను. ఓ వారంరోజుల్లో రామూ

తండ్రి తనకు చదువురాదు కాబట్టి ఓ చదువుకున్న వ్యక్తిచేత జాబు వ్రాయిస్తూ అవ్యాజంగా నేను చేసిన సహాయానికి కృతజ్ఞతలు తెలుపుతూ పిచ్చివాడైన తమ కొడుకును మంచి మార్గంలో పెడుతున్నందుకు ధన్యవాదాలు తెలిపారు. నేనూ సంతోషించాను.

ఇలా ఒక నెలరోజులు గడిచేసరికి ఓ విచిత్రం జరిగింది. నేను పంపిన రామూ శిల్ప సుందరి ఫొటో ఓ స్థానిక పత్రిక ప్రచురించింది. కొద్ది రోజుల్లో ఆ చిత్రం చాలా బాగుందని జాబులు కూడా పత్రికల్లో వచ్చాయి. కానీ ఒక జాబునుచూచి స్తంభించిపోయాను నేను. ఆ జాబు ఇలా వుంది.

"ఆర్యా!

తమరు గత సోమవారం 'రామూ' అనే వ్యక్తిపేర ప్రచురించిన 'శిల్ప సుందరి' చిత్రం ప్రఖ్యాత యూరప్ చిత్రకారుడు డాక్టర్ జంకిన్స్ గీచిన 'పిరమిడ్స్' అనే బొమ్మకు మక్కీకి మక్కీ కాపీ. ఇలాంటి తర్జుమా చిత్రాలు ప్రచురించడం ద్వారా మీ పత్రిక స్థాయిని కోల్పోతున్నందుకు చింతిస్తున్నాను. ఇట్లు పచ్చిపులుసు గుండారావు, రంగయార్ స్ట్రీట్, టి. నగర్, మద్రాసు-17."

ఈ ఉత్తరం చూడగానే నాలో కలిగిన భావాలు వెంటనే వర్ణించడం అసాధ్యం! కొంతసేపైన తర్వాత గుండారావు మీద నాకు బాగా కోపం వచ్చింది. మన తెలుగువాళ్ల తెలివి ఎలా వికసిస్తున్నదో తెలుసుకునేందుకీ ఉత్తరం ఒక ఉదాహరణ మనిపించింది. బెంగాలుప్రాంతములో ఒకవివేకానందుడుజన్మించినందుకు వేదాంతులూ, రవీంద్రుడు జన్మించినందుకు కవులూ కళాకారులూ, నేతాజీ జన్మించినందుకు దేశభక్తులూ అంతర్జాతీయంగా తమ ఘనతను చాటుకుంటున్నారు. కాని తెలుగుదేశంలోనో? ఖర్మ కాలి ఒక కళాకారుడికెక్కడైనా సన్మాన సభ జరిగితే చాలు ఇంక వదలకుండా ఈ విమర్శక వ్యాఘ్రాలు ఆయనకు సంతాప సభ జరిగేవరకూ నిద్రపోరు. ఎక్కడ ఒక వ్యక్తి పైకిపోతాడోనన్న భయంతో నిరంతరం కాళ్లకు తాళ్ళుకట్టి గుంజుతూనే వుంటారు. ఇంక ఈ దేశానికి విముక్తి ఏమిటీ? అనుకున్నాను. ఈ బాధతో నేను మధన పడుతూ వుండగా లలితకళా ఎకాడమీ రామేశ్వరరావుగారు ఫోను చేసి "దీక్షితులుగారూ మీ కో శుభవార్త. మీరు మాకిచ్చిన రాము గీచిన 'శిల్పసుందరి' చిత్రం నిన్నటి ఆర్ట్ ఎగ్జిబిషన్‌లో ప్రథమ బహుమతి గెలుచుకుంది" అని చెప్పారు. ఈ వార్త నన్ను కొంత ఊరట చెందించింది తాత్కాలికంగా. కానీ ఓ వారం లోపల ఆ పత్రిక సంపాదకులు ఇలా ఓ లేఖ ప్రచురించారు.

"ఇటీవల మేము ప్రచురించిన చిత్రం 'శిల్ప సుందరి'కి ఎకాడమీలో కూడా ప్రథమబహుమతి వచ్చినట్లు మాకు వార్త



" నీలాంటివాళ్ళ వల్ల ఈ సమాజానికి ఏం ఉపయోగం చెప్పు ? "
" లేకపోవడమేమిటి మిలార్డ్? నావల్ల నలుగురు పోలీసులకి చేతినిండా పని కాదా ? "

అందింది. అయితే ఇది డాక్టర్ జంకిన్స్ గీచిన 'పిరమిడ్స్' అన్న చిత్రానికి తర్జుమా అన్న విషయం ఒక పాఠకుడు మా దృష్టికి తెచ్చారు. ఇందలి నిజానిజాలు పరీక్షించిన అనంతరం 'శిల్పసుందరి' రాముగీచిన ఒరిజినల్ కాదనీ కాపీయేననీ మేము నిశ్చయించాము. కాపీ బొమ్మలు గీయడమూ కథలు వ్రాయడమూ ఎంత హీనమో మా తెలుగు పాఠకులకు వేరే మేము చెప్పనక్కరలేదు. ఈ శిల్ప సుందరి చిత్రాన్ని రామూపేర ప్రచురించి నందుకు మేము చింతిస్తున్నాము—ఇట్లు సంపాదకుడు."

ఈ లేఖ చదివేసరికి నా తల తిరిగి పోయినట్లనిపించింది. భూమ్యాకాశాలు కదిలిపోతున్నట్లనిపించాయి. ఆవేశంతో ఓ టాక్సీలో స్థానిక అమెరికన్ కల్చరల్ సెంటర్‌కు వెళ్లాను. అక్కడి అధికారి నాకు మిత్రుడే! నన్ను ప్రేమతో ఆహ్వానించాడు. యోగక్షేమాలు అడిగిన తర్వాత వచ్చిన పనేమిటని ప్రశ్నించాడు. 'యూరోపియన్ చిత్రకారుడు డాక్టర్ జంకిన్స్ గీచిన బొమ్మల ఫొటోల ఆల్బమ్ మీ దగ్గర వుందా? అని ప్రశ్నించాను. "ఆఁ వుంది — సవ్యాఖ్యానంతో ఓ ఆల్బమ్ వుంది చూడండి." అని వెంటనే నాకు అందించారాయన ఆల్బమ్‌ను ఓ రెండు నిమిషాల్లో. అందులో ఒక్కొక్క బొమ్మనే తిప్పుతూ పోయాను.

ఒక బొమ్మ దగ్గరకు వచ్చేసరికి హఠాత్తుగా ఆగిపోయాను. ఆ బొమ్మపైన 'పిరమిడ్స్' అని శీర్షికవుంది. క్రింద శిథిలమైన కొన్ని పిరమిడ్లూ, ఆబాక్ గ్రౌండు మీద ఓ శిల్పసుందరి నర్తిస్తున్నట్లు ఓ

చిత్రం వుంది—

నా గుండె స్తంభించిపోయినట్లని పించింది.

సరిగ్గా అది రామూ గీచినబొమ్మే?

ఏమీ భేదం కన్పడటం లేదు.

ప్రకృతి కోపగించినందుకు సూచనగా వాడిన అరుణరేఖల దగ్గరినుంచి యథా తథంగా అవే రంగులు అవే భావాలు. 'వాట్ హాపెండ్? (ఏం జరిగింది)'— కల్చరల్ సెంటర్ అధికారి నా భుజం తడుతున్నా కూడా నాకు స్మృతి సంపూర్ణంగా రాలేదు. అక్కడి జవాను ఓ గ్లాసు మంచినీళ్ళు యిచ్చాడు. అవి తాగిన ఓ అయిదు నిమషాలకు నేను ఈ లోకానికి వచ్చాను. రంగారావూ, రామూ కలిసి ఏదో దొంగనాటకం ఆడారని నాకు స్ఫురించింది. పల్లెటూరి ప్రకృతిలో ఇంత మోసమా?? అవును — ఆశ్చర్యం ఏముంది?? మొగలిపొదలలో మిణ్ణాగులు లేవా? పచ్చని పైరుపొలాల్లో పసిరికలు లేవా?? నా ఊహ కతీతమైన నాటక మిది—బాగా నాగరికత బలిసిన ఏ విదేశాలల్లోనో ఇలాంటిది జరిగితే నేను ఆశ్చర్యపోయేవాణ్ణి కాదు. కాని భారత దేశంలో, అందులోనూ తెలుగుప్రాంతాన ఓ పల్లెటూళ్లో ఇలా జరిగిందంటే నాకు నమ్మ శక్యంకాలేదు....జంకిన్స్ జీవితానికి సంబంధించిన ఓ పుస్తకం తీసుకొని మాట్లాడకుండా కల్చరల్ సెంటర్‌నుంచి ఇంటికి వచ్చేశాను. కొన్నాళ్లయినతర్వాత తీరిక చూసుకొని ఆ పుస్తకం చదవడం మొదలుపెట్టాను. జంకిన్స్ జీవితం చాలా విశిష్టంగా వుంది. పారిస్‌లోని వాన్‌గో-పికాసోవంటి ప్రముఖ చిత్రకారుల జీవితాలవలెనే జంకిన్స్ జీవితమూ చాలా ఆసక్తిదాయకంగా వుండి ఓ నవల వ్రాయడానికి సరిపోయినంత కథా కమామిషూ అందులో వున్నాయి. తీరిక దొరికినప్పుడల్లా ఓ పదిపేజీల చొప్పున అలా చదువుతూ వున్నాను.

ఇలా వుండగా ఓనాడు విజయవాడకు నేను జాబు వ్రాశాను. "రామూ అభివృద్ధిని గూర్చి మీ అభిప్రాయమేమిట"ని అక్కడి శిక్షణాధికారికి — దానికి సమాధానంగా ఆయ నొక సుదీర్ఘమైన జాబు వ్రాశాడు— ఆ వుత్తరం నన్ను కలవరపరిచింది.

"శ్రీయుతులు దీక్షితులుగారికి నమస్కారములు. మీరు వ్రాసిన రామూ ప్రముఖ చిత్రకారుడు కాగలడనడంలో సందేహంలేదు. అతని శిల్పసుందరి చిత్రం మీద వచ్చిన వివాదంకూడా నేను పత్రికల్లో చూచాను. అయితే కార్లైల్ మహాశయుడు చెప్పినట్టు భావాలనేవి శాశ్వతమైనవి. అందులో నూతనత్వమనేది ఎవ్వడూ సృష్టించలేడు. అవే నవ రసాలూ, అవే మానవ ప్రకృతులూ, అవే సంఘర్షణలూ సమన్వయాలూ, విషాదాంతాలూ సుఖాంతాలు కాకుంటే, వ్యక్తి వ్యక్తికీ ఉక్తిపై చిత్రం మారుతుంది.




అంతేకాదు. భావాలకు దేశకాల పరిమితులు లేవు. అనాదినుంచి అనంతంవరకూ అవి ఈ విశ్వంలో నిరంతరం సంచరిస్తూనే వుంటాయి. కాబట్టే కాళిదాసు భావాలు అనేకం మనకు కొన్నివందల సంవత్సరాల తర్వాత వేరే దేశంలో పుట్టినా అంతే, మహిమాన్వితుడైన కవి షేక్స్పియరులో అనేకం కన్పడుతాయి. అందుకే రామూ చిత్రాన్ని కాపీ అని నేను అనలేక పోతున్నాను. నా ఎదురుగానే అతను గీచిన ఒకటిరెండు చిత్రాలు నా దగ్గరున్నాయి. అలాంటివి ప్రాచ్య పాశ్చాత్య దేశాల్లోని ఏ కళాకారుడూ ఇంతవరకూ గీయలేదని నేను చెప్పగలను. ఇంత చిన్నవయసులో రామూ చూపించిన ఈ ప్రజ్ఞను నేనే నమ్మలేకపోతూ వున్నాను.

అయితే ఓ విచారవార్త. రామూ స్కాలర్‌షిప్ విరమించుకొని తిరిగి అమరావతి వెళ్ళిపోయాడు. అదేమని గట్టిగా నేను దబాయించాను. సామదానాదులన్నీ ప్రయోగించాను. చివరకు బెదిరించేసరికి భోరున ఏడుస్తూ ''అమ్మా నాన్నా కొడుతున్నారే, ఆ అమరావతిలోనే, ఆ శిల్పాల మధ్య ఇసుకతిన్నెల మధ్యా కూర్చుంటేనే నాకు బొమ్మలు గీయ బుద్ధి పుడుతున్నది. కృత్రిమమైన ఈ విజయవాడ నాగరికతలో నాలుగు గోడల మధ్య నేను బొమ్మలు గీయలేను. మరి బొమ్మలు గీయకుండా బతకనూలేను— కాబట్టి నన్ను వదిలిపెట్టండి వెళ్ళిపోతాను'' అని నీళ్ళనుండి గట్టున పడేసిన చేపపిల్ల లాగా గిలగిల కొట్టుకున్నాడు. అందుకని అతన్ని రిలీవ్ చేసి పంపివేశాము. అతనింక మా శిక్షణాకేంద్రం విద్యార్థి కాడు. అంత చక్కని వ్యక్తినుండి మంచి బొమ్మలు వచ్చేటట్లుగా ప్రోత్సహాన్నిచ్చి, కువిమర్శకుల ఆట కట్టించి కళాసేవ చేయవలసిన బాధ్యత ఇక మీరే తీసుకోవాలి. ఇట్లు

కార్యదర్శి. విజయవాడ. "ఈ లేఖ చదివి నేనూ చాలా బాధపడ్డాను. నిజమే! రామూ ఆ నిరంతర రామణీయకమైన ప్రకృతిలో తానూ ఒక ప్రకృతి. తానూ ఒకభాగం. అందుకనే ఆ కృష్ణాతీరం విడిచి అతడు జీవించలేడు. నదిలో ప్రతి రోజూ అలా సూర్యోదయమూ సూర్యాస్తమయమూ ప్రభాతమందలి ఉషస్సుషమా సాయంకాలపు రాగరేఖలూ చూడకుండా అతడు జీవించలేడు. ప్రకృతిమాత ఒడిలో నుండి అతన్ని బస్తీకి లాగి నేనే తప్పు చేశానేమో అనిపించింది—ఇలా అనుకుంటూ ఆరోజు రాత్రి తిరిగి జంకిన్, జీవితం చదువుతున్నాను... గ్రంథం ముగింపుకు వచ్చింది. పాశ్చాత్యచిత్రాల్లో భౌతికమైన రక్తమాంసాల సౌందర్యం ఎక్కువగా, ప్రదర్శింపబడుతుంది. జంకిన్స్ ఈ పద్ధతిలో బొమ్మలు గీచి గీచి, మదిరామదవతుల వ్యామోహంలో మునిగితేలి చివరకు భ్రాంతివదిలి మరణానికి ముందు కనీసం వచ్చే జన్మలోనన్నా ఆత్మసౌందర్యానికి ప్రాధాన్యమిచ్చే బొమ్మలు గీయాలనీ అందుకై ఏ అజంతా అమరావతీ శిల్పకళనో ఉపాసించేందుకు వీలుగా తన జన్మను భారతదేశంలో ప్రసాదించమనీ విలపించి విలపించి అసంపూర్ణమైన కోరికలతో తీరని ఆవేశాలతో ఒక విచిత్ర పరిస్థితిలో పారిస్‌లో జీవితం ముగించినట్లుగా వుంది. ఇది చదివి నేను తిరిగి తీవ్రమైన ఆలోచనలో పడ్డాను. భూమ్యాకాశాలు కలిసిన చోటు నుంచీ దూసుకొనిపోయే దేశకాలాల నతిక్రమించిన ఏవో సత్యాలు నాలో ప్రణవ ఘంటికలను మ్రోగించాయి. జంకిన్స్ వర్ణనా ఫొటోలు అతని శరీరంపై పుట్టుమచ్చల గుర్తులూ, వేసుకునే దుస్తుల వివరాలూ, అన్నీ ఆ పుస్తకపు అనుబంధంలో చేర్చబడ్డాయి. అవి చదివి ఆవేశంతో కలమూ కాగితమూ తీసుకొని రామూకు ఉత్తరం వ్రాస్తూ "నా ఆలోచనా ఉపపత్తీ హేతువాదానికి నిలువకపోవచ్చు. అయినా ఒక విషయం నేను నిర్ధారణ చేసుకోదలచాను. ఈ రెండు వాక్యాలుకూడా నీకు అర్థంకాక అయోమయంగా వుండవచ్చు—అయినా ఫరవాలేదు. నాకు ఈ ఒక్క విషయం స్పష్టంగా వ్రాయి నీకు కుడిభుజంపైన ఓ పుట్టుమచ్చ వుందా? బహుశా ఉండకపోవచ్చు. లేదని వ్రాస్తేనే ప్రపంచమూ నేనూ సంతోషిస్తాము. అదే సమంజసంకూడా. ఉందని వ్రాస్తేమటుకు ఇది ప్రపంచంలోని ఏడు వింతలతోబాటు పునర్జన్మకు సంబంధించిన ఎనిమిదవ వింత అవుతుంది. ఏ విషయమూ దీనితో జతపరచి స్టాంపులంటించిన కవరులో నాకు వెంటనే వ్రాయి...." ఉత్తరం పోస్టు చేశాను.

ఓ ఆరురోజుల లోపల దానికి జవాబు వచ్చింది,

" . . . ఔనండీ—నా కకుడ పుట్టుమచ్చ వుంది."



# మనకీ జీవితం చాలు

**పొండపాటి దేవదాసు**

రాయుడుగారు బస్టాండ్‌కేసి బయ ల్దేరారు.

రాయుడుగారు రోడ్డువెంట నడుస్తున్న తీరు సామాన్యంగా లేదు.

గర్వంగా తల పైకెత్తి ఠీవిగా హుందాగా అడుగులు వేస్తున్నారు.

ఆయన ఠీవికి హుందాతనానికి ఏ మాత్రం తీసిపోనట్లుం దాయన వేషం కూడా।

మల్లెపూవులా మెరిసిపోతున్న గ్లాస్గో పంచ—గోధుమవన్నె సిల్కు లాల్చీ—భుజంమీద జరీకండువా—నీట్‌గా వెనక్కి దువ్వబడిన సగంపైగా నెరిసిపోయిన జుట్టూ—చక్కగా పాలిష్ చేయబడి నిగనిగ లాడుతున్న అఫ్‌బూట్ కంకర రోడ్డుమీద టక్‌టక్‌మని శబ్దం చేస్తున్నాయి.

నిజానికి రాయుడుగారి వయసు ఇంచు

మించు అరవై ఏళ్ళయినా — ఆ ముస్తా బులో—ఆ నడుస్తున్న తీరునిబట్టి చప్పున ఓ పదేళ్లు తగ్గిపోయినట్లుగా అగుపిస్తున్నా రాయన.

"ఏం సుబ్బయ్యా! ఏమిటి విశేషాలు? ఎలా వున్నయి పైర్లు?' నడుస్తున్న వారివల్లా ఆగి అడిగారు రాయుడుగారు.

ఆ వీధి అరుగుమీద కూర్చున్న సుబ్బయ్య కాలుస్తున్న చుట్ట నోట్లోంచి తీసి "ఆఁ....ఏం పైర్లు! వర్షాల్లేక మల మల మాడిపోతున్నాయంటే నమ్మ! ఈ అదున్లో గనుక మాంచి వాన ఒక్కటంటే ఒక్కటి గట్టిగా కురిస్తేనా నా సామిరంగ అప్పుడడుగుతావూ పైర్ల సంగతి?'

"అదున్లో కురవాలని వర్షానికిమాత్రం తెలీదుటయ్యా! దానికి బుద్ధీ జ్ఞానం లేదను కున్నావా? వుంది, ఎవడికోసం కురు స్తుందీ! కురిసి తీరుతుంది. మరేం దిగులు పడబోకు సుబ్బయ్యా:"

బయల్దేరారు రాయుడుగారు.

"ఏమోయ్ నరసింహులు!"

రాయుడుగారి పిలుపు విని ఎవర్తోనో మాటాడుతున్న నరసింహులు హఠాత్తుగా ఆ సంభాషణని ఆపి గబగబ రాయుడు గారి దగ్గిరగా వచ్చాడు.

"ఏమిటోయ్ విశేషాలు? ఆఁ. ..మర్చి పోయాను, ఎలా వుంది మీ అబ్బాయిల పరిస్థితి? ఏమైనా పొదుపుల్లో పడ్డా రంటావా? ఇంటికేమాత్రం పంపు తున్నారు?" తిరిగి ప్రశ్నించారు రాయుడు గారు.

"ఏం చెప్పమంటావోయ్ రాయుడూ! నాకు కొద్దో గొప్పో ఆస్తిపాస్తులున్నయి. కానీ సుఖం శాంతీ అనేవి రెండూ లేవు. నీకు ఆస్తిపాస్తుల్లేకపోయినా నాకు లేనివి రెండూ నీలో పుష్కలంగా వున్నయి. నువ్వు అదృష్టవంతుడివి ఏమైనా నేనీ జన్మలో రాయుణ్ణి కాలేను! అలాగే నా కొడుకులూ రాయుడు కొడుకుల్లాంటివాళ్లు కాలేరు, ఇది నిజం. ఇంక వివరాలు నన్నడక్కు.'

"ఒరి నీ అసాధ్యం గూల: అలా ఇదై పోతావేమిటోయ్? కాస్త మెసులు బాటు చూసుకుని వాళ్ళే పంపుతార్లే మరేం బెంగపడకు!'

ఈసారి ఉప్పొంగిపోతూ నడుస్తున్నారు రాయుడుగారు.

"హల్లో! రామనాథంగారూ!"

మలుపు తిరగబోయిన రామనాథం రాయుడుగారి పిలుపు విని ఆగాడు.

"ఊళ్ళోకొచ్చిగూడా కనపడటంలేదు! కులాసా! ఇప్పుడెక్కడా ఉద్యోగం? గుంటూర్లోనేనా? అదే స్కూలా?"

"అవునండీ!' రాయుడుగారి ప్రశ్న లకి సమాధానంగా అన్నాడాయన.

'వెరీ గుడ్! వెరీ గుడ్! ఆఁ... మనం కలిసి అయిదేళ్ళు పైగా గడిచి పోయింది కదూ! అది సరే ఈ సంగతి విన్నావా? మా అబ్బాయిలిద్దరూ ఆఫీస ర్లయ్యారు. దర్జాగా వున్నార్లే! గర్వంగా



యువ

తలెగరేసి లాల్చీ జేబులోంచి విల్సు సిగరెట్ పెట్టె బయటికి తీసి, తానొకటి అంటించి మరొకటి రామనాథానిక్కూడా ఆఫర్ చేశారాయన.

ఇద్దరూ సిగరెట్లు కాలుస్తున్నారు.

"ఏమిటండీ అలా చూస్తున్నారు? నేను రిటైరై పోయాను. ప్రస్తుతం ఖాళీ! మరి వస్తా, బస్సొచ్చే వేళైంది" అంటూ గబగబ అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయారు రాయుడుగారు.

తన విషయాలేవో చెప్పుకుందా మను కున్న రామనాథం ఒక్కసారి గతుక్కు మని గుడ్‌బై చెబుతున్నట్లు మవునంగా చెయ్యి గాల్లో వూపి తనదారిన వెళ్ళి పోయాడు.

ఉద్యోగం చేస్తున్న రోజుల్లో సుబ్బా రాయుడు — ఈ భూమ్మీద సమస్య లన్నింటినీ తానొక్కడే భరిస్తున్నట్లు ఒంగిపోయి నడిచేవాడు. ఆ మనిషిలో— నడకలో—ఠీవి, హుందాతనం మచ్చుకైనా కనిపించేవి కావు: ఒక్కమాటలో అప్పటి సుబ్బారాయుడు వేరు. అందు క్కారణాలు లేకపోలేదు. అప్పట్లో ఆయనొక మహా యజ్ఞాన్ని ప్రారంభించాడు మరి.

ఆయనకి ఇద్దరే కొడుకులు. అలా వాళ్ళు ఆయనకి సంక్రమించిన సిరి సంపదలు. తనలోనుంచి వచ్చిన వాళ్ళిద్దరి భావిజీవితాల్ని తాను అందంగా తీర్చిదిద్ది సమర్థుడైన తండ్రిగా తన కర్తవ్యాన్ని నెరవేర్చుకోవాలనుకున్నాడు. ఆ బరువు బాధ్యతలు మేరు పర్వతానికి మించినవని ఆయనకి తెలుసు. అయినా ఆయన జంక లేదు. వెనకడుగు వేయలేదు.

తన కొడుకుల ఉజ్వల భవిష్యత్తు కోసం ఆ బరువుని పదిలంగా పట్టుకుని ప్రేమతో—ఆత్మ స్థయిర్యంతో నెత్తిన పెట్టుకున్నాడు,

తనలోని సరదాలు—షికార్లు—సుఖాల తాలూకు తలపుల్ని ఐచ్ఛికంగా సునా యాసంగా గట్టిగా మూసేశాడు.

అంచాతనే ఆయనా రోజుల్లో ఎవరి తోనూ మాట్లాడేవాడు కాదు. అసలా తీరుబడే లేదాయనకి. సీట్లో కూర్చుని ఎప్పుడూ లెక్కలువేస్తూ హడావుడిగా వుండేవాడు.

తలెత్తితే ఏ దృశ్యాలు కనిపించి తను ప్రారంభించిన యజ్ఞాన్ని భంగపరు స్తాయా? కనిపించిన ప్రతివాడితో బాతా కానీ వేస్తే తన లెక్కలెక్కడ మారి పోతాయో అని అనుక్షణం జాగ్రత్త పడేవాడు.

ఆయనా రోజుల్లో హోటళ్ళకి వెళ్ళడం చాలా అరుదు, వెడితే చిన్నహోటల్లోకెళ్ళి టీ నీళ్ళతో తృప్తిపడి వచ్చేవాడు,

నీ బట్టలేమిటి? నీ తిండీతిప్పలేమిటి? అలా గజిబిజిగా వుండటమేమిటని ఆయన సన్నిహిత స్నేహితుల్లాంటి వాళ్ళు ఎవ రడిగినా సరే ఆయన చెప్పే స్లోగన్- వినాదం సణుగుడు గొణుగుడు అన్నీ ఒక్కటే: "నా పిల్లలు పై చదువుల్లో

వున్నారు. వాళ్ళని ఒడ్డెక్కించాలి. అందుకు నేనింకా ఎంతో జాగ్రత్తపడాలి'' అని.

ఆ రోజుల్లో ఒకసారి ఆఫీసు గుమాస్తాలంతా కార్తీకమాసం సందర్భంలో పిక్నిక్ ప్రోగ్రాం వేశారని, పది రూపాయలు చందా యివ్వాలని సుబ్బారాయుణ్ణడిగారు.

పది రూపాయల చందా కేవలం అక్కడ కెళ్ళి ఏదో చెత్త తినటానికి ఒక్కొక్కడికి పది రూపాయల చందానా? చూస్తే ఒక్కొక్కడికి అరడజనుమంది పిల్లలు. సంసారాలు గడవక తను విలాసాలకి అప్పుచేసి పప్పుకూడులా గడిపే వెధవలకి పిక్నిక్కులు—పార్టీలు—వన భోజనాలు కావలసివచ్చాయా?

పిల్లలున్నారు వాళ్ళ చదువులేమిటి? భవిష్యత్తేమిటి? ఈ బరువు బాధ్యతల్ని ఒక్కడూ ఆలోచిస్తున్నట్లు కనపడరేం? ఇంట్లో ఈగలమోత బయట పల్లకీల మోతన్నట్లు వీళ్ళ బ్రతుక్కి నెలకి రెండు పిక్నిక్ ప్రోగ్రాంలూ—నాలుగు పార్టీలు వీళ్ళాను. వీళ్ళు వుద్యోగులా? పిల్లలకి తండ్రులుకాదు. ఫూల్స్ బ్రూట్స్—ఏ క్లాస్ రోగ్స్.

''మీరంతా బరువు బాధ్యతల్లేనివాళ్ళు. భాగ్యవంతులు. మీ రెన్ని సార్లన్నా పిక్నిక్కులకి పోతారు. కానీ నేను మీతో తూగలేనివాణ్ణి. నాకు చాలా బాధ్యతలున్నాయి. ఈ పది రూపాయలు బెనారస్‌లో చదువుతున్న నా బిడ్డలకే పంపితే ఎందుకైనా వుపయోగించుకుంటారు. నేను రాలేను. రాను. మరెప్పుడూ నన్నిలా అడగవద్దు'' అని వెంటనే తన పనిలో మునిగిపోయేవాడు.

పిసినారి—మొండివాడు—పాషాణుడు—ఇలాంటి మాటల్ని సుబ్బారాయుడువినేలా హేళనగా అనేవాళ్ళు గుమాస్తాలు.

ఆ మాటలు తనకి ములుకుల్లా గుచ్చుకున్నట్లనుకునేవాడు కాదు. మధురంగా స్మరించి తన పట్టుదలని ఇనుమడింప జేస్తున్నట్లుగా భావించే వాడాయన.

అలా తన పట్టుదలని—కార్యదీక్షని ఆత్మస్థయిర్యాన్ని కొన్ని సంవత్సరాలు జాగ్రత్తగా పోషించుకుంటూవచ్చి చివరికి తనయజ్ఞాన్ని జయప్రదంగా ముగించాడు.

తనమీదున్న బరువుని దించుకుని తృప్తిగా నిట్టూర్చాడు. అలసి సొలసిన ఆయన ప్రాణానికి ఎంతో విశ్రాంతి లభించినట్లయ్యింది.

కొడుకులిద్దరూ ఆఫీసర్లు కావడంతో సంపూర్ణస్వేచ్ఛా — సంతృప్తి నిండిన మనిషై సుబ్బారాయుడల్లా రాయుడుగార్లా మారి ఏపుగా పెరిగిపోయాడు.

కొడుకు లిద్దరూ చెరోలక్షా అనుకున్నాడాయన. వాళ్ళిద్దరూ ఆయనవెనుక మేరు పర్వతాల్లా నిల్చి అపూర్వ చైతన్యంతో—ఆనందోత్సాహాల్లో ప్రశాంతవాతావరణంలో నడిపిస్తున్నట్లుగా అనుభూతి చెందుతున్నాడాయన.

ఆయన కేవలం కొడుకుల్ని—వాళ్ళ




హోదాలు చూసుకుని దర్జాగా బతుకుతున్నారు. కైలాసపర్వతాన్ని తాను బహు తేలిగ్గా ఎత్తగలిగానని పలుమార్లనుకుని తనలో తాను యెంతో గర్వపడుతుంటారు

రాయుడుగారు బస్‌స్టాప్‌లో నిల్చుని మరో సిగరెట్ వెలిగించారు.

ఆ వూరికి రెండుమైళ్ళ దూరంలో బస్తీ వుంది.

ఇంతలో దూరంగా బస్సు వస్తున్న శబ్దం విన్పించింది, ప్రయాణీకులంతా బిలబిలమంటూ లేచారు.

బస్సు వేగంగా వస్తోంది. ఆగే సూచనలు కనిపించలేదు. రాయుడుగారు జరీ కండువాని హుందాగా విదిలించి భుజం మీద వేసుకుని తన విగ్రహం వీలైనంత స్పష్టంగా—ఆ డ్రైవర్ గుర్తించేలా ఆంజనేయులు వారు అసలురూపం ప్రదర్శిస్తున్న భంగిమలో నిల్చున్నారాయన.

బస్సు ఆగదన్నట్లు హారన్ వినిపిస్తూ వెళ్ళిపోయింది,

రాయుడుగార్కి కోపమొచ్చింది.

ఈ బస్సులవాళ్ళకి కళ్ళు పొరలు గమ్మాయి. ఎక్కడ ఏ మనిషి నిల్చున్నాడన్న దృష్టి బొత్తిగా లేకుండాపోయింది. చూస్తాను వీళ్ల వ్యవహారమేమిటో! వెడుతున్న బస్సువేపు కసిగా చూశారు రాయుడుగారు.

మరో పదినిమిషాలు గడిచాయి.

ఈసారి బస్సువచ్చి ఆగింది. రాయుడుగారు దాని చేరువగా వెళ్లి లోపలకి చూశారు. నిలబడిన జనం ఒకరిమీద ఒకర్ని వేసి తాడుతో కట్టేసినట్లు కిటకిటలాడిపోతున్నారు.

ఇది బస్సా! చిన్నసైజు నరకంలా వుంది. నే నిందులో ఎక్కడమా!; ఎక్కలేనంతే! అనుకున్నాడు.

బస్ బయల్దేరి పోయింది.

రాయుడుగార్లో అసహనం పెరిగిపో తోంది. గడియారం చూసుకున్నారు. పావుతక్కువ ఎనిమిదైంది. విసుగ్గా చేతిలోని సిగరెట్‌ని నేలకేసికొట్టారు.

ఎనిమిదిన్నర దాటితే ఆ హోటల్లో ఆ కమ్మని ఇడ్లీలుండవ్! ఆ చట్నీ—ఆ నెయ్యీ అన్నీ కల్తీ అయిపోయి రుచి లేకుండా పోతాయి. మరోసారి పురజను లందరి కోర్కె తరపున కురుక్షేత్రం నాటకాన్ని మళ్ళీ ఆడమని ఆ సమాజం వారి నడగాలి.

వెధవ బస్సులు—డొక్కు బస్సులు. ఇవి లేకపోతే ప్రయాణాలు చెయ్యలేమా?

"ఏయ్ జట్కా!" పొలికేక పెట్టారు రాయుడుగారు.

ఓ జట్కా వచ్చి ఆయన ముంద రాగింది.

రాయుడుగారు జట్కాలో కూర్చుని "పోనీవోయ్ త్వరగా!" అన్నారు.

"తమరొక్కరేనా? ఇంకా ముగ్గురన్నా వస్తే.... ...!" జట్కావాలా మాటలు పూర్తికాకముందే మధ్యలో అందుకుని "నాకు తెలుసులే పోనీవోయ్! ఊఁ.... త్వరగా—ఆ బస్సుతో సమానంగా వెళ్లాలి."

రాయుడుగారి మాటలకి హడలిపోయిన జట్కావాలా చక్‌మని జట్కాలో ఎక్కి "చల్" అన్నాడు.

గుఱ్ఱం పరుగు లంకించుకుంది.

రాయుడుగారు మామూలుగా కాఫీ టిఫిన్లు తీసుకునే హోటల్‌కి ఇవతలగా జట్కా దిగి పర్సులోంచి డబ్బుతీసి జట్కావాలాకిచ్చి "ఇది చాలా?" అన్నారు.

జట్కావాలా చేతిలో డబ్బుచూసు కుని కృతజ్ఞతగా చేతులు జోడించాడు రాయుడుగార్కి.

అలా నాలుగడుగులు ముందుకువెళ్లిన రాయుడుగారు హఠాత్తుగా వెనక్కి తిరి గొచ్చి ఎందుకో ఓ మాటు జట్కాలోకి తొంగి చూశాడు

"ఏం బాబూ! కళ్ళజోడేమైనా మర్చి పోయారా?" అన్నాడు జట్కావాలా ఆదుర్దాగా.

అతని వేపు చురుగ్గా చూశారురాయుడు గారు.

"కళ్ళజోడు ఒకప్పుడుండేదోయ్; దాన్ని తీసేసి అయిదేళ్ళయ్యింది .. అయిదేళ్ళు!!.... ముసలాణ్ణిగదా చూపు బాగా కనబడదనుకున్నావేమో? ఈ మధ్య మరింత పెరిగిందోయ్. ఇప్పుడు నా కళ్ళు మహా దర్జాగా కన్పిస్తున్నాయిలే! సరే. . సరే ... మళ్ళీ బాడుగేదన్నా చూసుకో!" అంటూ ముందుకు నడిచారు రాయుడు గారు.

ఎప్పుడూ వెధవది ఈ హాల్లోనే కాఫీ తాగటమేమిటని సరాసరి వెళ్ళి ఆదే హోటల్లో ఎయిర్‌కండిషన్డు రూంలోకెళ్లి కూర్చున్నారాయన.

సర్వరొచ్చాడు.

సర్వర్ రాయుడుగార్ని ఓసారి పరిశీలనగా చూసి రెండు నిమిషాల్లో ఇడ్లీ తెచ్చిపెట్టాడు.

ఇడ్లీలు తింటున్న రాయుడుగారు సర్వర్ని ఓ చోట నిలకడగా నిలబడ నివ్వలేదు

ముసలాయన గొప్ప సరదా మనిషను కున్నాడు సర్వర్.

"ఇదిగో అబ్బాయి ఇలా రా!"

సర్వర్ గబగబ వచ్చాడు.

"ఓ కాఫీ పట్రా! కాఫీ అంటే ఎలా వుండాలి? బ్యూటిఫుల్ కాఫీ—స్పెషల్ కాఫీ పట్రా! బిల్లు అయిదు రూపాయలైనా వేసుకో! నా కభ్యంతరం లేదు, కాఫీ మాత్రం చాలా బావుండాలి. నాకు జబ్బేం లేదు. పంచదార ఎక్కువే వెయ్. కమాన్ త్వరగా వెళ్ళివచ్చేయ్".

ముసలాయన మంచి జోరుమీదున్నాడే? అనుకుని సర్వర్ వెళ్ళి కాస్త ఆలస్యమైనా మంచి కాఫీనే తెచ్చిపెట్టాడు.

కాఫీ ముగించి కౌంటర్లో బిల్లు చెల్లించి వక్కపలుకులతోపాటు మళ్ళీ ఓ సిగరెట్ అంటించి అలా రోడ్డు వెంట నడుస్తూ బయల్దేరారు రాయుడుగారు.

అలానడుస్తూ మలుపు తిరగబోయిన రాయుడుగార్కి ఎదురుగ్గా భోజనహోటల్ ముందర 'యాత్రాస్పెషల్!' అని పెద్ద అక్షరాల్తో వ్రాయబడివున్న బోర్డు కనిపించింది.

గబగబ నడుచుకుంటూ దాని ద వెళ్ళా రాయన. కాశీ రామేశ్వరం బదరీనాథ్ మొదలుదేశంలో దాదాపు క్షేత్రాలన్నింటికి స్పెషల్ రైలు బ తోందని—భోజన సదుపాయలు—ఛ వగైరాలన్నీ వివరంగా రా వున్నాయి.

రాయుడుగారి ఆలోచనలు ఒక యాత్రల మీదికి మళ్ళాయి.

ఇంత గొప్ప యాత్రలు చే వాళ్ళు ఎలాంటివాళ్ళయి వుం డబ్బున్నవాళ్ళయ్యుండాలి. ఇలా యాత్రలు ఎప్పుడు చెయ్యాలి? జీవి అనుకున్నవన్నీ భగవంతుడు జరి తీరుబడి చిక్కినప్పుడు ఈ యా తలపెట్టాలి! ఇలాంటి యాత్రలు కోసం చేస్తారు? మనశ్శాంతికోసం వంతుని జ్ఞాపకాల్తో తరించే నిమి

"ఇదుగో! దీనికి సంబంధించి ఎవరిక్కడ?" తలెత్తి ఎదురుగ్గా ని ఓ పదహారేళ్ళ కుర్రాణ్ని చూసి రాయన.

"లోపలున్నారు సార్! మంటారా?"

"ముందా కుర్చీ తెచ్చి ఇక్క తరువాత వెళ్ళి పిలువ్?"

ఆ కుర్రాడు అలాగే కుర్చీ

వేశాడు. రాయుడుగారు కూర్చున్నారందులో.

"నమస్కారం రాయుడుగారూ!"

"ఓ మీరా రంగారావుగారూ! ఏజంటంటే ఇంకెవరో అనుకున్నాను. వెరి గుడ్ చాలా మంచి ఏర్పాటు చేశారు.

"మీలాంటివారికోసమే ఇలా ఏర్పాటు చేశాం సార్:"

"భేష్? చాలాబాగుంది. మన పేర ఓ టిక్కెట్ రాసుకోండి"

"తప్పకుండా సార్!' అంటూ అతను టిక్కెట్లపుస్తకం తెచ్చి రాయబోతున్న వాడల్లా ఆగి—"అంతపైకం ఇప్పుడు తెచ్చివుంటారా? ముందుగా మీరనుకొని వుండరుగదా!" అన్నాడు.

ఎంత అందంగా అడిగాడు డబ్బు విషయము? శభాష్! చాలా గొప్పగా అడిగాడు, వ్యాపార దక్షతంటే అలా వుండాలి.

"అయాం సారీ! నిజమే ముందుగా అనుకోలేదు. మీరు చెప్పిందే నిజం అయితే రేపే మా అబ్బాయిలకి ఉత్తరాలు రాస్తాను. చెరో నాయిగొందలు టి.ఎం.ఓ. ద్వారా పంపమని.

"మీకేమిటిసార్! మీరొక్కరే కాదు. మరో నలుగుర్ని వెంట తీసుకెళ్ళగలరు."

"దట్సాల్ రైట్! ఎల్లుండి కలుస్తాను." అంటూ బయల్దేరి వెళ్లారు రాయుడుగారు.

ఆ డ్రామా కంపెనీ వారితోకూడా మాట్లాడి సాయంత్రానికి ఇల్లుచేరుకున్నారాయన.

కొడుకులిద్దరికీ ఉత్తరాలు రాయడం ముగించారు రాయుడుగారు. కవర్లుమూయబోయేముందర పెద్దకొడుక్కి రాసిన ఉత్తరాన్ని మరోమాటు చదవటం ప్రారంభించారు.

చిరంజీవి చంద్రానికి!

నేనిక్కడ క్షేమంగా వున్నాను. చిన్నవాడూ, నువ్వూ రాసిన వుత్తరాలు చేరాయి. మీ అందరి క్షేమ సమాచారాలు తెలుసుకుని చాలా సంతోషించాను.

పోతే ఓ ముఖ్య విషయ్యం! నేను తీర్థయాత్రలు చేయ సంకల్పించుకున్నాను. అందుకనుకూలంగా త్వరలో ఇక్కణ్ణుంచో స్పెషల్ రైలు బయల్దేరబోతోంది. దేశంలో దాదాపు పుణ్యక్షేత్రాల్ని చూసిరావటానికి ఇదో గొప్ప అవకాశంగా భావిస్తున్నాను.

యాత్రలూ అనగానే మీ అమ్మ గుర్తుకొస్తోంది.

ఓ సారి—చిలకలపూడి పాండురంగడి ఉత్సవాలకి వెడదామని చెవుల్లో ఇల్లుకట్టుకునీ పోరింది మీ అమ్మ ఆ రోజుల్లో. అందుకు అతికష్టంమీద ఒప్పుకున్నాను.

పాండురంగడి ఉత్సవాలు—లక్కడ కొచ్చే వేలాదిజనం- కార్తీక పౌర్ణానికి స్నానాలు చేసే జనసందోహం—ఆ జనం సంగతి మీకు వివరంగా రాయనవసరం లేదు.




రేపు తిరిగి బయల్దేరతామనగా మీ అమ్మ "ఏమండీ! ఇక్కణ్ణుంచో బస్సు తీర్థయాత్రలకి బయల్దేరుతోందిట—పిల్లలు కూడా దగ్గర లేరుగా మనంకూడా వెళ్ళొద్దా మండీ!" ఎంతో ఆశగా అడిగింది.

అప్పుడు దాని మాటలకి నాకు చాలా కోపమొచ్చింది. "నీ కిప్పుడు యాత్రలు కావలసి వచ్చాయా? పిల్లలు దగ్గర లేకపోతే బాధ్యతలు దూరమవుతాయా? వాళ్ళ భవిష్యత్తు మన చేతుల్లోవుంది. ఈ సంగతి మర్చిపోయి మన కోర్కెల కళ్ళెం విప్పితే —మన పిల్లలు నిష్ప్రయోజులౌతారు. ఇప్పట్లో మనకి యాత్రల్లేవు, సుఖాల్లేవు. మన లక్ష్యాల్ని పెడమార్గం పట్టించే మరే ముచ్చట్లూ మనకొద్దు." అన్నాను చాలా కఠినంగా.

పాపం అది ఏమనుకుందో, జాలిగా, దీనంగా, విచారంగా, భయంగా నావేపు చూసింది నాకు జాలేసింది.

"మనిద్దరం సంతోషంగా, హాయిగా యాత్రలుచేసే రోజులు దగ్గరపడ్డయ్. మరేం దిగులు పడకు." అని సముదాయించి ఇంటికి తీసుకొచ్చాను.

ఆనాటి మా బంగారు కల ఇప్పటికి నిజమైంది. కానీ చంద్రం దురదృష్టవంతురాలు సరిగ్గా ఇప్పుడేలేకుండా పోయింది.

మీరంతా మీ అమ్మ చచ్చిపోయిందనుకుంటున్నారు కాదోయ్—మీ అమ్మ చచ్చిపోలేదురా! దానికి చావులేదు. నాలో-నా మనసులో నిత్యం బతుకుతూనే వుంది. ఇది మీ కర్థంకాదు.

ఇన్నాళ్లూ నా కష్టాల్ని మీ అమ్మకి పంచి యిచ్చిన వాడిన్నేను.

ఇవాళ ఇంత భాగ్యాన్నీ నేనొక్కణ్ణీ దోచుకునే దొంగనై పోయాను.

ఈ భావం దూరం కావాలంటే నా మనసునిండా బతుకుతున్న మీ అమ్మతో నే నీ యాత్రలు చేసితీరాలి.

ఈ ఉత్తరం చూసిన వెంటనే నాలు గొందలు తక్కువకాకుండా పైకం పంపించు. చిన్నవాడికి ఈ విషయమై ఇలాగే ఉత్తరం రాస్తున్నాను...

ఆశీస్సులతో
మీ
నాన్న."

చదవడం పూర్తిచేసిన రాయుడుగారు భార్య జ్ఞాపకాల్తో నీటితోనిండిన కళ్ళని తుడుచుకుంటూ కొద్దినిమిషాలు మౌనంగా వుండిపోయారు.

తరువాత రెండు కవర్లూ అంటించి ఒకటి పెద్దకొడుకుపేర హైదరాబాద్ కీ—రెండోది చిన్నకొడుకుపేర విశాఖపట్నానికీ పోస్టు చేశారాయన!

మూడురోజులు గడిచిపోయాయి. కొడుకుల దగ్గర్నుంచి మనియార్డర్లు రాలేదు. ఆశ్చర్యపోయారు రాయుడు గారు.

మరో రెండు రోజులు గడిచి పోయాయి. యాత్రాస్పెషల్ ఏజంటు రంగారావు కనిపించాడు. టిక్కెట్లు అయి పోతున్నాయి. త్వరపడమని జ్ఞాపకంచేసి వెళ్ళాడు.

రాయుడుగార్లో రకరకాల ఆలోచనలు పోయాయి.

ముష్టి నాలుగొందలు పంపడం వాళ్ళకో లెక్కా! అయితే మరెందు కాలస్యం చేశారు! సమయానికి చేతిలో డబ్బు లేదా! నాన్సెన్స్ లేకపోతే టెంపరరీ అడ్జస్టుమెంట్ గా ఎవడిదగ్గరన్నా తీసుకుని పంపవచ్చుగా? వాళ్ళు చదువుకునేరోజుల్లో తానలా పంపలేదా? వాళ్ళు వంద పంపమని రాస్తే రెండొందలు చొప్పున పంపేవాడు. తన దగ్గర లేకపోతే తన పరపతి నుప యోగించి చేబదులు పుచ్చుకుని టి.ఎం.ఓ. చేసేవాడు.

తన పిచ్చి ఊహలుగానీ — వాళ్ళే క్యాంపుల్లో వున్నారో? అసలు ఉత్తరాలు చూసుకున్నారో లేవో? అనవసరంగా లేని పోనివన్నీ ఊహించుకుని బాధపడుతున్నా నేమో? అయినా వాళ్ళకేం? మామూలు గుమాస్తాలా? వాళ్లు ఆఫీసర్లు! వాళ్ళకి సవాలక్షపనులుంటయ్. బోడి నాలు గొందలు వాళ్ళకో సమస్యా?

అన్నివిధాలా తనే వెళ్ళడం బాగుం టుంది. వాళ్లనిచూసినట్లు. పని జరిగినట్లూ వుంటుంది.

* *

ఆఫీసు ముందర కొద్దిగజాల దూరంలో రోడ్డుమీద రిక్షాదిగి ముందుకి నడుచు కుంటూ వొస్తున్న రాయుడుగార్ని చూశాడు జవాన్ గంగులు.

చేతిలో కాల్తున్న బీడీని అవతల పారేసి గబగబా ఆయన కెదురెళ్ళి— "దణ్ణాలు బాబుగారూ! కులాసాగా వుండారా? మల్లీ శానాళ్లకొచ్చారు."

అన్నాడు ఎంతో వినయంగా.

నీ పేరు గంగులు కదూ! బాగున్నావా! నీ భార్యపిల్లలంతా కులాసగా వున్నారా?'' ప్రేమగా అడిగారాయన.

"తమ దయవల్ల అంతా కులాసాయే బాబూ!''

''వెరీగుడ్ . వెరీగుడ్ .. అబ్బాయున్నాడా ఆఫీసులో'',

''ఆఁ ఆఁ వుండారు బాబూ! దయచేయండి లోపలకి'', అంటూ దారి తప్పుకున్నాడు గంగులు.

బూట్లచప్పుడు విన్న మానే జరు తలెత్తి చూశారు. చెయ్యెత్తు విగ్రహంతో ఠీవీగా వస్తున్న రాయుడుగారగుపించారు.

' నమస్కారమండీ! కులాసా? ఇదేనా రావడం?' .అంటూ కుర్చీలోంచి లేచారు మానేజరు.

రాయుడుగారు ప్రతినమస్కారంచేసి మానేజరు సీటు దగ్గరగా వెళ్ళి—''ఇదే రావడం మీరంతా కులాసానేగద! అన్నట్లు మర్చిపోయాను. మీ అబ్బాయికి మెడిసన్ సీటొచ్చిందా?''

''ఎప్పుడో వచ్చిందండీ! ఇప్పుడు వైజాగ్‌లో చదువుతున్నాడు''

''గుడ్! చాలా సంతోషం. మొత్తం మీద పిల్లవాణ్ని ప్రయోజకుణ్ని చేశారు. మిమ్మల్ని మనసారా అభినందిస్తున్నాను''

''అబ్బాయి అంటూవుంటాడు మీ గురించి. నిజంగా మీ తపస్సుముందు నేనెంతటివాణ్నిలెండి.''

''మనదేముందండీ! అంతా ఆ పైవాడి దయ. వాడికి తెలుసండీ! ఎవర్ని ఎలా కాపాడాలో! అబ్బాయున్నాడా లోపల?''

'ఆఁ ఆఁ వెళ్ళండి వున్నారు.''

బయల్దేరారు రాయుడుగారు.

''అరెరె: ఎప్పుడొచ్చావ్ నాన్నా!'' సీట్లోంచిలేచి ఆనందాశ్చర్యాలతో అన్నాడు చంద్రం.

'' ఎప్పుడొచ్చావేమిట్రా వెధవ డైలాగూ! ఇప్పుడు నీ ఎదురుగా వున్నది సాక్షాత్తూ మీ నాన్నే!'' అంటూ పక్కనే ఖాళీ కుర్చీలో కూర్చున్నారు రాయుడుగారు.

చంద్రం ఫైల్సేవో చూస్తున్నాడు.

''చంద్రం! నీ జీప్ ఏదిరా?''

చంద్రం బయటికిచూస్తూ..'అట్నుంచి రెండోది నాన్నా అని మళ్ళీ తన దృష్టిని ఫైల్సు మీదికి మళ్ళించాడు.

''ఏమిట్రా చంద్రం! అవి రేపు చూసుకోవచ్చు పోదాం లే!''

''ఓ పావుగంటలో వెళ్ళిపోదాం. ఇవి చాలా అర్జంటు ఫైల్స్ నాన్నా! '

''నో—పది నిమిషాల్లో పూర్తవ్వాలి. నేను మీ ఆఫీసుచుట్టూ అలా అలా తిరిగి వస్తాను'' అంటూ రాయుడుగారు లేచి బయటికి వెళ్ళారు.

చంద్రంఫైల్స్ చూడటంలో నిమగ్నుడయ్యాడు.

కొద్ది నిమిషాల అనంతరం రాయుడుగారు లోపలకి అడుగుపెడుతూనే—

"చంద్రం యిహలే వెడదాం" అన్నారు.

చంద్రం కాలింగ్‌బెల్లు నొక్కాడు. మరుక్షణం చేతులు కట్టుకుని వచ్చి నిల బడ్డాడు ఏమిటన్నట్లు.

"డ్రైవర్‌ని పిలువు!"

"చిత్తం." వెళ్ళిపోయాడు.

తండ్రి కొడుకులిద్దరూ గుమ్మం దాట గానే మానేజర్ గబగబా బయటికొచ్చి—

"ఇంటికెడుతున్నారా! నాల్రోజులుంటా రుగా?" అన్నాడు రాయుడుగార్నుద్దేశించి.

"ఆఁ....ఆఁ....నాల్రోజు లుంటాను. మళ్ళీ కలుద్దాంలెండి" అంటూ కొడుకుతో బాటు జీప్‌లో కూర్చున్నారు రాయుడు గారు.

కొద్ది నిమిషాల్లో జీపు సరాసరి ఓ యింటిముందాగింది.

"చంద్రం! ఇక్కడెవర్తోనన్నా మాట్లా డాలా? త్వరగా వచ్చెయ్" అన్నారు రాయుడుగారు.

"ఇదేనాన్నా మన యిల్లు. పూర్వంది మార్చి దాదాపు ఆర్నెల్లు కావస్తోంది".... నవ్వుతూ అన్నాడు చంద్రం.

తండ్రీ కొడుకులు దిగ్గానే డ్రైవర్ కూడా దిగి చంద్రానికి మిలిటరీ పద్ధతిలో సాల్యూట్ చేసి జీపు వెనక్కి మళ్ళించుకు పోయాడు.

రాయుడుగారు బయటనుంచుని కొద్ది క్షణాలు ఆ డాబాని పరిశీలనగా చూసి "ప్చ్....అప్పీరెన్సేమీ బాగుండలేదురా చంద్రం!" అన్నారు.

చంద్రం మాట్లాడలేదు.

వంట గదిలోంచి అప్పుడే హాల్లో కడుగుపెడుతున్న మంజుల హఠాత్తుగా రాయుడుగార్ని చూసి దైవాన్ని చూసి నంత సంబరంతో—"ఎప్పుడు మామ గారూ రావడం?' ఎదురొచ్చింది.

"ఇంతకుముందేనమ్మా! ఏరీ పిల్లలు కనిపించరేం?" చుట్టుపక్కల కలయ చూస్తూ అన్నారాయన.

"స్కూల్‌కి వెళ్లారు. వచ్చేవేళైంది. మీరు స్నానానికి లేవండి." అందామె.

ఆయనది వినిపించుకోకుండా గబగబా నాలుగ్గదులూ తిరిగి హాల్లోకొచ్చి వాలు కుర్చీలో చేరగిల బడ్డారు.

చంద్రం దంపతులు ఎదురుగ్గా నిల్చునే వున్నారు—

"ఇంతకుముందున్న యిల్లు మహా దర్జాగా ఇంద్ర భవనంలా వుండేది. నిజంగా నీలాంటి ఆఫీసర్లకది ఎంతో తగింది. ఇది నాకేమాత్రం నచ్చలేదు. ఎందుకని మార్చారు చంద్రం?"

'అది చాలా పెద్ద యిల్లు! పైగా అంత అద్దె కూడా మాకు భారమని పించింది."

'భారం మనసులో అనుకున్న రాయుడుగారి గుండెల్ని ఎవరో బలంగా పిండినట్లయింది.

'చంద్రం! అఫీసుకి కోటు వేసు కెళ్ళవా? ఎదీ ఓసారి నీ సూట్లన్నీ పట్రా



ఏం బ్రదర్, తలకాయమీద ఆ బొప్పి ఏమిటి? బుగ్గ మీద ఆ ప్లాస్టర్ యేమిటి?
ఏదో చిన్న ప్రేమ వ్యవహారంలే.
నీ ప్రియురాలి హస్తవాసి కాదుగద?
కాదులే. ఆమె ప్రియుడి చేతి చలవ.

---

చూడాలనుంది."

"కోట్లుసూట్లు అనవసరం నాన్నా! మనిషి విలువల్ని అంచనావేసేది బట్టల్ని బట్టి కాదుగా!"

ఆ మాటల్లో ఏదో భావం లీలగా తోచి రాయుడుగారు బరువుగా నిట్టూర్చారు.

ఇంతలో స్కూల్నుంచి ముగ్గురు మనుమళ్ళు వచ్చి రాయుడుగార్ని చూసి "తాతయ్యా .. తాతయ్యా!" అంటూ రాయుడుగార్ని చుట్టుకుపోయారు.

వాళ్ళని ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని—"ఛీ ఛీ ఏంబట్టలా ఇవి? ఆఫీసరుగారి పిల్లలు ఇలాగేనా వుండేది?"

చంద్రం దంపతులు మాట్లాడలేదు.

"మరే తాతయ్యా! మా యింటిపక్కన తాలూకాఫీసు గుమాస్తా వున్నాడు. అతని కొడుకు రంగడు మాక్లాసే! వాడెంత చక్కని బట్ట లేసుకొస్తా డనుకున్నావ్! వాడి బూట్లు ఎంతబావుంటయ్! ఎంత దర్జాగాఉంటాడనుకున్నావ్ తాతయ్యా!"

నోర్మూయ్ వెధవా? వాడి బూట్లకంటే నీ చెప్పులే ఖరీదైనవి. తాతయ్యా! అబద్ధాలు చెప్పకు!" మందలిస్తున్నట్లు కళ్లుపెద్దవిచేసి కోపంగా చూసింది మంజుల.

బిక్కమొహం పెట్టాడు బాబు.

ఎవరు అబద్ధాలు చెబుతున్నదీ గ్రహించిన రాయుడుగారు మరోసారి బాధగా నిట్టూర్చారు.

ఊహల్లోంచి వాస్తవ్యంలోకి దిగి

రాయుడుగారు—తాను ఆశల శిఖరాల్నుంచి మజిలీలుగా కిందికి దొర్లిపోతున్నట్లు— తను మనసాకాశంలో నిర్మించుకున్న రమ్యహర్మ్యాలు తన కళ్ళముందే పేక మేడల్లా దారుణంగా కూలిపోతున్నట్లు అనుభూతి చెందారు.

కొడుకుల స్థితిగతుల్ని ఉన్నతంగా వూహించుకుని తెలియని ఆనందంలో— నిశ్చింతగా — నిర్విచారంగా — గర్వంగా బతుకుతున్న రాయుడు ఒక్కసారి నిలువునా కృంగిపోయి దైన్యమూర్తిగా మారి దూరపుకొండల్ని అతిదగ్గరగా చూస్తున్నట్లయ్యింది.

రాయుడుగారి మనసు ఆర్ద్రమైంది.

చంద్రం బట్టలు మార్చుకునే మిష తోనూ—మంజుల వంటగదిలో పను న్నట్లు అక్కణ్నుంచి తప్పుకున్నారు.

రాత్రి పదిగంటలు దాటివుంటుంది. రాయుడుగార్కి నిద్రపట్టడంలేదు! ఎడ తెరిపి లేని ఆలోచనలు ఆయన మనసుని కకావికలం చేస్తున్నాయి. హఠాత్తుగా రాయుడుగారి కళ్ళనుంచి వెచ్చటి నీటి బిందువులు జాలువారుతున్నాయి.

ఆకాశంలో మేఘగర్జనలు—తళుక్కున మెరుపులు—కుండపోతగా వర్షం ప్రారంభమైంది.

కిటికీలోంచి ఝుంయ్‌మంటూ వస్తున్న చల్లటి ఈదురుగాల్ని భరించలేకపోయారు రాయుడుగారు. గభాల్న మంచంమీద నుంచి లేచి చలిగాలికి దుప్పటినిండుగా కప్పుకుని గబగబ వెళ్ళి కిటికీ తలుపులు మూసివేశారు.

"చలి విపరీతంగా వుంది. పిల్లలకు దుప్పటి కప్పారో లేదో?" అనుకున్నారాయన.

ఇవతల గదిలో—

మంజుల చంద్రం దగ్గరగా జరిగి కూర్చుని "ఏమిటండీ! ప్రతి చిన్న విషయానికీ మీ నాన్న అలా ఇదై పోతారేం?"

"నీకు ఆయన సంగతి బాగా తెలియదు మంజూ! నిజంగా ఆయన మమ్మల్ని మహారాజుల్లా గొప్పగా పెంచారు. నా కొడుకులు ఆఫీసర్లని కలలు కంటూ అలా పెరిగిపోతున్నారే గాని వాస్తవాన్ని గ్రహించలేకపోతున్నారు. నాన్న దగ్గర్నుంచి ఉత్తరం వచ్చినరోజునే లోన్‌కి అప్లై చేశాను. బహుశా నాలుగైదు రోజుల్లో మంజూరై రావచ్చు. అసలీ విషయాన్ని నాన్నకెలా చెప్పాలో తెలియడం లేదు. ఓ రకంగా మేమూ పొరపాటు చేస్తున్నామేమో?" ఒక్కక్షణం ఆగాడు చంద్రం.

"మీరు పొరపాటు చేస్తున్నారా? ఏమిటి?" ఆశ్చర్యంగా అడిగింది మంజుల.

"మేంకూడా నేడు చాలామంది చేస్తున్నట్లు బల్లకింద చేతులు చాపినట్లయితే ఈ పాటికి వేలు గడించేవాళ్ళం. మా నాన్నని నెలకో యాత్ర మహాదర్జాగా చేయించేవాళ్ళం. కానీ నేటి మన పరిస్థితి. •

పరే. ఇహ నిద్దరొస్తోంది పడుకో మంజూ!" అంటూ మంచంమీద వాలి పోయాడు చంద్రం.

మంజులకూడా నిద్ర కుపక్రమించింది.

ఉదయాన్నే—

"ఏమండీ! ఏమండీ! మీ నాన్న వూరు బయల్దేరారు. త్వరగా లేవండి." హడా వుడి పెడుతూ అంది మంజుల

చంద్రం కంగారుగా లేచాడు నాల్రోజు లుంటాడనుకున్న తండ్రి అప్పుడే ప్రయా ణం కట్టడం అతనికి చాలా ఆశ్చర్యాన్ని ఆందోళనని కలిగించింది.

గబగబ గదిలోకెళ్ళి ప్రయాణ సన్నా హాల్లో వున్న తండ్రిని చూసి "నాన్నా! లోన్‌కి అప్లై చేసాను. నాల్రోజుల్లో మంజూరై చేతికొస్తుంది. నిక్షేపంగా యాత్రలు చేద్దువుగాని. తమ్ముడుకూడా నా లాగానే అనుకుంటున్నట్లు తెలియ జేశాడు నాల్రోజులుండు నాన్నా!" ప్రాధేయ పడుతున్నట్లడిగాడు చంద్రం.

"నా యాత్రగురించి బాధపడకు చంద్రం! మరేం ఫరవాలేదు నేను ఇంటికి వెళ్ళాలి. చాలా అర్జంటు పన్లున్నయి.' చాలా తేలిగ్గా సమాధానం చెప్పారు రాయుడుగారు.

చంద్రం ఎదురు చెప్పలేకపోయాడు.

తండ్రిని స్టేషన్‌దాకా సాగనంపి రైలెక్కించి వచ్చాడు చంద్రం.

ఆఫీసులో కూర్చుని టపాచూస్తున్న చంద్రానికి తండ్రి దస్తూరితో కవరగు పించింది. అప్పుడే నాన్న ఇల్లుచేరడం - ఉత్తరం రాయడం కూడా అయ్యిందే అనుకుంటూ గభాల్న ఆ కవర్ని చేతు ల్లోకి తీసుకున్నాడు.

చిరంజీవి చంద్రానికి!

నేను మీ దగ్గరకు రావడం ఎంతో మేలైంది. నిజాయితీని నమ్ముకుని బతికే మనుషుల ముఖమండలంలో భాసించే నిర్మలత్వం—సంతోషం— సంతృప్తి —అపమార్గాన లక్షలార్జించినా అలా వుండలేరు. వున్నట్లు నటించినా ఆ మను షుల బతుకులు మేడిపండులాంటివే!

నాయాత్ర మీ స్థితిగతుల్ని తెలుసు కు నేందుకు ఉపయోగించి మీపట్ల గొప్ప ఆత్మవిశ్వాసాన్ని ఆనందాన్ని ప్రసా దించింది. మీలాంటి ఆఫీసర్లకి తండ్రిని కాగలిగినందుకు ఎంతో గర్వపడుతున్నాను. ఇప్పుడు నా ఆనందానికి పట్టపగాల్లేకుండా వున్నయి. నాలాంటి అదృష్టవంతులైన తండ్రులు ప్రపంచంలో చాలా అరుదుగా వుంటారు చంద్రం! ఇంతకంటే! నాకింకేం కావాలి?

నేను యాత్ర చేయలేదని మీరేమీ బెంగపడవద్దు. నాకా బాధగానీ—అసం తృప్తిగానీ ఏకోశానా లేదు. మేడిపండు లాంటి బతుకులు మనకొద్దు. మనకీ జీవితం చాలు.

ఆశీస్సులతో

మీ నాన్న.

## ఆగస్టు నెల

# భావపరిచయ పోటీ



### బహుమతి పొందిన వ్యాఖ్య

ఆ॥ వె॥ కాళ్ల చేతులన్ని కదలక బంధించి
నోట 'టార్చి' బెట్టి నోరు మూసి
తాళ మడుగు తెలివితోచని దొంగను
చూచె పెద్ద మనిషి చోద్యముగను.

—ఎస్. ఎస్. ఆర్. ఆంజనేయశర్మ,
బెంగుళూరు.

# ఎలాటి వివాహం

పంతుల జోగారావు

సోఫాలో కూర్చుంటూ ఆ అమ్మాయి వేపు చూశాను. సన్నగా పొడుగ్గా ఉంది. చామన చాయ. ఒంటికి నప్పే విధంగా అలంకరణ చేసుకునే నేర్పు ఆమెకుందని చూస్తూనే గ్రహించవొచ్చు.

నన్ను చూస్తూనే ఆమె 'నమస్కారమండీ' అంటూ లేచింది.

"నమస్తే. టేక్ యువర్ సీట్." ఆమె పొందికగా సోఫామీద కూర్చుంది. పేపరందుకుంటూ అడిగాను: "వాట్ కెన్ ఐడూ ఫర్ యూ మిస్ "

"లావణ్య."

"ప్రెటీ నేమ్." ఆమె అందంగా సిగ్గుపడింది. రెండుక్షణాల తరువాత నెమ్మదిగా అంది. "నేను చయనులు గారమ్మాయినండి .."

చయను లెవరు చెప్మా? నాకు గుర్తుండే చావదు. "ఊఁ" అన్నాను ఆమె గ్రహించేసింది. "కె. వి. చైనులు గారండీ" అంది తిరిగి. "ఓహో! అతనా!" అనేశాను. నా అవస్థ అర్థం చేసుకుని మూడోసారి మళ్ళీ ప్రయత్నించిందా అమ్మాయి: "సీతానగరంలో వుండే వాళ్ళు కదా సార్. ."

చప్పున గుర్తొచ్చింది. నా మతిరపుకి నాకే చిరాకనిపించింది. వాడిని మరిచి పోవటమేమిటి నేను! "నీకు మనస్ఫూర్తిగా స్నేహం చెయ్యటం తెలీదురా చలపా....మంచి స్నేహంలో ఎంత తియ్యదనం వుంటుందో నీకీ జన్మకి అర్థంకాదు పో!" అనేవాడు కదూ! నిజమేనేమో! ఎప్పటిమాట! ముప్పై ఏళ్ళు పైబడింది కదూ? ఒకే స్కూల్లో చదువుకున్నాం. కలిసే తిరిగేవాళ్ళం ఎప్పుడూ. మొగుడూ పెళ్ళాలనే వారు మమ్మల్ని.

నా ముఖం వికసించింది, "అలాగా అమ్మా! ఎంతకాలమైందనీ వాడ్ని చూసి! ..బాగున్నాడా?"

"ఆయన ఒంట్లో బావు లేదండీ. పెద్దాసుపత్రిలో ఓసారి చూపిద్దామని యిక్కడికి తీసుకొచ్చాం....ఇక్కడ మా మేనత్త ఒకావిడ వున్నారు. మీరీవూళ్లోనే వున్నట్టు మామయ్యగారి ఫ్రెండెవరో చెప్పారు."

"అయ్యో అలాగా అమ్మాయ్! జబ్బేమిటి?"

"ఒకటని లేదండీ....రోజూకీ కంప్లెయింట్. జనరల్ వీక్ నెస్."

నాకు కష్టమనిపించింది. "ఎక్కడుంటున్నా రమ్మాయ్?' "లలితా కాలనీలోనండీ." వెంటనే వెళ్ళి వాడ్ని చూడాలనే ఉంది. కాని, నా కివాళ అవతల ముఖ్యమైన ఎంగేజ్ మెంట్సున్నాయి. సాయంత్రం

వస్తానని చెప్పి, అడ్రసు తీసుకున్నాను. "నువ్వెళ్ళిరామ్మా ..సాయంత్రం నేనూ మా ఆవిడ వస్తాం " పాపం, వాడిస్థితి తలుచుకుంటే బాధ కలుగుతోంది . అప్పట్లోనూ యిలాగే వుండేవాడులే ... బల్లిగాడనే వాళ్లం వాడిని ."

ఆ అమ్మాయి లేవలేదు. ఎందుకో తటపటాయిస్తూంది.

"డబ్బేమేనా కావాలా అమ్మాయ్?" ఆమె మనోభావం గ్రహించిన వాడిమల్లే అన్నాను ఆమె ముఖం చిన్నబోయింది. గుప్పెట్లో అంతవరకూ మూసివుంచిన చీటీ నా చేతిలో పెట్టేసి తలదించేసుకుంది.

నేనామె వేపు సాలోచనగా చూసి, చీటీ విప్పాను. దస్తూరీ బాగాలేదు వణకు జబ్బున్నవాడు రాసినట్లుగానే వుంది.

"చలపతీ!

కష్టంలో వున్నాను. అమ్మాయి కేద యినా ఉద్యోగమిచ్చి ఆదుకోవయ్యా. నీ రుణం ఈ జన్మలో తీర్చుకోలేను. చేసిన రుణాలు తీర్చకపోవటమే నా కలవా టయ్యింది. ఉంటాను."

బహుశా గుర్తుంచి వుంటావు,
నీ చయనులు."

తలెత్తి ఆమె వేపు చూశాను. ఆమె కనుకొలకులలో సన్నగా నీళ్ళు తిరగటం గమనించాను. "ఏం చదవావు అమ్మాయి?"

"పి. యూ. సీ. సెకెండ్ క్లాసు వచ్చిందండీ."

"మంచిది. టైపింగ్ వచ్చునా?" 'రాదండీ' 'రాదూ? పోనీలే ..రేపొకసారి మళ్ళీరా.'

ఆ అమ్మాయి ముఖం ఆశతో వెలిగి పోయింది. ఆమెను మరింత సంతోష పరచాలనిపించింది. "ఓ ఖాళీ వుందిలే అమ్మాయ్ తప్పక నీకే యిస్తాను.. ఇక వెళ్ళిరా."

"థాంక్సండీ" ఆమెకృతజ్ఞతా పూర్వ కంగా నా వేపు చూసింది. నేను గర్వంగా చిరునవ్వు విసరి బట్టతలని నిమురు కున్నాను.

ఆమె వెళ్ళిపోయింది,

* *

లావణ్యకి ఉద్యోగమిచ్చేందుకు నా కెలాంటి అభ్యంతరమూ ఉండదు. నా ఆఫీసులో నా చేతిలోనే ఓ పోస్ట్ ఖాళీగా వుంది. దాన్ని క్రియేట్ చేసి సరైన అమ్మాయికోసమే చూస్తున్నాను!

"సరైన" అంటే అర్థం కొంచెం విడదీసి చెప్పాలి. చదువూ, అనుభవమూ అలా వుండగా ఈ క్రింది అదనపు అర్హత ఉండాలి.

(1) నెమ్మదస్తురాలయిన అవివాహిత అయి వుండాలి.

(2) మాతో వివాహ సంబంధానికి వీలుపడేదై వుండాలి.

(3) ఉద్యోగం చెయ్యవలసిన అవ సరం కచ్చితంగా కలిగి వుండాలి.

(4) జులాయి వెధవలా తిరిగే మా

యువ

ఒక్కగానొక్క పుత్రరత్నాన్ని పెళ్ళిచేసుకుందుకు అంగీకరించాలి.

లా ఇక్యకు పై వాటిలో మొదటి మూడు అర్హతలూ వున్నాయని తెలిసిపోయింది. ఇక నాలుగో దాని సంగతా? ఆమె మా చైనులుగాడి కుమార్తె కనుక ఆ విషయంలో సందేహమే అనవసర మనుకుంటాను.

మా వాడు ఎస్సెల్సీ మూడు మార్లు డింకీలుకొట్టి నాలుగోసారి. వచ్చిన ఇన్విజలేటర్ని బెదరగొట్టి స్లిప్పులు దట్టించి రాసి పాడేసి పాసయి పూరుకున్నాడు.

నా లోపమో, వాళ్లమ్మమ్మ గారింట్లో చాలా కాలం పెరగటంవల్లనో, యివేమీ కాక మా ఆవిడ ఎప్పుడూ అంటూవుండే నుదుటిమ్రాత బాగులేక పోవటమో కాని— మా ఇంటా వంటాలేని జులాయితనమంతా మా వాడికొచ్చింది. నా లోపమని ఒప్పుకోవటానికి మనస్సు పీకుతూ వుంటుంది. మన చేతిలో ఏముందండీ. మన వెర్రి కాని, ఒకరి జీవితాన్ని బాగుచేయటమో, పాడుచేయటమో మన చేతిలో వుంటుందండీ.... అంతా మన భ్రమకానీ.... ఎలా రాసిపెట్టి వుందో అలా జరక్క తప్పదు. చూస్తుండటమే మన పని. '

మా ఆవిడ వాదనని ఒక్కనాటికీ ఒప్పుకోవాలనిపించదు నాకు. నాకు సెంటిమెంట్సు లేవు... ఇకపోతే.., వాళ్ళమ్మమ్మ గారి గారాబమే వాడ్ని చెడగొట్టింది.

వాడి శరీరం మీద చెయ్యివేసేందుకు నా కధికారం వున్నంత కాలం.—వాడ్ని. నాలోని మమత, ముఖ్యంగా మా ఆవిడా ఆదుకున్నారు. నా 'మనోనేత్రం' విప్పుకునే సరికి పుణ్యకాలం కాస్తా హరించుకుపోయింది.

వాడి కెలాంటి అలవాట్లున్నాయో నే నెరుగను కానీ. వాడ్ని యింట్లో నేను చూడడం చాలా తక్కువ. నాలుగైదు రోజులకొక పర్యాయమో యేమో! వాడి గురించే నా కెప్పుడూ బెంగ. ఏం చెయ్యటానికీ తోచదు రానురాను వాడి ధోరణి బాగా అలవాటయి పోయింది.

మా ఆవిడ అంటూవుండే "అద్దాల నాడు బిడ్డలు గానీ, గడ్డాలనాడుటండీ?" అనే వాక్యంలో ఎంత చక్కని స్వారస్యం యిమిడివుందో నాకిప్పు డర్ధమవుతోంది.

ఎవరు చెప్పేరో కానీ. పెళ్ళి చేస్తే యీ తిరుగుళ్లన్నీ కట్టిపోతాయన్న వార్త మా ఆవిడ మోసుకొచ్చింది. అక్కడ్నుంచి ఒకటే పోరు....

నాకూ అలా చెయ్యటమే మంచి దనిపిస్తోంది. లేకుంటే వాడి దైలాగుల తీరు చూస్తేమాత్రం — చెప్పా చేయకుండా ఏ లవ్ మేరేజో చేసుకుని.... ఎవతెనో తీసుకొచ్చేస్తాడని నా అనుమానం....

"ఎవరండీ వచ్చిందీ?" అంటూ వచ్చింది వరలక్ష్మి.

"నీ కాబోయే కోడలోయ్" అన్నాను నవ్వుతూ. "చాల్లెండి.... ఇంతకూ ఎవరో చెప్పరాదూ, బడాయి?"

చెప్పాను. చెప్పింది లగాయితు ఆ అమ్మాయిని చూడాలంటూ ఆవిడ ఆత్రత పడసాగింది. కష్టంమీద సాయంత్రం వెళ్దామని వొప్పించాను . .లేచి, ఆవిడ అందించిన కోటు వేసుకుంటూ వెళ్లి కారులో కూచున్నాను.

"టాటా—వొస్తానోయ్".

ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ యింట్లోకి వెళ్లిపోయింది వరలక్ష్మి. నా కింకా కొంటెతనం పోలేదనుకుంటూ నవ్వుకుంటోందేమో!

*   *

సాయంత్రం కాఫీ టిఫిన్ పూర్తయాక లలితా కాలనీకి బయలుదేరాను. వరలక్ష్మికూడా సిద్ధంగానే ఉంది. చిలకాకు పచ్చరంగు కంచిపట్టుచీర కట్టుకుంది. అచ్చు వరలక్ష్మిలాగే ఉంది!

"బాగున్నావోయ్ వరం!"

ఉరిమి వురిమి నావేపు చూసింది, "చాల్లెండి' అంది. నవ్వుతూ వెళ్లి కార్లో కూచున్నాను. ఆవిడకూడా కారెక్కాక కారు స్టార్టు చేశాను.

ఆ యిల్లు చేరేసరికి, లావణ్య మా కోసమే ఎదురుచూస్తూ వీధి గుమ్మంలోనే కనిపించి నవ్వుతూ అహ్వానించింది. వరలక్ష్మి అప్పుడే ఆమెను నఖశిఖ పర్యంతం "చెక్" చేసేస్తోంది! ఆవిడ సంతుష్టిగానే ఉంది. తీసుకొచ్చిన పళ్లు లావణ్యచేతిలో పెట్టింది.

చయనులు కుక్కిమంచంమీద పడుకున్నాడు. అతని మంచంముందు బెంచీ మీద మందుసీసా లున్నాయి మాసిపోయిన దుప్పటి కప్పుకుని, పెరిగిపోయిన గడ్డంతో, లోతుకుపోయిన కళ్లతో, చయనులు జీవచ్ఛవంలా ఉన్నాడు, ఎలా అయిపోయాడో?

లేనిశక్తి తెచ్చుకుని ప్రశ్నించాడు "రా చలపతీ! బాగున్నావా? ఏమ్మా బాగున్నారా?

నేను వూగిసలాడిపోతున్న ఓ కుర్చీ మీద జాగ్రత్తగా కూర్చుని, వాడి చెయ్యి పట్టుకుని అన్నాను "ఏరా చేనులూ! ఎలా తయారయావో తెలుసా? పోల్చుకోలేనంతగా మారిపోయావనుకో. .డాక్టరేమంటాడు?"

"ఏమంటాడులే—నక్కలా ఉన్నావు ...యిప్పుడిప్పుడే చావవులే అని అభయమిస్తాడు."

"చాల్లే ...భావుకతతో మాట్లాడకు ... నాకు నచ్చదు." వాడిముఖంలో సన్నని నవ్వు పులుముకుంది. "నువ్వు మారలేదయ్యా చలపా! సరిగ్గా అప్పట్లోనూ యిలాగే అనేవాడివి తెలుసా?"

ఇద్దరం చిన్ననాటి కబుర్లలో పడిపోయాం. "ఆయనకు మరి రెస్టివ్వరా, యేమిటి?" అంది వరలక్ష్మి. ఆవిడ లావణ్య మేనత్తతో కాబోలు—మాట్లాడుతోంది, వంటింటి గుమ్మం దగ్గర నించుని. లావణ్య వచ్చి, తండ్రికి మందిచ్చింది.

"రేపొచ్చి ఆఫీసులో నేకలుసుకోమ్మా. మా ఆఫీసెక్కడో తెలుసా?"




‘‘డాబా గార్డెన్స్‌లో కదండి,,, మెసర్స్ లావ్ అండ్ రాజూ ఫైనాన్స్ కార్పోరేషన్....'' తలూపాను.

చయనులు కృతజ్ఞతాపూర్వకంగా నా చెయ్యి అందుకుని యిలా అన్నాడు ‘‘నీ మేలు మరచిపోలేనురా చలపతీ!'' లావణ్య అత్తయ్య నా వేపు గౌరవ పురస్సరంగా చూడటం గమనించాను.

‘‘చాల్లే'' అన్నాను.

చీకటి పడుతూవుంటే యింటికి బయలుదేరాం. వచ్చేస్తూ, లావణ్యచేతిలో వందరూపాయల నోటుంచాను. యిబ్బందిగా ముఖం పెట్టింది. తీసుకోలేదు. నెల నెలా జీతంలో మినహాయించుకుంటాను లెమ్మని చెబితే తీసుకుంది.

* *

లావణ్య నా ఆఫీసులో చేరింది. జీతం రెండొందలు. చాలా అణకువగా పని చేసుకు పోతూ ఉంటుంది. మేం మూడు రోజుల కొక పర్యాయమయినా లలితా కాలనీకి వెళ్ళొస్తున్నాం.

ఉద్యోగంలో చేరాక, లావణ్య ఆమె తండ్రి ఆ యింటికి దగ్గరలోనే ఓ గది అద్దెకు తీసుకున్నారు. ఇప్పుడు వాళ్ళ ఆర్థికస్థితి కొంచెం మెరుగయింది. చయనులు ఆరోగ్యంకూడా కుదుటబడిందనే చెప్పాలి. కనీసం మునపటంత అధ్వాన్నంగా లేదు. వాడి భార్య పార్వతమ్మ, సీతానగరంనుంచి అఖరబ్బాయిని వెంట బెట్టుకుని ఒకటి రెండుసార్లు వచ్చివెళ్ళింది.

రెణ్ణెళ్ళు గడిచినదగ్గరనుంచీ మా ఆవిడ, అబ్బాయి పెళ్ళివిషయంలో తొందర పడసాగింది. పిల్ల గుణవంతురాలయితే చాలు; వాళ్ళ స్థితిగతుల విషయంలో మాకాట్టే పట్టింపు తొలినుంచీ లేదు.

చయనులు దగ్గరికి వెళ్ళినప్పుడల్లా సంభాషణలో మెల్లగా యీ విషయాన్ని ధ్వనింపచేసేవాణ్ని. వాడు నా అభిప్రా-

యాన్ని గమనించినట్లే కనిపించేవాడు కాదు.

రకరకాలుగా ట్రిక్స్ చేసేవాడ్ని.

"మా వాడికీ సమ్మరులో మారేజ్ చేసేద్దా మనుకుంటున్నానోయ్' అనే వాడ్ని. "అలాగా! మంచిదిరా ఏం చదివించావేమిటి" అనేవాడు. అంతే కాని, వాడి ముఖంలో నే నాశించిన విధంగా రంగులు మారేవి కావు. "కట్నాలు తీసుకునే ప్రసక్తేలేదు సుమీ! అది నాకూ, నా వరానికీ బొత్తిగా యిష్టం లేనిపని " మరో ఆశ చూపించాను. ఉహూఁ! వాడు పట్టించుకోనిదే! "చిన్నప్పటి ఆదర్శాలని నిలబెట్టు కుంటున్నావన్నమాట!" నవ్వే వాడు నాకు చిరాకనిపించేది. వాడు నన్ను మించిపోయినట్టు ప్రవర్తిస్తున్నాడు.

ఓరోజు లావణ్య, తండ్రిని తీసుకుని మా యింటికొచ్చింది. తండ్రిని సోఫాలో కూర్చోపెట్టి, తను వంటింటివేపు వెళ్లింది. ఆమెకు వరలక్ష్మి దగ్గర బాగా చనువు యేర్పడింది!

రేడియో సిలోన్‌నుంచి తెలుగుపాటలు ప్రసారం చేస్తోంది. లేచి, రేడియో కట్టేసి, ఫాన్ వేసివచ్చి సోఫాలో కూర్చున్నాను. వరలక్ష్మి రాజమ్మచేత డ్రింకులు పంపించింది. డ్రింకులు తాగేక ప్రారంభించాను : "ముఖస్తుతి కాదుగానీ, నారే చేనులూ! లావణ్య గుడ్ గర్ల్ అనుకో! మా ఆవిడ కెంత నచ్చిందో చెప్పలేను... చూశావా....తనతో కబుర్లలో పడిందా! ఇక మన ఉనికిని గుర్తించేటట్లే ' పెద్ద విట్టు వేసినట్లుగా గలగలా నవ్వేశాను. "అయితే మీ కోడలుగా చేసేసుకోరాదూ?" అంటా డనుకున్నాను ; లేదు—అనలేదు! చిన్నగా నవ్వి ఊరుకున్నాడంతే.

నా కోపం వచ్చింది. మా వాడి కొస్తున్న సంబంధాలన్నీ వాడి ప్రవర్తన విషయంలోనే బెడిసి కొడుతున్నాయి. వాడి ప్రవర్తన సరిదిద్దుకుంటే కాని వాడికి పెళ్ళి కాదేమోనని మా ఆవిడకి బెంగపట్టుకుంది. పెళ్లయితే కాని ప్రవర్తన కుదుట పడదుట!

మా ఆవిడ పోరు గుర్తొచ్చి చివరి సారిగా కొంచెం డైరక్టుగానే ప్రవర్తించాను. "ఏరా, లావణ్యకింకా ఎంతకాలం పెళ్ళి చెయ్యకుండా వుంచుతావు? ఏదో సంబంధ చూసి ముడెయ్యాలి కాని " ఇలా అనడం ఎంత సబబుగా వుందో నేనాలోచించలేదప్పుడు.

వాడి ముఖంలో దైన్యం స్పష్టంగా గోచరించింది. సోఫా కవరుమీద చేత్తో రాస్తూ అన్నాడు 'చేసేద్దామనే నాకూ వుందిరా . నా ఆరోగ్యం కూడా కుదుట బడింది కదా! సీతానగరం వెళ్ళి ద్దానిక్కడికి పంపిస్తాను. అక్కడ మాకు చేసేందుకు రెండో అమ్మాయి వుంది,ఎప్పుడూ యింట్లో అందరికీ రోగాలూ రొష్టులూ."

వాడికింకా నలుగురు పిల్లలూ, నాలుగు వేలు అప్పూ, బోలెడు కష్టాలు ఉన్నాయి.



కాదన్ను. ఇప్పుడా సొదంతా ఎందుకు? నా ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పడేం?

వాడూ ట్రిక్స్ చేస్తున్నాడా? నా కోపం ముంచుకువచ్చింది. అవసరానికి ఆదుకుని లావణ్యకీ ఉద్యోగం ఇప్పించక పోతే వీళ్ళ పనేమై వుండేది? ఒక్క పిసరు కృతజ్ఞత చూపిస్తున్నారూ? నేను చాలా అన్యాయంగా ఆలోచిస్తున్నా నన్న సంగతి నా కప్పుడు తట్టలేదు. ఇంకా అన్యాయంగానూ, అసహజంగానూ ఆలోచించగల్ను. ప్రవర్తించగలను కూడా! లేకపోతే ఈ మేడా కారూ కొన గలనా?

ఇంతలో మా వాడెక్కడ్నుంచో వచ్చాడు. వచ్చినవాడు టాక్సీలో రావటం మానేసి రిక్షాలో వచ్చాడు. రిక్షా దిగుతూనే చిల్లర డబ్బుల విషయంలో రిక్షావాడితో పెద్ద గొడవ పెట్టుకుని నానా రభసచేసి వాడ్ని కొట్టినంత పని చేశాడు. నాకు తల తీసేసినట్లయింది. విసుక్కుంటూ వెళ్ళి వాళ్ళిద్దర్నీ విడిపించి, రిక్షావాడు అడిగి నంతా యిచ్చి వాడ్ని పంపించేశాను. మా వాడు విసురుగా వెళ్లి తన గదిలోకిపోయి

చభాలున తలుపులు వేసుకున్నాడు.

లావణ్య వున్నప్పుడు వాడు రావటం ఇది నాలుగోసారి. ప్రతిసారీ తుఫానులాగే వాడి ఆగమనం. లావణ్య వాడ్ని చూడకుండా ముఖం చప్పున ఎటో తిప్పేసుకుంటూ వుంటుంది.

వాడినామె అసహ్యించుకుంటోందా?

వాడ్ని చేసుకుందుకు ఒప్పుకోదేమిటి చెప్మా?

నాకు రానురాను పట్టుదల హెచ్చవుతోంది. ఎలాగయినా ఆమెనే కోడలిగా తెచ్చుకుందామన్న కోరిక నాలో బలపడుతోంది. ఈ చయనులు పలకడేం? మే మే ముందుగా ఎలా పలకటం?

వరలక్ష్మి, లావణ్య మాట్లాడుకుంటూ డ్రాయింగ్ రూంలోకి వచ్చారు. "లావణ్యని ఇక మా యింట్లోనే ఉంచేసుకుంటాం అన్నయ్యగారూ:" నవ్వుతూ యధాలాపంగా అన్నట్లుగా అంది వరలక్ష్మి.

"అలాగేనమ్మా' అని నవ్వేశాడు. నాకు మండిపోయింది. ఎంత గర్వం!

ఇంతలో ఏవరో నలుగురు కుర్రాళ్ళు వచ్చి వాడ్ని పిలుచుకుపోయారు. వాళ్ళని చూస్తూనే గతుక్కుమంది లావణ్య. వాళ్లంతా ఎక్కడో ఆమెను అల్లరిమాటలంటూ, వెకిలిగా ప్రవర్తిస్తూ, యేడిపించినవాళ్ళే అయివుంటారు, లేకపోతే అంత చేదుగా ముఖమెందుకు పెడుతుంది? వాళ్ళు వెళ్ళిపోయాక నా వేపు చురుగ్గా చూసి...."వాళ్లు" ఏదో అనబోయింది.

"మా అబ్బాయి ఫ్రెండ్స్....ఆల్ ఆర్ గ్రాడ్యుయేట్స్" నా నాలుకకి నరం ఉంటేకదా? ఏమనుకుందోయేమో. లావణ్య మరేమీ మాట్లాడలేదు. మరి కొంత సేపుండి వాళ్లు వెళ్ళిపోయారు.

వరలక్ష్మి నవ్వుతూ వాళ్లని సాగనంపి వొచ్చి, పరధ్యానంగా కూర్చున్న నన్ను చూసి, కుదుపుతూ అడిగింది. "ఏమండీ యిలా అయిపోయారూ?" అని.

"ఏంలేదు . మా చేనులు గాడికి ఏరు దాటాక తెప్పని కాల్చేయటంలో ఇంత అనుభవం ఎప్పుడొచ్చిందా అని:"

వరలక్ష్మి తెల్లబోయింది. నా ధోరణి అంతుబట్టలేదని ఆ ముఖమే చెబుతోంది. "వీడి టెక్కు నా దగ్గర కాదు . ఈ లావణ్య ఉద్యోగం పీకి పారెయ్యటం నా చేతిలోని పని" అన్నాను అసహ్యంగా.

వరలక్ష్మికి నా మాటలు శ్రుతి కఠోరంగా తోచి అంది, "ఏమిటండీ ఆ మాటలు: ఇప్పుడేమయింది!" అని.

* *

ఏమయిందో వరలక్ష్మికి కొద్ది రోజుల్లోనే అర్థమయిపోయింది. చయనులు ఆంతర్యం అంతుబట్టక, మా బంధువులా మెద్వారా వ్యవహారం నడిపించాను. లావణ్యను మా అబ్బాయి కివ్వటం యింట్లో ఎవరికీ నచ్చలేదనీ, అసలా ఆలోచనే లేదనీ తేలిపోయింది.



గంటకి ఎనభై మైళ్ళ వేగంతో కారు నడుపుతున్నారు మీరు....
గంటకి ఎనభై మైళ్ళా ?! నేను బయల్దేరి ఇంకా పావుగంటేనా కాలేదే!

---

నాకు ఉడుకుమోతుతనం వచ్చేసింది. చయనులని తరచుగా కలవటం మానే శాను. నాకోపాన్ని ఆఫీసులో లావణ్యమీద చూపించటం ప్రారంభించాను. ఈ పరి ణామానికి మా ఆవిడ మొదట్లో చాలా బాధపడినా, చివరకి సమాధానపరచుకుంది. "ఏం చేస్తాం లెండి? దేనికయినా ఘట నంటూ ఉండాలి కదా? వాడి కెవర్తి రాసి పెట్టి ఉందో!" నేనలా వూరుకోలేక పోయాను. వాళ్ళు నేను చేసిన సహాయా నికి కృతజ్ఞత తీర్చుకోవాలా, వద్దా? ఏం చూసుకుని ఈ గర్వం!

ఈ సంబంధం కాకపోతే మావాడి కింక పెళ్ళిగాదేమోనన్న భయం నాకు ఉందేమో ననుకో నక్కరలేదు. మా ఆవిడ సరిపుచ్చుకున్నంత తేలికగా సరి పెట్టుకోలేకపోయాను. అదీకాక—ఎలా జరగాలో అలా జరిగేది, నే ననుకున్న విధంగానే ఎందుకు జరక్కూడదూ?" అంటాను.

ఆ రోజు చయనులు దగ్గరకి వెళ్ళాను. ఇంటికి తాళం వేసివుంది. వాళ్ళ బంధువుల యింటికి వెళ్ళివుంటారని ఊహించి, కారు అక్కడే నిలిపి నడుచుకుంటూ ఆ యింటికి వెళ్ళాను.

ఇంట్లో అంతా పెద్దగా మాట్లాడు కుంటూ నా రాకనే గమనించలేదు.

"...ఆ అబ్బాయి ప్రవర్తన మంచి దేమీ కాదని అంతా అంటున్నదే . చూస్తూ చూస్తూ అలాంటివాడికి నిన్నెలా యివ్వటం? కాని ...మా చలపతి! ... వాడు మనని కష్టంలో ఆదుకున్నాడు.... వాడికి నిన్ను కోడలిగా చేసుకుందామని యెంతో యిదిగా వుంది...." చయనులు గొంతు.

"అవున్నాన్నా! ... ఆయన ఋణం ఎంత చేసినా తీరదు,..కాని..,ఆయన మన నుంచి ఆశించే ప్రతిఫలం యిదా! ఆ

అబ్బాయి సంగతి ఆయనకి తెలీంది కనుకనా? ఆయన నిర్లక్ష్యంవల్లనే ఆ అ అబ్బాయి యిలా తయారయ్యాడు . నిప్పు మనకెన్నో విధాలుగా ఉపయోగ పడ్తుందని దోసిట్లోకి స్వీకరించి వాళ్ళో పోసుకోం కదా! .... క్షమించండి ..నా వైవాహిక జీవితంగురించి నాకూ కొన్ని కనీసపు కోరికలుంటాయి ...ఏమైనా . ఆతన్నిమాత్రం చేసుకోలేను!''

అప్పుడే నేను కొంచెం మనసులోని మాలిన్యాన్నంతా కడిగేసుకుని వినగలిగితే అడుంలో ఆర్ద్రితగు ర్తించి, కరిగిపోయి ఉ దేవాడిని కాని .మనసులో కుళ్లు పేరుకుపోయింది! నా అహం దెబ్బతింది. విసురుగా యింట్లోకి వెళ్లకుండానే వచ్చేశాను.

నా వెర్రికోపానికి ఫలితం? లావణ్య వుద్యోగానికి ఉద్వాసన చెప్పటం జరిగింది! మా ఆవిడ ఊరికే వేధిస్తూవుంటే, "ఆఫీసులో స్టాఫ్ తగ్గించాల్సి వొచ్చి, అనివార్యంగా లావణ్యని ఉద్యోగంనుంచి తీయించేల్సి వొచ్చింద''ని చెప్పాను. నా నాలుకకి శుద్ధి ఎప్పుడుందని!

"ఆ అమ్మాయి నుదుటిరాత అలా వుంది పాపం" అని జాలిపడింది మా ఆవిడ.

* *

నేనూహించినట్లుగానే మా వాడు తను ప్రేమించిన అమ్మాయిని కాస్తా పెళ్ళిచేసుకుని ఇంటికి తీసుకొచ్చేడు. వరలక్ష్మిఏం గొడవపెడుతుందో అని భయపడ్డాను. కాని ఆవిడ కోడల్ని సాదరంగానే స్వీకరించింది. నా కొక సమస్య తీరినట్లయింది. ఆ పిల్ల రాకతో వాడు మారితే ఎక్కడో. ఏదో వుద్యోగంలో వాడ్ని దూర్చేయటం నా కంత కష్టమయిన పనేమీకాదు.

నా ఆశలు అడియాసలేనని కొద్దినెలల లోనే తేలిపోయింది.

ఆ అమ్మాయి వచ్చిన తొలి ఆరు నెలలూ సినిమాలకనీ పక్నిక్‌లకనీ తెగ తిరిగేవాళ్ళు ఆ తరువాత రోజూ ఎందుకో వాళ్ళ కొక్కక్షణం పడేదికాదు. ఎందుకో కీచులాడుకునేవాళ్ళు వాడు ఒక్కోసారి వెర్రి ఉద్రేకంలో బాగా కొట్టేవాడు. ఆ అమ్మాయి దుఃఖం చూడలేక పోయేవాళ్ళం. వీళ్ళ ప్రేమ తగలేసిరి' అనుకున్నాను. వరలక్ష్మి మనసులో బాధపడేది.

ఓ రోజు ఉండబట్టక, వరలక్ష్మి ఏదుట వాడి ప్రవ ర్తనని నిరసిస్తూ మాట్లాడాను. ఈ వెధవ కింక బాగుపడే యోగ్యత లేదన్నాను .

వరలక్ష్మి నిట్టూర్చి "లలాట లిఖితమండీ! ఏం చేస్తాం" అని ఊరుకుంది. నే నింకా ఏదో అంటే, "వాడి పెళ్లాన్ని వాడు కొట్టుకుంటాడు .చంపుకుంటాడు. మన జోక్యం వుంటే గొడవలు మరింత పెరుగుతాయి కాని చల్లారవు!" అంది.

"నీకు వాడంటేనే సింపతీ—అందులో సగమయినా నామీద లేదు" అని విసు

యువ

క్కున్నాను.

వరలక్ష్మి నవ్వింది: "మీ గురించి ఇంకొకరు జాలి పడాల్సిన అవసరం కల్పించుకోనందుకు మీరు గర్వించాలి" అంటూ

*　　　*

రోజులు గడిచేకొద్దీ వాడా అమ్మాయిని పెట్టే హింసల్ని చూస్తే కడుపు తరుక్కుపోయేది. ఒక్కోరోజు జుత్తు పట్టుకుని బరబరా గదిలోకి యీడ్చుకు పోయి చితకబాదేవాడు.

అలాంటప్పు డనిపించేది: "లావణ్యకి న్యాయమే జరిగిందేమో!" అని!

*　　　*

ఆఫీసు టూర్‌మీద ఓ పదిహేను రోజులు వెళ్ళి. నేను తిరిగి వచ్చేసరికి ఈ మధ్యలో రెండు దారుణాలు జరిగాయి....

మా అబ్బాయి పరారీ అయిపోయాడు.

పట్టుకెళ్ళిన పెద్దమొత్తం కరిగిపోగానే వా డొస్తాడన్న నమ్మకం నాకుంది.

చయనులు పోయాడు!

మళ్ళీ రాడు. భగవాన్! ఇక చయనులు లేడు!

లావణ్య సీతానగరంనుంచి నా పేర ఓ ఉత్తరం రాసింది. ".... నాన్న పోయారు. చివరిలో మీ కోసం ఎంత కలవరించారో తెలీదు....చివరిలో అక్కడ చాలా యిబ్బందులు పడ్డాం....చనిపోతూ నాన్న ఒక్క ముక్కమాత్రం చెప్పారు: "అమ్మా. లావణ్యా....వాడు నీ ఉద్యోగం తీసేసాడని నాకు కోపం లేదమ్మా....ఈ పట్టుదల వాడికి చిన్నప్పట్నుంచీ ఉండటం నే నెరుగుదును....వాడికి నిన్ను కోడలిగా చేసుకుందామని ఎంత కోరికగా ఉందో! అలా కాదన్నామని అక్కసు యిలా తీర్చుకున్నాడు ..అమ్మాయ్....నీ మనసు మారితే మాత్రం, మా చలపతి కోరిక తీర్చమ్మా" అని....

"మా నాన్నగారి చివరి కోరిక తీర్చలేక పోతున్నందుకు చాలా విచారిస్తున్నాను ... మీ అబ్బాయి రిజిస్టరుపెళ్ళి చేసుకున్నారుట కదూ?

'అందుకే అసలు పెళ్ళే చేసుకోకుండా అవివాహితగానే ఉండిపోదామనుకుంటున్నాను....నామీద ఆధారపడ్డవాళ్ళు ఇక్కడ చాలామంది ఉన్నారు....వరలక్ష్మి పిన్నిగారికి నా నమస్కారాలందించండి ..."

*　　　*

లావణ్య రాసిన ఉత్తరం మా ఆవిడ ఎప్పుడు చూసిందో, "పాపం...లావణ్య... ఆ అమ్మాయి పరిస్థితి తలుచుకుంటూ వుంటే ఎంతో జాలిగా ఉందండీ!" అంది.

నేను నిట్టూర్చి అన్నాను: "ఆమెను మనం కోడలిగా తెచ్చుకుంటే యింకా జాలిపడాల్సి వచ్చేది....అవును కదూ?"

వరలక్ష్మి బాధగా తలూపింది.



# మీనా

## యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

ఆ వేసవిలో అమ్మ, నేను, వీరాయి, పిల్లలు అందరం గొడ్డుల్లా కష్టపడ్డాం. వీరాయి పుణ్యమా అని మా పొలం మళ్ళీ సాగులోకి వచ్చింది. నాకు చదువుమీద ఆశవున్నమాట నిజమే! కానీ పరిస్థితులు అనుకూలించలేదు. సాగని వాటికోసం దిగులుపడుతూ కూర్చోవటం అనేది నా స్వభావానికే విరుద్ధం. అమ్మకి నేను పెద్ద చదువులు చదవాలని ఆశ! చివరికి నా కాలేజి చదువు మధ్యలో అసంపూర్తిగానే ఆగిపోయిందనుకో! ఆ రోజు—మీ అమ్మ తిట్టిన క్షణం ఎలాటిదో కానీ, నేను అనే వాడిని బ్రతికుండగా, మా అమ్మగాని, నా చెల్లెళ్ళు తమ్ముడు కానీ దేనికీ లోటు పడకూడదు అనే పట్టుదల వచ్చేసింది!"

మృదుగంభీర స్వరంతో, తగ్గు స్థాయిలో, మెల్లగా, మధ్యమధ్యలో ఆగి, మళ్ళీ మొదలుపెడుతూ, చెప్పటం పూర్తి చేసిన కృష్ణ, సోఫాలో, తనపక్కనే, చేరువగా వచ్చికూర్చున్న నన్ను చూస్తూ, ఆశ్చర్యంగా, "యిదేమిటి? నువ్వు యిక్కడికి ఎప్పుడు వచ్చి కూర్చున్నావు? నేను గమనించనే లేదే?" అన్నాడు.

"ఊ! చెప్పటం ఆపకు, కానీ! తర్వాత?" తొందర చేసాను.

"తర్వాతా? తర్వాత పెద్దగా చెప్పాల్సింది ఏమీలేదు. నేను చదువు మానేసి పొలంపనిలో పడ్డాను. అప్పటికి మాకున్న కాస్త పొలం నా చదువుకి అమ్మేయటంతో వేరే పొలం కవులుకి తీసుకోవాల్సి వచ్చింది. వీరాయి చేదోడుగా, నమ్మిన బంటుగా వుండటంతో, నాకేమంత కష్టం అనిపించలేదు. బీడుగావున్న ఆ పొలాల్ని సాగులోకి తేవటానికి రెండుమూడు సంవ

త్సరాలు నేను నరకం చూసిన మాట నిజమే। కానీ కష్టపడ్డప్పుడే సుఖం విలువ తెలుస్తుందేమో। ఇప్పుడు ఆ పొలం, ఆ తోటా చూస్తే, నాకు ఎంతో ఆనందంగా, చాలా సంతృప్తిగా వుంటుంది.''

కాస్త ఆగి మళ్ళీ అన్నాడు. ''నాలో ఒకటి వుంది. ఏ పనిఅయినా మొదలు పెడితే నా మనసంతా అందులోనే లగ్నం చేస్తాను. చదువుకోవాలనే నా వుత్సాహం అంతా వ్యవసాయంవైపు మళ్లించుకున్నాను. నా ఏకాగ్రత అంతా అందులో కేంద్రీకరించుకున్నాను. వ్యవసాయంలో కొత్తకొత్త ప్రయోగాలు చేయాలని, సాధ్యమైనంత తక్కువ ఖర్చులో, వీలయినంత ఎక్కువ పంట పండించాలని నా తాపత్రయం, ఇప్పుడు నా ఆలోచనలు, నా ధ్యాస, సర్వస్వం వ్యవసాయమే। యిప్పుడు చెప్పు. నువ్వు అన్నమాటకి నేనేం జవాబు చెప్పాలి? నా వైపున నిలబడి ఆలోచించు.

ఇది, విధి నాతో పరిహాసం ఆడటం కాదా। ఎక్కడ నువ్వు? ఎక్కడ నేను। భూమి—ఆకాశాలకి మధ్య వున్నంత వ్యత్యాసం వుంది, ఏ ధైర్యంతో, ఏ బలంతో నిన్ను నేను స్వీకరించగలనో చెప్పు.'' అతని చేతిని నా చేతుల్లోకి తీసుకున్నాను. ఆ చెయ్యి కొద్దిగా మోటుగా వున్నమాట నిజమే। కానీ ఆరోగ్యంగా, శుభ్రంగా పొడుగాటి వేళ్ళతో అందంగా వుంది.

''ఏ ధైర్యంతో, ఏ బలంతో, అంత చిన్నవయసులో ఆ యింటిభారం నెత్తిన వేసుకున్నావో నాటితోనే।'' అన్నాను.

''అది వేరు మీనా। నా కష్టసుఖాలు అమ్మా వాళ్లవికూడా। జీవితంలో తడిని-చేదుని వాళ్ళు నాతో సమానంగా పంచుకోగలరు. కానీ.... నువ్వు.''

''నేను ఆపని చెయ్యలేనా? అదేనా నీ సందేహం? అయితే కాగితం-కలం తీసుకురా. వ్రాసి యిస్తాను.''

''యిప్పుడు అలాగే అంటావు. రేపు ఆ పల్లెటూరి జీవితం నీకు నచ్చదు. రెండు రోజుల్లో విసుగు పుడుతుంది. సిటీకి వెళ్ళిపోదాం రమ్మంటావు. దాంతో అభిప్రాయ బేధం మొదలవుతుంది.''

''ఉహూ. అలా ఎప్పటికీ అనను. ఎందుకో తెలుసా? నేను నీలో చూస్తున్న ఆకర్షణ నీ వ్యక్తిత్వంలోనిది. అది నీకు పుట్టుకతో వచ్చినది. నువ్వు నీ వ్యక్తిత్వం కోల్పోతే తప్ప నాకు యింకే కారణం చేత విసుగురాదు. నువ్వు ఏ వాగ్దానం చేయమంటే అది చేస్తాను.''

అతను నా వైపు చూశాడు। ఆ చూపు నా మాట వెనుకవున్న అర్థంలో నిజాయితీని పసిగట్టాలన్నట్టు, నా హృదయపు లోతులు కొలవాలని ప్రయత్నిస్తున్నట్టు తీక్షణంగా వుంది.

''అమ్మ—నువ్వు తర్వాత ఎప్పుడూ కలుసుకోలేదా। ' అని అడిగాను.

''కలుసుకోకేం? సంవత్సర క్రితమే

బెజవాడలో ఒక పెళ్ళిలో కలుసుకున్నాం. ఆ పెళ్ళికి నువ్వు రాలేదు. పెళ్ళికూతురు, అమ్మ తరపున నాకు దూరపు బంధువు అవుతుంది. పెళ్ళికొడుకు మీ అమ్మకి స్నేహితురాలి కొడుకు అవుతాడు. ఆ పెళ్ళికి మా మ య్య కూ డా వచ్చాడు. మామయ్యతో నేను మాట్లాడుతుంటే మీ అమ్మ అక్కడికి వచ్చింది. "ఎవరీ అబ్బాయి?' అంది,

" ఎవరేమిటి ? మన కృష్ణ. మన కమలం కొడుకు. ' అన్నాడు మామయ్య.

'ఓహో!' నా పేరు వినేసరికే అవిడ ముఖం మారిపోయింది.

"ఏం చేస్తున్నావిపుడు?" అంది,

"వ్యవసాయం చేస్తున్నాడు" అన్నాడు మామయ్య గొప్పగా అదేదో ఘన కార్యంలా.

" అంతకంటే యింకేం చేయగల డులే!" అంది నిరసనగా.

ఆ పెళ్ళిలో కూడా మీ అమ్మకి—నాకూ ఘర్షణ వచ్చింది.

కట్నందగ్గర పెళ్ళివారు పేచీ పడ్డారు. నేను సర్ది చెప్పబోతుంటే మీ అమ్మ జోక్యం చేసుకొని నిరసనగా మాట్లాడింది. నేను నిర్మొహమాటంగా, నిర్లక్ష్యంగా జవాబు చెప్పాను.

"తింటానికి గతిలేకపోయినా పొగరు చాలా వుంది" అంది.

"మాటలు జాగ్రత్తగారానీ! తింటానికి గతివుందో లేదో నీకేం తెలుసు?" అన్నాను.

"ఆ! ఆ! కృష్ణా ఎమిటా తొందర. వాళ్ళ విషయం వదిలేసి మధ్యలో మీరు మాటలు విసురుకుంటారేమిటి?" అంటూ మామయ్య నన్ను వెనక్కులాగాడు. ఆ పెళ్ళిలో—మర్చిపోతున్న అవమానం మరోసారి మళ్ళీ రేపి వెళ్ళింది మీఅమ్మ. నేను యిక్కడికి వనుండి వచ్చినప్పుడు ఒకసారి సినిమాహాల్లో కనిపించింది. సీట్లు పక్క పక్కనే వచ్చినాయి. నన్ను చూడగానే ఆవిడ ముఖం తిప్పుకుంది. నేనూ పలకరించలేదు. నిజంగా చెబుతున్నాను మీనా! మీ అమ్మ మన మధ్య దాటలేని అఘాతమే! నేనంటే మండిపడే ఆవిడ, నిన్ను భార్యగా పొందానంటే నన్ను బ్రతకనిస్తుందా?"

నేను జవాబు చెప్పలేక పోయాను.

అతను యింకేదో ఆలోచిస్తున్నట్టు పరధ్యానంగా కూర్చుండిపోయాడు.

నేను మెల్లగా అతని చేతిమీద గిల్లాను.

"అబ్బ!" యీ లోకంలోకి వచ్చినట్టుగా అతను చూపు మరల్చుకున్నాడు.

'బాప్‌రే!' వున్నట్టుండి నా చేయి కదిలించుకుని హఠాత్తుగా లేచాడు.

"ఏమిటది?' అన్నాను ఖంగారుగా.

"టైమ్ చూడు, ఎంతయింది? బైట తెల్లవారు తున్నట్టుంది."

నేను టైమ్ చూసుకున్నాను. 5 గం. కావస్తోంది.

# ఒకటే సబ్బు-లాభాలు మూడు

# నికో క్రిమినాశక సబ్బు

# చర్మ సంరక్షణలో సబ్బు లన్నిటిలో సాటి లేని మేటి

**1** నికో చర్మక్రిములను సంహరిస్తుంది

**2** నికో చెడు వాసనలను అరికట్టుతుంది

**3** నికో చర్మమును శుభ్రపరచి సంరక్షిస్తుంది

చర్మమును ఆరోగ్యవంతంగా ఉంచుకొనుటకు, నికో సబ్బుతో ప్రతి రోజూ స్నానం చెయ్యండి. దాని యాంటి సెప్టిక్ గుణం గల నురుగు చర్మ క్రిములను సంహరిస్తుంది. నికో యొక్క ఔషధ గుణాలు చర్మంనుండి చెమట వాసనలను హరిస్తాయి మీ చర్మ ఆరోగ్యం దినదినాభివృద్ధి చెందుతుంది

నికోలో ఉన్న శక్తివంతమైన క్రిమినాశక పదార్థం చర్మ వ్యాధులను నిరోధించి, మీ చర్మమును తేజోవంతంగా, చైతన్యవంతంగా నిత్యనూతనంగా ఉంచుతుంది

చెమట పొక్కులు, మొటిమలు నరికట్టి నికో మీ చర్మమును రక్షిస్తుంది. నికోతో ప్రతిరోజూ తల రుద్దుకుంటే, చుండు రాకుండా కాపాడుతుంది

మీ చర్మపు ఆరోగ్యమును, లావణ్యమును రక్షించుకొనుటకు, మూడు విధముల లాభదాయకమైన నికో వాడటం నేడే ప్రారంభించండి




*TRIPLE ACTION*

**NEKO®**

**The Original Germicidal Soap**

**PARKE-DAVIS**

® Regd Trade Mark, Regd Users - Parke Davis (India) Ltd Bombay-72 AS

AISONS 1174

"మైగాడ్!" అన్నాను.

"పదపద. అరగంటలో తీసుకువచ్చి దింపుతానని మామయ్యతో చెప్పాను."

"నేను వెళ్ళితీరాలా యింటికి?" నిస్సహాయంగా చూశాను.

"ఆహా! వెళ్ళితీరాలి!"

"సరే! అయితే ఒక షరతుమీద వెళ్తాను."

"ఏమిటది?"

"నువ్వు నా కాబోయే భర్తవి! నీ మాట మన్నించటం నా ధర్మం కాబట్టి వెళతాను."

కృష్ణ కళ్ళు రెపరెప లాడినాయి. అనిర్వచనీయమైన భావవేగాన్ని బలవంతంగా నిగ్రహించుకున్నట్టు అతని దవడ ఎముక కదులాడింది. నా రెండు చేతులూ పట్టుకుని సోఫాలోనుంచి లేవదీసాడు.

అతని కళ్ళలో బాధ— ఆనందం మిశ్రితమైన భావం కనిపించింది.

"మీనా! ఆర్థికమైన వ్యత్యాసం మనిద్దరి మధ్యా లేకపోయినట్టయితే, నిజంగా, నిన్ను ఎత్తుకుపోయి పెళ్ళి చేసుకుని వుండేవాడిని. అంతస్థుల భేదం నన్ను నిర్దయగా వెనక్కి లాగుతోంది. కానీ లేకపోతే నేను ఎవరికీ భయపడేవాడిని కాదు. చివరికి మీ అమ్మకి కూడా!"

"యిప్పుడుమాత్రం ఏమైంది? నువ్వు నన్ను ఎత్తుకుపోయే బదులు నేనే నీదగ్గరకి పారిపోయి వస్తున్నానుగా? ఏదయినా ఒకటే!"

"ఊహూఁ ఒకటి ఎలా అవుతుంది ఎప్పటికీ కాదు. ముమ్మాటికీ కానేకాదు. ఆ సాహసంలో వున్న ఆనందం, యీ లొంగిపోవడంలో ఎలా వస్తుంది? రాదు! పద. యిలా మాట్లాడుతూవుంటే రోజులే గడిచిపోయేలా వున్నాయి."

"నేను సారథిని తీసుకుని 10. గం.కి మళ్ళీ వస్తాను."

"సారథా! నాదగ్గరకా? ఎందుకు?"

"అతన్ని నీకు పరిచయం చేస్తాను. అతనితో నువ్వు మాట్లాడు. అతను కొన్ని విషయాలు చెబుతాడు. నువ్వు ఊకొట్టి విను. ఒప్పుకో అంతే!"

"చిత్తం అలాగే!"

అతను అది ఏ విషయం అని నన్ను నిలదీయనందుకు సంతోషించాను.

కృష్ణ టాక్సీలో నన్ను మా గేటు ముందు దిగవిడిచి వెళ్ళాడు. యింకా బాగా తెల్లవారలేదు. అప్పుడప్పుడే వెలుగురేఖలు వస్తున్నాయి. కాకులు కావు మంటున్నాయి. నేను చిన్నగేటు తీసుకుని మెల్లగా లోపలకి అడుగుపెట్టాను. రాత్రంతా నిద్రలేకపోయినా నాకు అలసటేకాదు, మనసంతా తేలికగ, హాయిగా వుంది. అన్నిగంటలసేపు అతని దగ్గర కూర్చోవటం, ఆ చనువుతో కూడిన సంభాషణ నాకు స్వర్గంలా వుంది.

మెల్లగ లోపలకి వస్తున్న నేను హఠాత్తుగా ఆగిపోయాను. ఎదురుగా యింటి తలుపులు బార్లా తెరిచివున్నాయి!

వరండాలో పడక్కుర్చీలో ఎవరో పడుకుని వున్నారు. ఎవరది? అమ్మ కాదు కదా! నా భయానికి నాకే నవ్వొచ్చింది. అమ్మ అయితే నేను యింట్లో లేనని తెలిసి వూరుకుంటుందా? ఆ పడక్కుర్చీలో వ్యక్తి హాయిగా, నిశ్చింతగా నిద్రపోతున్నారు. మెల్లగా అడుగులు చప్పుడు కాకుండా దగ్గరగా వెళ్లాను. నా వూహే నిజమైంది. నాన్నగారు నా కోసం ఎదురుచూస్తూ పడక్కుర్చీ వేసుకుని వాకిట్లో కూర్చునివున్నారు కాబోలు. నిద్ర పట్టేసినట్టుంది.

నేను మెల్లగా నాన్నగారి పక్కనుంచి లోపలకి వెళ్లిపోయాను. అమ్మయ్య! ఒకవేళ ఆయన లేచిన తర్వాత ఎప్పుడు వచ్చావు అని అడిగితే "అప్పుడే వచ్చేసాను" అని చెప్పవచ్చు.

లోపల హాల్లోకి వచ్చాను. తాయారమ్మ అప్పుడే లేచినట్టుంది. తుమ్ముతోంది. ఆవిడ నిద్ర లేవగానే కనీసం అరడజనైనా తుమ్ములు 'హాచ్ హాచ్' అని తుమ్ముతుంది.

అమ్మ ఎప్పుడైనా అది వింటే "ఛీ! వెధవ కుంక" అని తిడుతుంది.

తాయారమ్మ లేచింది. పైకి వెళ్ళే ప్రయత్నం మానుకున్న నేను, అక్కడ వున్న పెద్దసోఫాలో కూర్చున్నాను. చెప్పులు వదిలి సోఫా క్రిందకి తోసేసాను. తర్వాత సోఫాలో గోడవైపుకి తిరిగి పడుకున్నాను.

నేను ఊహించిందే నిజమైంది. తాయారమ్మ తుమ్ముతూనే హాల్లోకి వచ్చింది.

"అదేమిటీ! అమ్మాయిగారా? ఇక్కడ పడుకున్నారు" అంటూ నన్ను పలకరించింది. నేను నిద్రపోతున్నట్టు కదలలేదు. మాట్లాడలేదు.

బైటకి వెళ్ళిన తాయారమ్మ 'అరే! బాబుగారు వరండాలో నిద్రపోతున్నారే" అనుకుంటూ లోపలకి రావటం వినిపించింది. పదినిముషాల తర్వాత నాకు గాఢమైన నిద్ర పట్టేసింది.

* *

ఉదయమే పెద్దపెద్ద గరిటలు పుచ్చుకుని నలుగురు వంటబ్రాహ్మణులు రావటంతో యింట్లో సందడి ప్రారంభమైంది. రేపు జరగబోయే ప్రధానానికి అమ్మ యీ రోజే యింట్లో స్వయంగా స్వీట్లు చేయించటానికి నిశ్చయించుకుంది. సోఫాలో పడుకునివున్న నేను బద్ధకంగా లేచాను. వంటబ్రాహ్మణుల్లో ఒకతను హెడ్ కాబోలు తను పిఠాపురం జమీందారుగారి యింట్లో ఒకసారి వంట చేసినప్పుడు వాళ్ళు మెచ్చుకుని సువర్ణ కడియం బహుమతి యిచ్చినవైనం చెబుతున్నాడు.

అమ్మ తాయారమ్మతో, "ఊ! ఊ! మాటలు తగ్గించి పని త్వరగా అయేలా చూడు.' అంటూ కసరటం వినిపించింది.

నేను లేచి దొడ్లోకి వచ్చాను. అప్పటికే అక్కడ యిద్దరు గాడిపొయ్యి తవ్వు



యువ

తున్నారు. అమ్మ స్నానానికి బాత్ రూమ్ లోకి వెళ్ళింది. నేను వంటగదిలోకి తొంగి చూసాను. తాయారమ్మగారు పని హడావుడిలో సర్కస్ చేస్తున్నట్టు నడుస్తోంది.

"తాయారమ్మగారూ! మీరు రాజుని మలక్ పేట—" అంటూ సందేహంగా ఆగాను.

ఆవిడ ఆమాట వినగానే గుడ్లు చిత్రంగా తిప్పుతూ, "వెళ్ళలేదండీ! రాత్రి—అమ్మగారు పడుకోబోయే ముందు మళ్ళీ ఏమి ఆలోచించారో ఏమో నన్ను పిలిచి ఆ అమ్మాయిని ప్రస్తుతానికి యిక్కడే వుండనీ అన్నాడు. నాకూ కూడా అదే నచ్చింది. యిలాంటి నక్కజిత్తుల వాళ్ళని మన కళ్ల ఎదుట వుంచుకోవటమే మంచిదనుకోండి" అంది.

దాదాపు గంట గడిచింది. నాన్నగారు కాఫీకి డైనింగ్ రూమ్‌లోకి వస్తే నేను దొడ్లోకి, ఆయన పైకి మేడమీదికి వెళితే నేను క్రిందా తాత్సారంచేసి ఆయనతో ముఖాముఖి ఎదురుపడకుండా తప్పించుకున్నాను.

అమ్మా—నాన్నగారు ఎక్కడికో వెళ్ళటానికి సిద్ధం అవుతున్నారు. బజారులో వాళ్లు యింకా కొనవలసినవి ఏవో వున్నాయిట.

అమ్మ నాన్నగారిని సంప్రదించి ఏదో లిస్ట్ రాస్తోంది.

నేను మెల్లగా రాజువున్న గది తలుపులు గడియతీసి లోపలకి వెళ్లాను.

రాజు మంచంమీద కూర్చునివుంది. గది తలుపులు తెరవగానే యిటు చూసిన అది నన్ను చూడగానే చప్పున ముఖం తిప్పేసుకుంది. నేను దగ్గరకి వెళ్ళాను. రాజు నా వునికి గమనించనిదానిలా కూర్చుంది. భుజంమీద చెయ్యి ఆనిస్తూ "రాజూ!" అంటూ అనునయంగా పిల్చాను. రాజు నా చేయి బలంగా విదిలించేసుకుంది.

నా వైపు తిరుగుతూ వెంటనే అంది "వదినా! ఆఖరిసారిగా అడుగుతున్నాను! నా మీద నీకు ఏమాత్రం అభిమానం వున్నా—అత్తయ్యకి జరిగినదంతా చెప్పేసి నన్ను వెంటనే నిమ్మలూరు పంపివేసేయి. మా అన్నయ్యమీద ఒట్టు వేసి చెబుతున్నాను. నీ కేలాటి భయంవద్దు. యిక్కడ జరిగిన వేవీ నేను ఎవరికీ చెప్పను.' అంటుండగానే దాని కళ్లలో నీళ్ళు వుబికి గిఱ్ఱున నిండాయి.

"ఒక్కరోజు ఓపిక పట్టావంటే, రేపు సాయంత్రం ఎవరికి ఎవరు చెప్పకుండా అందరికీ అంతా తెలుస్తుంది రాజూ!"

"అంతేనన్నమాట! అయితే యీ చిత్రవధ యింకా నేను 24 గంటలు భరించాలన్నమాటేగా! సరే! నీ యిష్టం. ఇక ఈ యింట్లో నేను వచ్చి మంచినీళ్ళు కూడా ముట్టుకోనన్న సంగతి నువ్వు బాగా గుర్తుపెట్టుకో!"

"రాజూ!'

"నువ్వు యిన్నాళ్ళూ నామీద చూపించిన అభిమానం నిజమే ననుకున్నాను. నా కిప్పుడు తెలుస్తోంది. అదంతా అబద్ధం! అదికూడా నీ నటనలో ఒక భాగం! పల్లెటూరి వెర్రిమొహాల్ని చేసి నీ చేతిలో పావుగా యిరికించుకున్నావు. అందుకే మా అన్నయ్యకి మీరంటే అంత 'అసహ్యం!'"

రాజు నావైపు సూటిగా చూస్తూ, రోషంగా అంటుంటే నా గుండెల్లో పొడిచినట్టయింది. క్షణంసేపు నోట మాట రానిదానిలా అయాను. ఆ వెంటనే ఒక్కసారి ఆవేశం పొంగులా ముంచుకు వచ్చింది. రాత్రి నేను కృష్ణతో మాట్లాడిన వైనం అంతా చెప్పేయబోయాను. ఇంతలో తాయారమ్మ హడావుడిగా లోపలకు వస్తూ, "అమ్మాయిగారూ! మీకు ఫోన్ వచ్చింది" అంది.

"నాకా!" గిరుక్కున వెనక్కి తిరిగిన నేను, తాయారమ్మని తోసుకుని, మెరపులా ఫోన్ దగ్గరికి పరుగెత్తాను.

"హలో!" ఎంతో ఆత్రుతగా పిల్చాను.

"హలో!" అవతలి కంఠం వినగానే నా ఆదుర్దా చప్పబడిపోయింది. ఫోన్ చేసింది కృష్ణ కాదు! సారధి!

"మీనా! నీతో అర్జెంట్‌గా మాట్లాడాలి. ఒక్క పదినిముషాలు యిక్కడకి వస్తావా?"

"నేనా? మీరే యిక్కడకి రావచ్చుగా?"

"ఉహు! అక్కడ అందరూ వుంటారు. మాట్లాడటం కుదరదు."

"అంత అర్జెంటా?"

"చాలా అర్జెంట్!"

"అయితే మమ్మీని అడుగుతాను." నాకు వెతకబోయిన తీగె కాలికి దొరికినట్టయింది. నేనెలాగో అతనిదగ్గిరకి వెళ్లాలని అనుకుంటున్నాను. అమ్మావాళ్ళు షాపింగ్‌కి వెళ్లి తిరిగివచ్చేలోపల సారధిని తీసుకుని కృష్ణదగ్గరకి వెళ్ళి వచ్చేయాలని నా నిశ్చయం

"మమ్మీని పిలు. నేనే అడుగుతాను." అన్నాడతను. అతని ధోరణి యీ రోజు చాలా అధికారంగా వుంది.

నేను తాయారమ్మచేత పైకి కబురు పంపాను.

అమ్మ గబగబా దిగివచ్చింది. ఫోన్‌లో మాట్లాడింది, సారధి ఏం చేస్తాడో ఏమో! ఆవిడ ముఖం వికసించింది. ఫోన్ పెట్టేయగానే నావైపు తిరిగి, "తొమ్మిదిగంటలకల్లా కారు పంపిస్తాట్ట! నువ్వు రెడీగా వుండు! నిన్న కొన్న ఆ చీర బాగా లేదుట! ఇంకోటి కొంటాడుట. వెంట అతని ఫ్రెండ్ — భార్యకూడా వస్తున్నారుట!" అంది.

అలాగే అన్నట్టు తల వూపాను.

పైకి వెళ్ళబోతున్న అమ్మ మెట్లదగ్గర ఆగి వెనక్కి తిరిగి, "ఏం చీర కట్టుకుంటావు?" అంది.

"ఏం కట్టుకోను?"

"ఆ అలివ్ గ్రీన్ ఎంబ్రాయిడరీ బార్డెట్ చీర కట్టుకో!" అని పురమాయించి వెళ్ళిపోయింది. పిడుగులు పడనీ! భూకంపంరానీ! అమ్మ నా బట్టల ఏన్నిక మర్చిపోదు. 24 గంటలూ నేను అపరంజి బొమ్మలా వుండాలని ఆవిడ ఆరాటం. గతంలోకి వెనక్కి తిరిగి చూసుకుంటే నా ఇష్టంవచ్చిన దుస్తులు ధరించిన యే చిన్న సంఘటణ నాకు గుర్తులేదు. ఇలాటివే మరెన్నో కలిపి నా మనసులో ఆవిడకి వ్యతిరేకించి ఏదయినా పని చేయాలనే తహతహకి బీజం నాటాయేమో!

ఇప్పటి కెప్పుడూ నా అయిష్టతని నిర్మొహమాటంగా ఆవిడకి తెలియచేయాలని అనుకోవటం తీరా ఆవిడ కెదురుగానే అన్నీ మింగేయటం నా కలవాటు అయిపోయింది. పెళ్ళి అనేది నా ఆఖరి ప్రయత్నం. ఈ ప్రయత్నంలో నేను విజయం పొందలేకపోతే యింకెప్పటికీ సాధించలేను. ఇది నాకు మృగతృష్ణ కాకూడదు.

నా జీవితంలో అమ్మని ద్వేషించే దుస్థికి నేనెన్నడూ వెళ్ళకూడదు. ఇది భగవంతుడి ముందు నా ఏకైక ప్రార్థన!

టంచనుగా 8 గం. కి సారధి పంపిన కారు వచ్చింది. అప్పటికే ముస్తాబు అయి వున్న నేను వెంటనే బైలుదేరి వెళ్లాను. దోవలో నా ఆలోచన్లు పరిపరివిధాల పోసాగినాయి. సారధి నాతో ఏం చెప్పబోతున్నాడు? రాజేశ్వరి విషయంలో క్షమార్పణ కోరబోవటం లేదుకదా? ఏదయినా ఒకటిమాత్రం నిజం! అతను చెప్పబోయే ఆ విషయం ఏదయినా నన్ను నిరాశమాత్రం పరచదు. అదేదో అతను మాట్లాడేసిన తర్వాత కృష్ణ విషయం చెప్పి, అతని దగ్గరకు తీసుకువెళ్తాను. ఒక్కసారి నా జీవితంలో ఎంతో ముఖ్యమైన యీ యిద్దరూ మాట్లాడుకుంటే నాకెంతో హాయిగా వుంటుంది. అసలు యీ పని నేను ఎప్పుడో చేయాల్సింది. మనకి జీవితంలో ముఖ్యమైన విషయాలన్నీ చాలా ఆలస్యంగా స్ఫురణకి వస్తూంటాయి.

నేను వెళ్ళేసరికి సారధి బెడ్ రూమ్ లోనే వున్నాడు. 9-30 అయినా అతను యింకా పక్కమీద నుంచి లేవలేదు. నైట్ డ్రెస్ విడవలేదు. రాత్రంతా నిద్రలేదు కాబోలు కళ్లు ఎర్రబడి కొద్దిగా వుబ్బివున్నాయి. ఒక్కరోజు గడ్డంచేసుకోబోతే అతనిముఖం ఎలుగుబంటిని గుర్తు చేసేట్టు యింత భయంకరంగా వుంటుందని నాకు మొదటి సారిగా తెలిసింది.

నేను గదిలోకి అడుగుపెట్టాను. అతను మంచంమీదనుంచి లేచేప్రయత్నం అయినా చేయకుండా ఏదురుగా నున్న కుర్చీ చూపిస్తూ. "కూర్చో!" అన్నాడు.

నా ముఖంలో భావం కనిపెట్టినట్టుగా గడ్డం తడుముకుంటూ, "ఈరోజు నాకు ఒంట్లో బాగాలేదు." అన్నాడు.

"జ్వరమా!" అన్నాను కుర్చీలో

మీ బహుమాన
ట్రాన్సిస్టర్‌కు
మీరు విలువిస్తే



# మీ ట్రాన్సిస్టర్ రేడియోకై వాడండి

# ఎవరెడి

## 1050 ట్రాన్సిస్టర్ బ్యాటరీ

ఈ రౌండ్ బ్యాటరీ
ట్రాన్సిస్టర్లకై శక్తినిచ్చేందుకు
మరియు సంరక్షించేదుకు
ప్రత్యేకంగా చేయబడింది.

- ఎక్కువ కాలం ఒకే విధమైన శక్తి నిస్తుంది.
- ఎక్కువ లీక్ నిరోధక శక్తిగలది—మీ ఖరీదైన ట్రాన్సిస్టర్ భాగాలను పాడుచెయ్యదు.
- స్పష్టమైన, ధ్వని వికలతలేని శబ్దగ్రహణ కలుగ జేస్తుంది.
- [illegible] పనిచేస్తుంది, అధిక మన్నిక.




UNION CARBIDE

ప్రతి మాదిరి ట్రాన్సిస్టర్ రేడియోకీ
ఒక 'ఎవరెడి' బ్యాటరీ ఉంది. కావలసినది తీసుకోండి.

రూ. 1-16 పన్నులు అదనం.

కూర్చుంటూ.

"కాదు. పెద్దషాక్ తగిలి మతి పోయింది."

నేను ఆశ్చర్యపడినట్టు చూడలేదు. రాజేశ్వరి వెళ్ళిపోవటం అతనికి షాక్ అని నాకు తెలుస్తూనేవుంది.

కుర్చీలో కూర్చున్న నేను గది కలియ చూశాను. ఆ పరిసరాల్లో ఏ మూలకి ఎటువైపుకీ తల తిప్పినా అంతు లేని ఐశ్వర్యం కళ్లకు కట్టినట్టు కని పిస్తోంది. కానీ అంత విలువైన వస్తువుల మధ్య కూర్చున్న అతను మాత్రం పొందాగాలేదు. ఆ ఐశ్వర్యం అతనికి అతకనట్టుగా, ఎరువు తెచ్చుకున్నట్టుగా వుంది.

"మీనా! నీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పదలచుకున్నాను." అన్నాడు

అతను ఏమాత్రం తాత్సారం చేయ నందుకు నాకు ఆనందం కలిగింది.

"చెప్పండి" అన్నాను.

"రేపు మనకి ప్రధానం జరగబోవటం లేదు."

నేను వులిక్కిపడ్డట్టు అయాను. వటుక్కున తలెత్తి చూడబోయి నా ముఖంలో ఆనందం ఎక్కడ పసిగడ్తారో నసే భయంతో అతి కష్టంమీద, నిగ్ర హించుకున్నాను. నిజం చెప్పాలంటే ఇంతమంచి వార్త నేనెప్పుడూ విన లేదేమో!

"ఈ ప్రధానం జరగకుండా ఆపే బాధ్యత నీది." సిగరెట్ పెట్టె తీసుకుంటూ అన్నాను.

"నేనా?" రెండోసారి వులిక్కి పడ్డాన

"అవును. నువ్వే."

"నేనా! నేనేం చేయగలను?"

"ఏదయినా చేయి. ఈ పెళ్ళి ఇష్టం లేదని చెప్పు. ఇంకెవరినైనా ప్రేమించా నను." ఈ మాటలు వినగానే నా ముఖం లోకి రక్తం సర్రున పాకి వచ్చింది. అతను అంటున్నాడు.

"లేకపోతే చచ్చిపోతానని బెదిరించు. ఏమైనాచేయి. ఈ ప్రధానం మాత్రం జరగకుండా ఆపు." అది అభ్యర్థనలా లేదు. అధికారంతో ఆజ్ఞాపిస్తున్నట్టుగా వుంది.

"ఆ పని మీరే చేయవచ్చుగా?"

"మొదట అలాగే చేద్దామనుకున్నాను. కానీ రాజేశ్వరిని మీరు అంత యుక్తిగా నిర్దయగా తరిమేసిన తర్వాత ఆ వుద్దేశ్యం విరమించుకున్నాను. తాడితన్నేవాడి తల తన్న గలవాడు వుంటాడని మీ అమ్మకి నిరూపించదలుచుకున్నాను. అంతేకాదు. నా అంతట నేను చెబితే నేను కొంత నష్టం భరించాల్సి వస్తుంది."

"అంతే?" అతని ధోరణికి విస్తు పోతూ అడిగాను.

"అంటే—నేను ఆ ఖరీదు క్షణంలో వద్దంటే మీ పరువుప్రతిష్టలు దెబ్బ



యు ప

శింటాయి. మీ వాళ్లకి నామీద ఆగ్రహం వస్తుంది. దాంతో నామీద ప్రతీకారం తీర్చుకోకమానరు. నేను ఢిల్లీనుంచి యిక్కడికి ఎలా వచ్చానో - ఎవరిపలుకుబడి వల్ల నా హోదా రెట్టింపు అయిందో నీకు తెలియంది కాదు. మీ అమ్మా నాన్నా బట్టి పుణ్యానికి నాకేం సాయం చేయలేదు. కాబోయే అల్లుడివనే ఆశతో అందలం ఎక్కించారు. ఇప్పుడు ఆ అందలంలో నీకు చోటు లేదంటే వాళ్లు నన్ను వదులుతారా? చెప్పుక్రింద బల్లిలా నన్ను నలపగలరు. మీనా! ఈ కాలంలో స్వలాభాపేక్ష లేకుండా ఎవరికీ ఎవరూ ఎలాటి సాయం చేయరు. అందులో మీ అమ్మ! ఆవిడ తలుచుకుంటే ఏదైనా చేయగలదు. ఆవిడతో వైరం పెట్టుకుని తలక్రిందులు చేసుకునేటంత మూర్ఖుడిని కాను నేను.''

నేను రెప్ప వాల్చటం మరచినట్టు అతనివైపు చూడసాగాను. అతను ఆ సమయంలో సభ్యత— సంస్కారం అనే ముసుగు విసర్జించి అసలు స్వభావం చూపిస్తున్నట్టుగా వుంది. అతను మళ్ళీ అన్నాడు.

''నేనిలా కోరటంలో కేవలం నా స్వార్థమే కాదు, నీ మంచికూడా వుంది. ఎందుకంటావా పీటలవరకూ వచ్చిన పెళ్ళి ఆగిపోతే మగవాడిని అయిన నా కంటే— ఆడపిల్లవైన నీకే కష్టం ఎక్కువ. నీకు మరో సంబంధం రావటం కష్టం.''

''యిది బెదిరింపా?'' సూటిగా అడిగాను.

''ఎలా అనుకున్నా నాకు అభ్యంతరం లేదు.'' నిర్లక్ష్యంగా వస్తోంది సమాధానం.

''హఠాత్తుగా మా మీద యింత పగ దేనికి?''

''చెప్పానుగా! రాజేశ్వరిని మీరు నిర్దయగా తరిమివేసినందుకు.''

''ఆ మాట అమ్మతో సూటిగా చెప్పవచ్చుగా? యీ పిరికిదనం దేనికి?''

''నే నెందుకు మిమ్మల్ని వదలాలి? నన్ను ఏం చేయలేని మీరు నోరులేని రాజేశ్వరి మీద మీ ప్రతాపం అంతా చూపించలేదూ. ఏ వుచ్చుతో నన్ను మీరు బంధించాలనుకుంటున్నారో ఆ వుచ్చునే మీకు తగిలిస్తాను.'' నేను లేచి నిలబడ్డాను.

సారధిలో మేకవన్నె పులిలా దాగి వున్న యీ తెగింపులకి ఆశ్చర్యపోయాను. పాచికలు విసరటంలో ఇతను అమ్మకిమించినవాడులా వున్నాడు. ఇంతకంటే రాజేశ్వరిమీద అనురాగం బైట పెట్టి నన్ను సాయంచేయమని కోరివుంటే నే నెంతో సంతోషించి వుండేదాన్ని.

అతను నా వైపు చూస్తూ అన్నాడు. ''నువ్వు అనవసరంగా ఆవేశపడకు. ఇందులో నీకు జరుగుతున్న అన్యాయం ఏమీలేదు.''

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి!



పిల్లల శక్తి చదువుల్లో ఆటల్లో
త్వరగా హరింపు అయిపోతుంది.
శక్తిని తిరిగి సమకూర్చటానికి ప్రతి
దినం వారికి బోర్న్‌విటా ఇవ్వటం
మంచిది. క్యాడ్‌బరిస్ తయారుచేసిన
రుచికరమైన కోకో, పాలు, మాల్ట్
మరియు పంచదారల సంతులిత
మిశ్రమం–బోర్న్‌విటా.




## శక్తి, ఉత్సాహం మరియు
## రుచికోసం క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా!

Bensons/4664 Tel

అతనిగొంతు హఠాత్తుగా నమ్రతగా మారింది. "మనం అలగావాళ్ళం కాదుగా! అభిప్రాయభేధాలు కలగగానే వీధినపడి కొట్లాడుకోటానికి! పెద్ద కుటుంబాలవాళ్ళ మయ్యే! ఏది జరిగినా గోప్యంగా జరగాలి." ఆ గోప్యం అనేమాటలో కావాల్సినంత వ్యంగ్యం వుంది. నాకు అతన్ని బాగా రెచ్చగొట్టాలనిపించింది.

"మీరు కోరినట్టు నేను చేయకపోతే?" అన్నాను.

"నేను బైటపడాల్సి వస్తుంది. నేను బైటపడటం అంటూ వస్తే మీ అమ్మాన్నా జన్మలో యిక వీధి ముఖం చూసే ప్రాప్తం వుండదు."

"అంటే మీ వుద్దేశ్యం!"

"నువ్వు మర్యాదగా చెబితే సరి, లేకపోతే ఆఖరిక్షణంలో నిన్ను నేను తిరస్కరిస్తాను."

"కారణం ఏం చెప్పగలరు మీరు?" వాదిగా అడిగాను.

"ఏదయినా చెప్పగలను. నీ ప్రవర్తన మంచిదికాదని తెలిసింది అంటాను. నిన్న 'బాంబే బజారు'లో కలిసిన నీ చిన్ననాటి స్నేహితుడికీ నీకూ సంబంధం వుందంటాను. మీ అమ్మంటే మండిపడుతున్న మా పిన్ని నాకు పూర్తి మద్దతు ఇస్తుంది."

నా పళ్లు కటకటలాడినాయి. ఆవేశంతో నా గుండెలు ఉవ్వెత్తున లేచిపడ సాగినాయి. ఫూల్! ఇడియట్! అతన్ని చాచి చెంప పగలగొట్టాలనిపించింది. కానీ ఎలాగో నిగ్రహించుకున్నాను. ఇతను చెప్పినట్టు ఛస్తే చేయకూడదు అనిపించింది. అందుకే సగర్వంగా, ధీమాగా, ఖచ్చితంగా చెప్పేసాను.

"సరే! అదేమిటో నేనూ చూస్తాను. మీరు మమ్మల్ని ఏం చేయలేరు. మా కుటుంబ పరువు ప్రతిష్టలు అగ్నిలాటివి! వాటిని కాలేయాలని చూసినవాళ్ళు విలువూనా భస్మం అవుతారే తప్ప మాకేం హాని జరగదని మీరు త్వరలోనే తెలుసుకుంటారు. వస్తాను." అంటూ గిరుక్కున వెనక్కి తిరిగి గబగబా గుమ్మంవైపు నడిచాను.

"పరువు ప్రతిష్టలు! హు! చాలా పరువుగల కుటుంబం! పాపం! కూతురుగారు చిన్ననాటి స్నేహితుడు అని చెప్పే పెద్దమనిషితో, రాత్రంతా హోటల్ రూమ్‌లో గడిపితే—తండ్రి వచ్చికూడా వెంట తీసుకువెళ్ళలేని అసమర్ధుడు!"

ఈ మాటలు వ్యంగ్యంగా, పరుషంగా, నామీద పిడుగుల్లా వచ్చిపడ్డాయి. క్షణం సేపు నా కళ్ళు బైర్లు కమ్మినట్టయినాయి. గుమ్మం దాటబోతున్న నేను కళ్లముందు చీకటితెరలు కమ్మటంతో చప్పున తలుపు మీద చెయివేసి పట్టుకుని ఆగాను.

"పరువు! మాలావు గొప్ప పరువు!" వెనకనుంచి అతని కంఠం హేళనగా, వెక్కిరింతగా వినిపించింది. నేను మెల్లగా, నాలో శక్తినంతా కూడదీసుకుని

వెనక్కి తిరిగాను.

"ఏమిటి మీరనేది?"

"ఏమిటా? రాత్రి 11 గంటలకి నువ్వు వంటరిగా తాజ్‌మహల్ హోటల్లో ఆ కృష్ణారావు గదికి వెళ్లలేదూ? అరగంట తర్వాత మీ నాన్న వచ్చికూడా నిన్ను యింటికి పిల్చి తీసుకువెళ్లలేనిమాట అబద్ధమా! రాత్రంతా నువ్వు అతనితో గడిపి తెల్లవారుఝామున యింటికి వెళ్లినమాట కాదనగలవా నువ్వు?"

"అనను! కానీ యిదంతా మీ కెలా తెలుసు?"

"ఎలా తెలుసా? నీ దగ్గర చెప్పాల్సిన ఖర్మ నాకేంలేదు. రాజేశ్వరి వెళ్ళిపోయిందనగానే మతిపోయిన నేను స్టేషన్‌కి వెళ్తే రైలు అప్పటికే వెళ్ళిపోవటంతో—యింటికి తిరిగిరావటం ఇష్టంలేక, వంటరిగావుంటే పిచ్చి ఎక్కుతుం దేమోననే భయంతో కార్డ్సు ఆడటానికి ఆ హోటల్లో దిగిన ఒక పంజాబీ ఫ్రెండ్ రూమ్‌కి వెళ్ళాను. ఆ గది సరిగ్గా మీ కృష్ణారావు గదికి ఎదురుగా వుండటం నా అదృష్టం?'

"మరి అప్పుడే ఎందుకు అడగలేదు నన్ను?" పళ్ళ బిగువున అడిగాను.

"ఎందుకు అడగాలి! రాజేశ్వరి విషయంలో మీరు నన్ను అడిగారా? ఎంత మర్యాద నటించారు? మీనా! ముందే చెబుతున్నాను. రేపు ఈ ప్రధానం జరగటానికి వీల్లేదు. మీ అమ్మకి ఏం చెబుతావో ఏం చేస్తావో నీ యిష్టం. నువ్వేం చెప్పకపోతే రేపు సాయంత్రం యీ సంఘటన బైటికి తెచ్చి మిమ్మల్ని నలుగురిలో నవ్వులపాలు చేసి తీరుతాను!" సారథి మంచంమీదగుద్ది మరీ చెప్పాడు.

నేను వెనక్కి తిరిగాను. నా కళ్ళ ముందు ఏవేవో దృశ్యాలు గబగబా తిరుగుతున్నాయి! నాకు తెలుసు! సారథి మా మీద కోపంతో అన్నంతపనీ చేసి తీరుతాడు. అమ్మని ఎదిరించలేని పిరికిపంద అయిన అతను నన్ను బెదిరిస్తు న్నాడు. గబగబా పరుగులాటి నడకతో బైటికి వచ్చిన నేను అక్కడ సిద్ధంగా వున్న కారులో కూలబడ్డాను. అక్కడే నిలబడివున్న డ్రైవర్ నన్ను చూడగానే చప్పున వచ్చి డ్రైవింగ్‌సీట్‌లో కూర్చు న్నాడు.

"పోనీ" అన్నాను. నా మెడదగ్గర, నుదుటిమీద చిరుచెమటలు అలుముకో సాగినాయి. ఆఖరి నిముషంలో యిదే దయినా వక్రిస్తే! నాకు వూపిరి ఆడక వుక్కిరి బిక్కిరి అయిపోతున్నంత ఖంగారుగా వుంది. మా యింటివైపు మలుపుతున్న డ్రైవర్‌తో "యింటికి పోలేదు. తాజ్‌మహల్ హోటల్‌కి పోనీ" అన్నాను.

*  *

హోటల్ ఆవరణలో కారు ప్రవేశించగానే, అప్పటికీ హాండిల్‌మీద చెయివేసి సిద్ధంగావున్న నేను చటుక్కున డోర్



తీసు వ

# జామెట్రీ సులభతరం జాగ్రఫీ సుందరతరం చేసుకోండి...

రేఖాగణితాన్ని బాగా అభ్యసించండి, మ్యాప్ డ్రాయింగుకు రంగులు దిద్దండి.... కేమ్లిన్ ఇన్‌స్ట్రుమెంటు బాక్సును, రంగు పెన్సిళ్లను ఉపయోగించండి. ఒకటి ఉపయోగంలో ఖచ్చితమైనది, చూడ ముచ్చటైనది; రెండవది మెత్తగా సాఫీగా వ్రాస్తుంది—రెండూ చాలా కాలం మన్నుతాయి, పాడై పోకుండా ఉంటాయి: పొదుపైనవి కూడా.

అనేక రకాల ఆర్ట్ సామగ్రి, మీకు పనికి వచ్చేవి కూడా, కేమ్లిన్ వద్ద లభిస్తాయి—వేక్స్ క్రేయాన్లు, వాటర్ కలర్సు, పోస్టర్ కలర్సు—ఇంకా ఎన్నో. వాటి కోసం మీకు దగ్గరలో నున్న దుకాణంలో అడగండి.

## కేమ్లిన్

రంగు పెన్సిళ్లను,
ఇన్‌స్ట్రుమెంటు
బాక్సును ఉపయోగించండి.









కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్,
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్,
జె.బి. నగర్, బొంబాయి 59 ఎ.ఎస్.
(ఇండియా)

PRATIBHA 1710-28 TEL

తెరిచి క్రిందకి దిగుతూ, "నా కోసం వెయిట్ చేయవద్దు. నువ్వు యింటికి వెళ్లిపో." అనేసి హొటల్లోపలకి పరుగెత్తాను. ఆక్కడ పైకి వెళ్ళటానికి సమయానికి లిఫ్ట్‌కూడా సిద్ధంగాలేదు. దాని కోసం ఆగే ఓపికలేని నేను మెట్లమీద నుంచి గబగబా పైకివెళ్లాను. ఆదుర్దాతో, భయంతో నా నాలుక తడారిపోయినట్టు అయింది.

కృష్ణ రూమ్‌లో అడుగుపెట్టేసరికి ఆయాసంతో నా నోట్లోంచి మాట రానంత పని అయింది. గదితలుపులు తెరిచే వున్నాయి. నేను వెళ్ళేసరికి కృష్ణ యింకెవరితోనో కూర్చుని మాట్లాడుతున్నాడు. నన్ను చూడగానే మాట మధ్యలో ఆపేసి. ఆశ్చర్యంగా లేచివ "మీనా!" అన్నాను.

అక్కడ అపరిచిత వ్యక్తి వుండటంతో నేను యిబ్బందిగా చూసాను: కృష్ణ యిది గమనించినట్టుగా, "యితను నా ఫ్రెండ్ మధు. మధూ! మీనా!" అంటూ పరిచయం చేసాడు.

"ఓ!" అతను నా గురించి విన్నవాడిలా సంభ్రమంగా లేచి నిలబడి నమస్కరించాడు. నేను అతనికి ప్రతి నమస్కారం చేయలేదు. కృష్ణవైపు చూస్తూ, "నేను నీతో అర్జెంట్‌గా మాట్లాడాలి." అన్నాను.

కృష్ణ నావైపు ఆదుర్దాగా చూసాడు. నా వాలకం అతనికి విచిత్రంగా వున్న

ఱుంది.

"నేను బైటకి వెళ్లనా?" మధు అడిగాడు.

"అవసరం లేదు. కూర్చో! మీనా, లోపలకి రా." అంటూ కృష్ణ డ్రెస్సింగ్ రూమ్‌లోకి దారితీసాడు.

నేను లోపలకి వెళ్లగానే "ఏమిటి?" అన్నాడు.

"సారథికి నేను రాత్రంతా యిక్కడ వున్న సంగతి తెలిసింది."

కృష్ణ కళ్లు చురుగ్గా అయినాయి.

"రేపు జరగబోయే ప్రధానం జరగ దంటున్నాడు." అనేసాను.

"అలా అని మీ అమ్మకి చెప్పాడా?"

"ఉహూ! నన్ను పిలిచి చెప్పాడు. చెప్పాడు అనేకంటే బెదిరించాడు అంటే బాగుంటుంది. యిక నువ్వు ఆలస్యం చేస్తే లాభం లేదు. రేపు సాయంత్రం లోపల మన వివాహం జరిగేలాచూడాలి."

అతని కనుబొమలు కొద్దిగా పైకి లేచినాయి.

"యింత త్వరగానా? అదెలా సాధ్యం?"

"నువ్వు తలుచుకుంటే సాధ్యంకానిది ఏదీ వుండదు. రేపు సాయంత్రం లోపల నేను నీదాన్ని కాకపోతే యిక యీ జన్మలో కాలేను!"

"మీనా! నువ్వు చాలా ఆవేశంలో వున్నావు—"

"ఆవేశమా! కాదు. ముమ్మాటికీ

కాదు. నా భయం నీ కర్థంగాదు. అర్థమయేలా ఎలా చెప్పాలో నాకు అసలే తోచటం లేదు. నువ్వు దయయుంచి తర్కానికి దిగవద్దు. ప్లీజ్!"

"సరే అయితే! నీ యిష్టప్రకారమే కానీ! నేను యీ సాయంత్రమే మాట్లాడుతాను."

"నాన్నగారితోనా? ఎందుకు? ఏమని?"

"నీమొహంలా వుంది. ఎందు కేమిటి?"

"నాన్నగారికి మన విషయం చెబుతావా?" గుండెలమీద చెయి ఆనించుకుంటూ అడిగాను.

"చెప్పకుండా ఎలా? అమ్మకి తెలియకపోయినా ఫర్వాలేదు. తర్వాత నేను నచ్చచెప్పగలను. కానీ మామయ్యకి తెలియకుండా ఏలా?"

"ఎవరికీ తెలియటానికి వీల్లేదు. ముఖ్యంగా నాన్నగారికి అసలే తెలియకూడదు."

" .. ...."

"యిది నా అభ్యర్ధన! కాదు కాదు. షరతు. నువ్వు నాన్నగారికి యీ విషయం తెలియచేయాలని చూసావంటే నేను నీ చుట్టుపక్కల ఏక్కడా వుండను."

కృష్ణ చకితుడైనట్లుగా, నా ముఖంలో భావాలు చదవటానికి ప్రయత్నిస్తున్నట్లుగా నిలబడిపోయాడు.

నేను అతని చెయ్యి నా చేతుల్లోకి తీసుకున్నాను. బతిమలాడుతున్నట్టుగా అన్నాను. "నువ్వు సంకోచాలు—సందేహాలు అవతలపెట్టు. పెడతావుకదూ?"

క్షణంసేపు తదేకంగా నా ముఖంలోకి చూసిన అతను, చేతుల్ని మృదువుగా విడిపించుకుని వెళ్ళి కిటికీదగ్గరగా నిలబడ్డాడు.

ఐదు నిముషాలు గడిచాయి.

నేను అతని దగ్గరగావెళ్ళి భుజంమీద చెయ్యి వేసాను.

"నువ్వు నీ నిర్ణయం చెప్పటం ఆలస్యం చేసినకొద్దీ నాకు భయం ఎక్కువవుతుంది. నేను ఏరి కోరి, నీ జీవితంలోకి బలవంతంగా ప్రవేశిస్తున్నాను. భవిష్యత్‌లో ఎప్పుడైనా వెనక్కి తిరిగి చూసుకుంటే, నేను సాహసించాను అనే ఆనందం యీ క్షణంలో జ్ఞాపకంగా మిగిలేట్టు చెయ్యి.'

అతను మాట్లాడలేదు. నేనే మళ్ళీ అన్నాను.

'ఏమిటి నీ సందేహం? మనం మాట్లాడుకోవలసినవన్నీ రాత్రి ముగిసాయని నేను అనుకుంటున్నాను. నా నమ్మకం వమ్ముచేయవుగా?"

కృష్ణ అప్పటికీ జవాబు చెప్పలేదు. నాకు రోషం వచ్చేసింది.

(ఇంకా వుంది)

Published by A. Thirupathi Rayudu at No. 1, Arcot Road, Madras-26.
and Printed by G. Veera Brahmam at his Anuradha Acchagam,
146, T. H. Road, Madras-21.
Controlling Editor : "CHAKRAPANI"



Kiron



యదార్థంలో ఇతను

